# ప్రథమఖణ్డము.

---

## ౧ - మంత్రము.

### అవతారిక

సామవేదమున, మొదటి యేడధ్యాయములయందు కర్మానుష్ఠానము చేయవలసిన వివరములు సవిస్తరముగఁ జెప్పఁబడి, తరువాత, మోక్షమును (సకలసంసారనివృత్తిని) బొందఁగోరువారు కృతార్థులగుటకై బ్రహ్మవిద్యావాప్తి సాధనములను దెలియచేయుటకు, “కేనేషిత” మని, యనిమిదవయధ్యాయము ప్రారంభించుచున్నది. అందువలననే ఈ యుపనిషత్తునకు కేనోపనిషత్తనియు, ఇయ్యది సామవేదమున ౮-వ అధ్యాయమునం దుండునదియనియు నెఱుంగునది.

ఈవిధముగా ప్రతివేదములయొక్క ప్రారంభమందు కర్మవిషయములను, అట్టి కర్మముల నీశ్వరార్పణబుద్ధిగాఁ జేసి, తద్వారా చిత్తశుద్ధినిఁ బొందియుండువారలకు నుపయుక్తముగా బ్రహ్మ (ఆత్మ) విషయము తెలియఁజేయఁబడియున్నది. విచారణ శూన్యులై, విషయాశక్తిగలవారలునగు పామరులు, చిత్తశుద్ధికలుగుటకై భగవదర్పణముగా కర్మానుష్ఠానముచేయవలసినదని విధించుచున్న వేదముయొక్క ప్రథమభాగమును తెలిసికొనక ఇది మంచిది ఇది చెడ్డది, ఇది ధర్మమిది యధర్మమని తెలిసికొనుటకు నవకాశములేక, తెలివిరహితులుగనుండి, ఆహార నిద్రా భయ మైథునములయందు మాత్రము ప్రవర్తించుచుండు పశ్వాదిస్థావరములవలె, కర్మముల సకామ్యముగాఁ జేసి పితృయాణమార్గముగా వెళ్లుటకు ప్రవర్తించి పుట్టుచుఁగిట్టుచు నధోగతిని పొందుచున్నారు.

ఈ మూడు తెరగులవారి వివరమెట్టిదనిన :—

1. కర్మమే ముఖ్యమనియు, కర్మమునకన్న శ్రేష్ఠమైనది లేదనియు, దలంచియుండు మొదటితరగతివారు, ఫలములయం దత్యాపేక్షగలవారలై, వేదాంతము, జ్ఞానము, మొదలగుమాటలనుగాని, వానినిఁగూర్చిన ప్రవచనములనుగాని వినుట తటస్థమైనప్పటికిని, వానిని తమచెవులకు నారాచములుగాఁదలంచి దూరమునఁదొలఁగువారు.

2. కర్మమే ముఖ్యమనియు, కర్మమునకన్న శ్రేష్ఠమైనది లేదనియు, వాచా [illegible] రెండవతరగతిలో చేరినవారు. వీరు, ఇతరులు తమ్ము

గొప్పవారని జెప్పునట్లు నటించుచు తమ వాక్చాతుర్య భాషణములచే నన్యుల భ్రమిం పఁజేయుచు తన్మూలంబుగ ద్రవ్యమార్జించి వారివలన పొగడఁబడవలయునను దలం పుతో వారియెదుటమాత్రము మహాకర్మఠులవలె నటించుచు, వారిచాటున నట్టి యనుష్ఠానములఁ జేయకయు, తమ మనస్సున కర్మమందు పట్టుదలెంతయు లేకయు నల్లాడుచుండువారు.

3. కర్మమే ముఖ్యమనియు, కర్మమునకన్న శ్రేష్ఠమైనది లేదనియు, వాచా మాత్రముగఁ జెప్పుచు తాను "విశ్వతోముఖాది" గొప్పకర్మలను జేయ సంకల్పితుల బోలె ననేక దేశాటనములఁ జేసి, అచ్చటచ్చట నీతంత్రమున కావలసిన విత్తములను పోగుఁ జేయుచు, కర్మలయం దెంతయు శ్రద్ధయు నమ్మకము లేమిచేత తద్ద్రవ్యము లన్నియు దొంగలచే దోచుకొనబడినవను నొక మిషకల్పించి, ప్రచురించి, అందఱి నమ్మించి, పిదపఁ వానిని దనకు తోచినప్రకారము వ్రయముఁ జేయుచు నుభయభ్ర ష్టులై చెడిపోవువారు. ఇటువంటి మూడువిధ మూఢులు ఈ ప్రపంచమందుఁ బుట్టుచుఁ జచ్చుచు దుర్గతినిఁ బొందుదురుగాని నెప్పటికైనను కృతార్థులు కాఁజాలరు.

ఇట్టి కర్మములయొక్క ఫలములగోరక, భగవదర్పణము గాఁజేసి చిత్తశుద్ధిని పొందియుండువాఁడు, పూర్వజన్మకృత సుకృతమువలన నిప్పుడాచరించు నిష్కామ కర్మలవలనను, శుద్ధచిత్తుఁడై, విరక్తుఁడై, ఆత్మజిజ్ఞాసువై భగవంతుని విషయమై (ఆత్మవిషయమై) విచారణఁ జేయుటకు ప్రవర్తించును.

ఇందు కుపయుక్తముగా :—

శ్రు॥ పరాఞ్చిఖానివ్యతృణత్స్వయమ్భూః
తస్మాత్ పరాఙ్పశ్యతినాన్తరాత్మన్।
కశ్చిద్ధీరఃప్రత్యగాత్మానమైక్షత్
ఆవృత్తచక్షురమృతత్త్వమిచ్ఛన్॥

(కఠోపనిషత్-అ, 2. వల్లి, 4. వా, 1.)

తా॥ బాహ్యవిషయములయం దాసక్తిఁగలిగిన ఇంద్రియములుగల మోక్షా పేక్షకులు, అంతర్యామియగు నాత్మస్వరూపమును గ్రహింపఁజాలరు. మోక్షా పేక్షకులైనవారిలో వేయింటిలో నొకడు బాహ్యవిషయములయందు పరువిడు

నింద్రియములను మఱలించి మనోనిగ్రహమునుబొంది అంతర్యామియగు భగవత్స్వరూపమును (ఆత్మస్వరూపమును) స్వానుభవముచే గ్రహింపఁగలఁడు. అనియు,

శ్రు॥ పరీక్ష్యలోకాన్ కర్మచితాన్ బ్రాహ్మణో
నిర్వేదమాయాన్నాస్త్యకృతఃకృతేన।
తద్విజ్ఞానార్థం సగురుమేవాభిగచ్ఛేత్
సమిత్పాణిశ్శ్రోత్రియం బ్రహ్మనిష్ఠమ్॥

(ముండ-1. ఖణ్డ, 2. వా, 12.)

తా॥ తాను యజ్ఞము మొదలగుఁ గర్మములను జేసి సంపాదించిన పుణ్య లోకములనుగూర్చి శాస్త్రములవలనను, పెద్దలవలనను, విచారణచేసి, ఆసక్తితో ఫలములఁగోరి యొనర్చిన యన్నికర్మములును పునరావృత్తిగలదిగాఁ దెలిసికొని వైరాగ్యమునొంది పునరావృత్తిరహితమును పొందుటకు ముఖ్య సాధనమైన జ్ఞానమునుబొందుటకై, అన్నిశాస్త్రములఁ జదివిన పండితుఁ డైనను తానే స్వతంత్రముగా బ్రహ్మజ్ఞానమునుపొందుట యతిదుర్లభము గనుక, అవిద్యానివారణముఁచేయుటకుఁ దగిన సద్గురువును పొందఁదగిన విధముగాఁబొంది, సాష్టాంగ వందనములు సమర్పించి వారి మనోభీష్టప్రకారము గురుకులవాసముఁ జేయవలసినది.

ఇట్లు పైనఁ జెప్పఁబడినవిధముగా నిష్కామ కర్మానుష్ఠానముగల విరక్తునికి ఆత్మవిషయకజ్ఞానమునుగూర్చి వినుటకును, మననముచేయుటకును, స్వానుభవముచేఁ దెలిసికొనుటకును సామర్థ్యముకలుగును. ఇట్టి స్వానుభవమువలన, సంసారబీజమనియు, కామ్యకర్మప్రవృత్తికారణమనియు, అజ్ఞానపుంజమనియుఁ జెప్పఁబడు అవిద్య, సమూలముగా నివర్తించును. అట్టివానికి:—

శ్రు॥ తత్రకోమోహః? కశ్శోకః? * * * * *

(ఈశా, 7-వ మంత్రము.)

తా॥ శోకమోహము లెక్కడిది?

అనియు, అట్టివాఁడే:—

శ్రు॥ భిద్యతేహృదయగ్రన్థి శ్ఛిద్యన్తేసర్వసంశయాః।
క్షీయన్తేచాస్యకర్మాణి తస్మిన్దృష్టేపరావరే॥

(ముండ-7. ఖణ్డ, 7. వా, 9.)

తా॥ గురూపదేశపూర్వమైన యనుష్ఠానముకలవాఁడు హృదయకాలుష్యమును భేదించును, సకలసంశయములను ఛేదించును, అనేకజన్మములుగా వెంబడించుచున్న కర్మఫలములను క్షీణింపజేయును.

అటువంటి నిష్కామ కర్మానుష్ఠానపరుఁడే:—

శ్లో॥ అహఙ్కారసుతంవిత్తం భ్రాతరంమోహమన్దిరమ్।
ఆశాపత్నీంత్యజేద్యావత్ తావన్ముక్తోనసంశయః॥

తా॥ సన్యసించువాఁడెట్లు, విత్తేషణ, దారేషణ, పుత్రేషణ లనఁబడు ఏషణాత్రయములను విడువవలసినదో, అట్లు అహంకారమను కొడుకును వదలినవాఁడుగను, ద్రవ్యమునందును బంధువులయందును కలిగియుండు మోహమును సహోదరుని విడిచినవాఁడుగను, ఆశయనుభార్యను వదలినవాఁడుగాను నుండువాఁడు ముక్తుఁడగును.

కాఁబట్టి, బ్రహ్మజ్ఞానము పై జెప్పఁబడిన నిష్కామకర్మానుష్ఠాన పరుఁడగు విరక్తునిచే సద్గురూపదేశమువలన పొందఁదగినదేగాని, తర్కము మొదలగు శాస్త్రపాండిత్యములచే పొందఁదగినదికాదను నంశమును బ్రకటించుటకై, ప్రశ్నోత్తరపూర్వముగ నీకేనోపనిషత్తను శ్రుతిప్రారంభింపఁ బడుచున్నది.

అందువలన మోక్షాపేక్షగల సాధనచతుష్టయ సంపన్నుఁడు:—

శ్లో॥ తద్విద్ధిప్రణిపాతేన పరిప్రశ్నేన సేవయా।
ఉపదేక్ష్యన్తితేజ్ఞానం జ్ఞానినస్తత్త్వదర్శినః॥

(భగవద్గీతా-అ, 4. శ్లో, 34.)

తా॥ ఆచార్యసన్నిధికిఁబోయి, సాష్టాంగ నమస్కారములఁజేసి, బంధమననేమి? విద్యయెట్టిది? అవిద్యయెట్టిది? అను నీమొదలగు తత్త్వములను దెలియఁజేయు ప్రశ్నలనుజేసి శుశ్రూష చేయుచున్నయెడల, బ్రహ్మతత్త్వవేత్తయును జ్ఞాననిష్ఠాపరుఁడునగు నాచార్యుఁ డట్టి జ్ఞానయోగప్రకారమునుపదేశించును.

---

సాధనచతుష్టయమనఁగా :—

౧. నిత్యానిత్య వస్తువివేకము,

౨. ఇహాముత్రార్థ ఫలభోగ విరాగము,

౩. సమాధి షట్క సంపత్తి,

౪. ముముక్షుత్వము,

అని నాల్గువిధములై యున్నవి. అందులో మొదటిదియగు నిత్యానిత్యవస్తువివేకము ఎట్టిదనిన:—

శ్లో॥ నిత్యమాత్మ స్వరూపంహి దృశ్యంతద్విపరీతకమ్।
ఏవంయోనిశ్చయస్సమ్య గ్వివేకోవస్తునస్సవై॥

తా॥ మనము చూచునట్టిదియు వినునట్టిదియు నగు సమస్తమును గురుముఖముగా చక్కగా విచారణచేసి, నిత్యమగు వస్తువును లెస్సగఁ దెలిసికొని అనిత్యమగు వస్తువులయందు కలుగు సత్యబుద్ధిని మాని (త్రిప్పి) నిత్యమగు ఆత్మయందే మనస్సును నిలుపుటయే, నిత్యానిత్యవస్తు వివేకమనఁబడును.

అదియెట్లనిన, ఎండమావులనుజూచి నీరని నమ్మి, స్నానపానాది క్రియలను జేయుటకుఁ బ్రయత్నపడినవాఁడు, యెంతదూరము పోయినను నట్లేకనఁబడుటచేత నవి యెండమావులుకాని నీళ్లుకావని నిశ్చయముగా తెలిసికొనినప్పుడు, మునుపటివలె నెండమావులవలన స్నానము, దప్పిక తీరుననుభ్రమపోయినను అవికనఁబడుట మాత్రము మానవు. కనఁబడినను వానియందు సత్యబుద్ధినుంచఁడు. అట్లే తానుజూచున

వియ వినునవియునగు నీప్రపంచవస్తువుల యొక్క వాస్తవమును శాస్త్రోక్తముగా విచారణ చేయునప్పుడు, అవి నామరూప వికారములనియు, అనిత్యమనియు నెఱుంగును. అట్లెఱింగినను కనఁబడుటమాత్రము మానవు. కనఁబడినను శాస్త్రోక్తముగా నిర్ణయము చేసికొనిన పిదప, వానియందు కలుగు సత్యబుద్ధిని నివర్తింపవలయును. ఎట్లు యెండమావులయందు అనిత్య అసత్య బుద్ధియు, నీళ్లయందు నిత్యసత్యబుద్ధియు కలిగియుండవలెనో, అట్లు ప్రపంచమందనిత్య అసత్య బుద్ధియు, భగవంతునియందు (ఆత్మయందు) సత్య నిత్యబుద్ధియు దృఢముగా కలిగియుండుటయే నిత్యానిత్యవస్తు వివేకమనఁబడును.

౨. <u>ఇహాముత్రార్థఫల భోగవిరాగము</u>, ఎట్టిదనిన:—

శ్లో॥ బ్రహ్మాదిస్థావరాన్తేషు వైరాగ్యంవిషయేష్వను।
యథైవకాకవిష్ఠాయాం వైరాగ్యంతద్ధినిర్మలమ్॥

తా॥ పైనచెప్పఁబడినట్లు స్థిరమయిన నిర్ణయముగలవాఁడు చూచు నీప్రపంచము నెక్కయు, విను స్వర్గాదులయొక్కయు భోగము లనిత్యమనియు, నసత్యమనియు తెలిసికొని, వానిని మలమూత్రాదులవలెను, వమనాశనమువలెను, కాకిరెట్టవలెను నిందింపఁదగినవని వైరాగ్యమును బొందియుండుటయే, ఇహాముత్రార్థ ఫలభోగవిరాగమనఁబడను.

3. <u>సమాధిషట్కసంపత్తి</u>, ఎట్టిదనిన:—

1. శమము. 4. తితిక్ష.
2. దమము. 5. శ్రద్ధ.
3. ఉపరతి. 6. సమాధానము.

అని ఆఱుతెఱంగులుగలది. వాని వివరములు:—

శ్లో॥ సదైవవాసనాత్యాగః శమోయమితిశబ్దితః॥

తా॥ లోకవాసన, దేహవాసన, శాస్త్రవాసన, అనిఁజెప్పఁబడు వాసనాత్రయములను విడుచుటయే <u>శమ</u>మనఁబడును. అనఁగా, అంతరిన్ద్రియమనోనిగ్రహములు.

శ్లో॥ నిగ్రహో బాహ్యవృత్తీనాం దమ ఇత్యభిధీయతే।

తా॥ బాహ్యవృత్తుల నణచుటయే దమ మనఁబడును. అనఁగా, బాహ్యేంద్రియ నిగ్రహము.

శ్లో॥ విషయేభ్యః పరావృత్తిః పరమోపరతిర్హి సా॥

తా॥ సమస్త విషయములయందును ఆత్మబుద్ధిచేయుట శ్రేష్ఠమైనదియగు ఉపరతి యనఁబడును. అనఁగా, సకలమును భగవద్వ్యాప్యముగానే చూచుట.

శ్లో॥ సహనం సర్వదుఃఖానాం తితిక్షా సాశుభా మతా॥

తా॥ సమస్తదుఃఖములను విచారణచేఁ దొలగించి, శరీరమును బాధించునప్పుడు భగవద్ధ్యానమందు మనస్సును నిలిపి, దుఃఖమునోర్చుకొనుటయే తితిక్ష యనఁబడును.

దీని వివరము భగవద్గీతలోఁ జెప్పఁబడియున్నది:—ఎట్లనిన,

శ్లో॥ మాత్రాస్పర్శాస్తుకౌన్తేయ శీతోష్ణసుఖదుఃఖదాః।
ఆగమాపాయినోఽనిత్యా స్తాంస్తితిక్షస్వభారత!॥

*(భగవద్గీతా-అ, 2. శ్లో, 14.)

శ్లో॥ నిగమాచార్యవాక్యేషు భక్తిశ్శ్రద్ధేతి విశ్రుతా॥

తా॥ వేదవాక్యమందు నమ్మకమును, గురువాక్యమందు విశ్వాసమునుంచుటయే శ్రద్ధ యనఁబడును.

శ్లో॥ చిత్తైకాగ్ర్యన్తుసల్లక్ష్యే సమాధానమితిస్మృతమ్॥

తా॥ గురూపదేశించిన లక్ష్యమందు మనస్సు నేకాగ్రముగా నిలుపుటయే సమాధాన మనఁబడును.

---

* ఈ వ్యాఖ్యానకర్తచే రచియింపఁబడిన 'భగవద్గీతా గూఢార్థదీపికా' అ, 2. శ్లో, 14 లో చూచునది.

౪. ముముక్షుత్వము ఎట్టిదనిన :—

శ్లో॥ సంసారబన్ధనిర్ముక్తిః కథంమేస్యాత్కదావిధే।
ఇతియాసుదృఢాబుద్ధిః వక్తవ్యాసాముముక్షుతా ॥

తా॥ ఈ జననమరణరూపమగు సంసారమునుండి విడువఁబడు టెట్లు? అది నాకేవిధముగా లభించును? అను నీమొదలగు విచారణలో మనస్సు జొరపడి, యితరప్రపంచ విషయములయందు నిరసనము కలుగుటయే ముముక్షుత్వమనఁబడును.

అని చెప్పుటవలన సద్గురువును జెంది ప్రశ్నోత్తర పూర్వకముగా తత్త్వవిచారణ చేయవలసినది. అట్టి ప్రశ్నోత్తరములు మూడువిధములు. అవి యేవియనిన:—

1. వాదము, 2. జల్పము, 3. వితండావాదము.

వాదము. రాగద్వేష రహితముగా తత్త్వ నిశ్చయముకొఱకుఁ జేయఁబడు గురుశిష్యులయొక్క ప్రశ్నోత్తర రూపమైనది.

జల్పము. శాస్త్రములచేతను యుక్తులచేతను, ఎదుటివానిని జయించవలెనను అహంకారములతోఁ జేయఁబడు ప్రశ్నోత్తరరూపమైనది.

వితండావాదము. శాస్త్రమునకుగాని యుక్తికిగాని లోఁబడక, నెదుటివాని మాట లాడనివ్వక, లేక వానిమాటలను చెవులలో వేసుకొనక తనకుఁ దోచినట్లు అడ్డదిడ్డముగా ప్రేలి తాను జెయించినట్లు విఱ్ఱవీగుట.

ఈ మూడింటిలో మొదటిదిమాత్రము ముముక్షువులచే ననుష్ఠింపఁదగినది, కావున నట్టి గురుశిష్యప్రశ్నోత్తర పూర్వకమగు వాదము నీ కేనోపనిషత్తని యెఱుంగునది.

---

ఓమ్.

ఆప్యాయన్తు మమాఙ్గాని వాక్ప్రాణశ్చక్షు
శ్శ్రోత్రమథోబలమిన్ద్రియాణిచసర్వాణి।
సర్వంబ్రహ్మోపనిషదం మాహంబ్రహ్మ నిరాకుర్యాం

మామా బ్రహ్మ నిరాకరోద్ మా మా బ్రహ్మ నిరాకరోదనిరాకరణమస్తు।
అనిరాకరణంమేఽస్తు తదాత్మనిరతే
య ఉపనిషత్సుధర్మా స్తే మయి సన్తు తే మయి సన్తు॥

ఓమ్ శాన్తిః. శాన్తిః. శాన్తిః.

తా॥ సమస్తమును భగవంతునియందుండుటవలన నాయొక్క కర్మేంద్రియములను వాక్కు నేత్రము శ్రోత్రము మొదలగు జ్ఞానేంద్రియములను ప్రాణము మొదలగు అంతఃకరణములను అహంకార మమకారములను— ఇవి మొదలగు సమస్తములను భగవంతునియందు (ఆత్మయందు) లయించుగాత; నేను భగవంతునుండి (బ్రహ్మమునుండి) వేఱుగానుండకపోదునుగాక. అనఁగా, నాకు భేదబుద్ధి కలుగవద్దు. నాలోనుండి భగవంతుఁడును (బ్రహ్మమును) వేఱుగానుండకపోగాత. అనఁగా భగవంతునిస్మరణము నామనస్సునన్నెల్లప్పుడు నుండవలయును. భగవంతునివిషయమై నాలో అనాదరణకలుగవద్దు. భగవంతునికి నామీఁద అనాదరణకలుగనువద్దు. ఉపనిషత్తులనుండు ధర్మములేవో, అవియన్నియును నాయందుండుగాత; నాయందుండుగాత.

ఓమ్ శాన్తము. శాన్తము. శాన్తము.

——:0:——

# 1

హరిః ఓమ్.

---

శ్రు॥ కేనేషితం పతతి ప్రేషితం మనః
కేన ప్రాణః ప్రథమః ప్రైతి యుక్తః।
కేనేషితాం వాచమిమాం వదన్తి చక్షుః
శ్రోత్రం క ఉ దేవో యునక్తి॥ ౧॥

| అన్వయము. | అర్థము. |
|---|---|
| మనః | (సంకల్ప వికల్పాత్మకమైనదియు, జ్ఞానశక్తిగలదియనగు) మనస్సు |
| కేన (కేనవా?) | ఎవనిచేత (అచేతనము చేతనా? లేక, చేతనము చేతనా?) |
| ప్రేషితమ్ (సత్) | ప్రేరణచేయఁబడినదై |
| ఇషితమ్ | తనకిష్టమగు విషయమునుగూర్చి |
| పతతి | ప్రవర్తించుచున్నది? |
| ప్రథమః | (సకలేన్ద్రియవృత్తులకు పూర్వమగుటవలన) ముఖ్యమైనదగు |
| ప్రాణః | (ఐదు వృత్తులుగల) ప్రాణము |
| కేన | ఎవనిచేత |
| యుక్తః (సన్) | ప్రేరణచేయఁబడినదై |
| ప్రైతి | (తనకుస్వభావమైన ఉచ్ఛ్వాస నిశ్వాస రూపములుగా) వెళ్లుచున్నది? (సంచరించుచున్నది?) |
| కేన | ఎవనిచేత |
| ఇషితామ్ | ప్రేరణచేయఁబడినదై |
| ఇమామ్ | ఈ శబ్దలక్షణమును |
| వాచమ్ | (అనేక శబ్దజన్యమునకుఁగారణమైన వాగేన్ద్రియ రూపముగనుండు) వాక్కు (ద్వారా) |

(లౌకికాః) (ప్రవృత్తిమార్గము నవలంబించు జనులు)
వదన్తి పలుకుచున్నారు?
చక్షుః నేత్రములను
శ్రోత్రమ్ చెవులను
క ఉ దేవః ఏ స్వప్రకాశ స్వరూపుఁడగు దేవుఁడు
(స్వే స్వే విషయే) (తమ తమ విషయమందు)
యునక్తి ప్రేరణచేయుచున్నాఁడు?

## తాత్పర్యము.

శ్రు॥ "నైషాతర్కేణ మతిరాపనేయా॥" (కఠోపనిషత్-వల్లి, 2. వా, 9.)

తా॥ ఈ బ్రహ్మవిద్య, తర్కపాణ్డిత్యము చేత కాని, ఊహాపోహాలచేత గాని పొందఁబడదు.

అను శ్రుతియొక్క తాత్పర్యమును చక్కఁగా తెలిసికొని, శాస్త్రవాసన మొదలగు వాసనాత్రయములను విడిచి,

శ్లో॥ యజ్ఞదానతపఃకర్మ నత్యాజ్యం కార్యమేవతత్।
యజ్ఞోదానం తపశ్చైవ పావనాని మనీషిణామ్॥ (భగవద్గీతా-అ,18.శ్లో,5.)

తా॥ యజ్ఞ దాన తపోరూపములగు మూఁడువిధములైన కర్మములు జేయఁదగినవియే గాని విడువఁదగినవి యెప్పుడును గావు. ఏలయనిన:—ఫలముల నపేక్షింపక చేయఁబడినయెడల నవి జ్ఞానసాధనమగు చిత్తశుద్ధిని గలుగఁజేయును. కనుక, శాస్త్రములయందు ఆయా వర్ణాశ్రమముల కేర్పడియుండు కర్మములను భగవదర్పణముఁజేసి, తన పాపములను నివర్తింపఁజేసుకొని, సాధనచతుష్టయసంపన్నుఁడై చిత్తశుద్ధిని బొందినవాఁడెవఁడో, వాఁడిక్రిందఁజెప్పఁబోవు శ్రుతి స్మృతులప్రకారము,

శ్రు॥ కర్మణాబధ్యతే జన్తుః విద్యయాచ విముచ్యతే।
తస్మాత్కర్మ నకుర్వన్తి యతయః పారదర్శిన

తా॥ కామ్య కర్మానుచరణములవలన ప్రాణులకు సంసారబంధము కలుగును. నిష్కామ కర్మానుచరణములచేత కలిగిన జ్ఞానమువలన బంధము నివర్తించును. కాఁబట్టి మోక్షాపేక్షగల సాధనచతుష్టయసంపన్నులు కామ్యకర్మముల నిచ్ఛ నుంచరాదు; అనియు.

శ్లో॥ సంసారమేవ నిస్సారం దృష్ట్వాసారదిదృక్షయా।
ప్రవ్రజన్త్యకృతోద్వాహాః పరం వైరాగ్యమాశ్రితాః

తా॥ ప్రాజ్ఞులు, సంసారమందు సారమేమియు లేదని లెస్సగాఁదెలిసికొని, సారమును గనుగొనవలెనను తలంపుతో, సంసారమునందు విరక్తులై కామ్యకర్మముల నిచ్ఛయుంచరు.

అనియు, శ్రుతి స్మృతులు ఘోషించుటవలన అట్టి వైరాగ్యశాలియు. బ్రహ్మజ్ఞానియును తత్త్వవేత్తయునగు సద్గురువును జెంది, సాష్టాంగ నమస్కారములానర్చి, యాతని యాజ్ఞలను నెరవేర్చుటకై గురుకులవాసముఁజేసి, శ్రుతివాక్యములయందు నమ్మకమును, గురువాక్యమునందు శ్రద్ధాభక్తియును గలిగినవాఁడై, గురుముఖముగా తత్త్వవిచారణచేయవలసినది. ఎట్లనిన:—

ఓ స్వామీ! సంకల్ప వికల్పాత్మకమైనదియు, జ్ఞానశక్తికలదియునగు మనస్సును, ఐదువృత్తులుగల ప్రాణమును, ఎవనిచేత (చేతనవస్తువుచేతనా? లేక, అచేతన వస్తువువలననా?) ప్రేరణచేయఁబడి ప్రవృత్తిమార్గగాములై ఆయావిషయములయందుఁ బ్రవర్తించుచున్నవి? అనేక శబ్దలక్షణములుగల వాగిన్ద్రియము, ఎవనిచేఁ బ్రేరణఁజేయఁబడి వచనక్రియలను చేయుచున్నది? కన్నులను చెవులను ఎవఁడు ప్రేరణఁజేసి తమ తమ విషయములయందు నడుపించుచున్నాఁడు? అని శిష్యుఁడు **గురువును** ప్రశ్నఁజేసినవివరము నీ ప్రథమ మంత్ర ముపదేశించుచున్న యది.

ఐదు వృత్తులుగల ప్రాణముల వివరణము:—

1. ప్రాణము. 2. అపానము.
3. వ్యానము. 4. ఉదానము.
5. సమానము.

1. ఉచ్ఛ్వాస నిశ్వాస రూపముగా, గడియకు 360 శ్వాసముల చొప్పున రేయింబవలు విడుచునది, ప్రాణ మనఁబడును.

2. గుదము ఉపస్థము నాశ్రయించుకొని మల మూత్రాదులను విసర్జించునది, అపాన మనఁబడును.

3. శరీరము నంతటను వ్యాపించియుండి స్పర్శములను తెలియఁజేయునది, వ్యాన మనఁబడును.

4. జఠరాగ్నిని గలుఁగఁజేసి భుజించు పదార్థముల రసమును నరములద్వారా పంచిపెట్టి శరీరమునుం బోషించునది, ఉదాన మనఁబడును.

5. సకలవాయువులను హెచ్చు తక్కువ గాకుండ సమముగా సంచరించు చుండునట్లు జేయునది, సమాన మనఁబడును.

---

౨ - మంత్రము.

అవతారిక.

సాధనచతుష్టయసంపన్నుఁడై వైరాగ్యమునొంది తత్త్వమును దెలిసికొనవలె నను మిక్కిలి యాసక్తితో సద్గురువును జెందిన శిష్యుఁడు, మొదటి మంత్రమునందుఁ జెప్పఁబడిన ప్రశ్నల నడుగఁగా, నాగురుఁడును శిష్యుని యోగ్యతను తెలిసికొని చెప్పినదేమనఁగా:—ఓ శిష్యుఁడా! మనస్సు, ప్రాణము, చక్షు, శ్రోత్రము మొదల గునవి యెవనిచే ప్రేరణచేయఁబడి తమ తమ విషయములయందు ప్రవర్తించుచున్నవి, అనికదా ప్రశ్నఁజేసితివి? అందునకు సమాధానమును జెప్పెద, జాగరూకుఁడవై వినుము.

2.

శ్రు॥ శ్రోత్రస్యశ్రోత్రం మనసోమనో
యద్వాచోహవాచంస ఉప్రాణస్యప్రాణః।
చక్షుషశ్చక్షు రతిముచ్యధీరాః
ప్రేత్యాస్మాల్లోకా దమృతాభవన్తి॥ ౨॥

| | |
|---|---|
| యత్ (యస్మాత్) | ఏ కారణమువలన |
| శ్రోత్రస్య | శ్రోత్రేన్ద్రియమునకు |
| శ్రోత్రం | శ్రోత్రముగాను, (అనఁగా, శవమునకును, చెవుటివానికిని చెవులుండినను వినఁబడుట లేదుకదా? గనుక, స్థూలముగాఁ గనఁబడుచున్న చెవులకంటెను శబ్దముల వినుటకు సాధనముగా మఱియొక సూక్ష్మవస్తు వుండవలసియున్నది. అట్టి సూక్ష్మ పదార్థమేది కలదో, అదే శ్రోత్రేంద్రియమనఁబడును. ఆ యిన్ద్రియము జడమగుటంబట్టి శబ్దములను గ్రహించుటకై చేతనరూపమగు మఱియొక వస్తుసహాయ మావశ్యకము. ఏవస్తువు జడముగనుండు శ్రోత్రేంద్రియమునకు శబ్దముల వినుటకు సామర్థ్యమును కలుగఁజేసెనో, అట్టివస్తువే శ్రోత్రమునకు శ్రోత్రమనఁబడును.) |
| యస్మాత్ | ఏ కారణమువలన |
| మనసః | మనస్సునకు |
| మనః | మనస్సుగాను, |
| వాచః | (జిహ్వా మొదలగు అష్టస్థానములుగల) వాగింద్రియమునకు |
| వాచమ్ | వాక్కుగాను |
| ప్రాణస్య | ప్రాణమునకు |
| ప్రాణః | ప్రాణముగాను, |
| చక్షుషః | నేత్రమునకు |
| చక్షుః | నేత్రముగాను, |
| ధీరాః | (సమస్తేంద్రియములకు నాధారభూతముగను, అంతర్యామిగను, సర్వపరిపూర్ణుఁడుగ నుండువస్తువే బ్రహ్మమని స్వానుభవముచేఁ దెలిసికొనినవారలగు) వివేకధీరులు |

| | |
|---|---|
| అతిముచ్య | (శ్రోత్రేంద్రియాదులయం దిదివరకు తమ యవివేకముచే నుంచఁబడియున్న ఆత్మభావమును) విడిచి |
| అస్మాత్, లోకాత్ | (ఈషణత్రయములోఁజేరిన పుత్ర మిత్ర కళత్ర బంధు ధన కనక వస్తు వాహనాదులలందు 'నాది' యను నభిమానమును, ఇంద్రియసమూహముల చే నిండియుండు శరీరమందు 'నేన'ను నహంకారమును, లేమిచే) ఈ జన్మమునుండి |
| ప్రేత్య | విడువఁబడి |
| అమృతాః | మరణములేనివారై (అవిద్యాకార్యములగు జనన మరణాది రహితులయి) |
| భవంతి | అగుచున్నారు. |

తా॥ శిష్యుఁడా! చనిపోయిన శరీరమందుఁ జెవులుండినను శబ్దములను ఏల వినుటలేదని గురువు ప్రశ్నచేయఁగా, ఆశరీరమందుఁ బ్రాణము లేని లోపమే యని, శిష్యుఁడు పలికెను. అటులైనచోఁ జెవిటివానికిఁ బ్రాణమును జెవులును ఉన్నవిగద, వానికేల శబ్దములు వినఁబడుటలేదు? అనిన, ఆవివరమును బాగుగఁ దెలిసికొనుటకొఱకే మొదటిమంత్రమునందుండు ప్రశ్నల నడిగితిని. గనుక, నాకు బాగుగఁ దెలియఁజేయవలెను. అని యడిగిన శిష్యునిగూర్చి మరల గురు విట్లనియె:—ప్రాణముండినను జెవిటివానికిఁ జెవులు వినరావందున, శబ్దములను వినుటకుఁ బ్రాణమును స్థూలరూపముగానుండు చెవులును, అట్టిచెవులచే శబ్దములను గ్రహించుట కనుకూలమగు కర్ణాంగుళి (Tympanum) యనఁబడు నొక సూక్ష్మపదార్థమును, ఇవియన్నియుఁ గలుగుట కాధారమైన జన్మమును, అట్టి జననమరణములకుఁ గారణమైన యవిద్యయు, జడపదార్థము లగుటఁజేసి, వీని కన్నిటికి స్వతంత్రశక్తిలేదను సంగతియును, ఆ స్వతంత్రశక్తిఁ గేవల భగవంతునికే (ఆత్మకే) యనియు, బాగుగఁ దెలిసికొనుము.

ఇందులకు శ్రుతిప్రమాణము:—

శ్రు॥ నతత్ర సూర్యోభాతి నచంద్రతారకం
　　నేమావిద్యుతోభాన్తి కుతో౽యమగ్ని

తమేవభాన్త మనుభాతి సర్వం
తస్యభాసా సర్వమిదం విభాతి॥ (కట-వల్లి, 5. వా, 15.)

తా॥ సూర్యచంద్రాగ్ని నక్షత్రాదులగు ప్రకాశవస్తువులకు స్వకీయమైన ప్రకాశములేదు. ఈ ప్రపంచమందుఁ బ్రకాశితపదార్థములన్నియు, ఓ భగవంతుఁడా! నీప్రకాశమువల్లనుంచియేగద ప్రకాశించుచున్నవి. అనియు,

శ్లో॥ యదాదిత్యగతంతేజో జగద్భాసయతేఽఖిలమ్।
యచ్చంద్రమసియచ్చాగ్నౌ తత్తేజోవిద్ధిమామకమ్॥
(భగవద్గీతా-అ, 15. శ్లో, 12.)

తా॥ సూర్యచంద్రాగ్నులు ఘటపటాదిప్రపంచమునుఁ బ్రకాశింపఁజేసినను స్వయంప్రకాశమగు నాత్మను బ్రకాశింపఁజేయఁజాలవు. అటువంటియే యాత్మను ముముక్షువులుపొంది జననమరణాది సంసారప్రవాహమును దాటుదురో; ఆకాశము ఘటమఠాద్యుపాధులచే వేఱువేఱుగఁదోఁచినను, అట్టి ఘటాకాశ మఠాకాశములు మహాకాశముకంటె నెటుల వేఱుకానేరవో,అట్లు ఉపాధిభేదములచే వేఱువేఱుగఁదోఁచు జీవప్రకాశములు ఆత్మప్రకాశముకంటె వేఱుకానేరవు.అట్టి యాత్మప్రకాశమే సర్వస్వరూపమనియు సమస్తవ్యవహారముల కాధారమనియును అర్జునునకుఁదెలియఁజేయ నుద్దేశించియే శ్రీకృష్ణపరమాత్మ పలికెను. అర్జునా! సూర్యమండలము నాశ్రయముగాఁగల యేప్రకాశము సమస్తజగత్తును బ్రకాశింపఁజేయుచున్నదో,చంద్రాగ్నులయందును సమస్తమునుబ్రకాశింపఁజేయునట్టి యేప్రకాశముకలదో, అది సర్వవ్యాపకుడనగు నాప్రకాశమేయని తెలిసికొనుము. అనియు, శ్రుతి స్మృతులు ఘోషించుటవలన అట్టి భగవంతుఁడె చెవికిఁ జెవిగాను, మనస్సునకు మనస్సుగాను ప్రాణమునకుఁ బ్రాణముగాను ఉన్నాఁడని తెలిసికొనుము. ఈ వ్యాఖ్యానకర్తచే రచియింపఁబడిన యీశావాస్యోపనిషత్తువ్యాఖ్యానలోఁ బ్రథమ మంత్రమందు "సకలమును భగవత్స్వరూపముగాఁ జూచువానికి శోకమోహాదు లెక్కడివి?" అని చెప్పఁబడినట్లు శ్రోత్రాదీంద్రియములతోఁగూడిన తన శరీరమందు నాత్మబుద్ధిని విడిచి, సమస్తమును భగవత్స్వరూపమే యని స్వానుభవముచేఁ దెలిసికొని, అహంకార మమకారములను వదలిన ధీరుఁడు, అవిద్యయు, అవిద్యా

కార్యమగు సంసారప్రవృత్తియు లేనివాఁడై మోక్షమునుఁబొందునని యీ మంత్ర ముపదేశించుచున్నది.

ఈ యుపనిషత్తుయొక్క మొదటిఖండములో.

౧-వ మంత్రమందుఁ జెవికిఁ జెవిగానుండువాఁడు భగవంతుఁడే అనియు;

౬-వ మంత్రమందు మనస్సునకు మనస్సుగానుండువాఁడు భగవంతుఁడే అనియు.

౫-వ మంత్రమందు వాక్కునకు వాక్కుగానుండువాఁడు భగవంతుఁడే అనియు;

౯-వ మంత్రమందుఁ బ్రాణమునకుఁ బ్రాణముగానుండువాఁడు భగవంతుఁడే అనియు;

ఆయా మంత్రములక్రిందగ సవిస్తరముగా వ్రాయఁబడిన వ్యాఖ్యానమందుఁ జూచుకొనవలయును.

---

## 3 - మంత్రము.

### అవతారిక.

మనస్సును ఇంద్రియములను విషయములయందుఁ బ్రవర్తించునట్లు ప్రేరణచేయువాఁడెవడని శిష్యుఁడడుగఁగా; "మనస్సును ఇంద్రియములను తత్తద్రూపములయి ప్రేరణచేయునదియే బ్రహ్మము (ఆత్మ=భగవంతుఁడు)" అని గురుఁడు సెప్పిన వాక్యములను బాగుగ గ్రహించితిని. బ్రహ్మము సకలస్వరూపముగనుండినయెడల ఘటపటాదులవలె కండ్లకు నేలకనుబడదు? ఇట్లే యింద్రియములచేత నేల గ్రహింపఁబడదు? అనిన ప్రశ్నలకుఁ బ్రత్యుత్తరముగా నీమంత్రము ప్రవర్తించుచున్నది.

**3**

శ్రు॥ నతత్ర చక్షుర్గచ్ఛతి నవాగ్గచ్ఛతి నోమనః।
నవిద్మో నవిజానీమో యథైతదనుశిష్యాత్॥ 3॥

| | |
|---|---|
| తత్ర | (రూపచలనాది రహితమయి శ్రోత్రాదులకాత్మయై యుండు) బ్రహ్మమందు (బ్రహ్మనుగూర్చి) |
| చక్షుః | నేత్రము |
| నగచ్ఛతి | వెళ్లదు. |

| | |
|---|---|
| వాక్ | వాక్కును (మాటలును) |
| నగచ్ఛతి | వెళ్లదు. |
| మనః | మనస్సును |
| నో (గచ్ఛతి) | వెళ్లదు. |
| అతః | ఆ కారణమువలన |
| నవిద్మః | తెలిసికొనఁజాలము. (చెవి మొదలగు సమస్తమునకుఁ దత్తత్స్వరూపముగనుండునదియే యాత్మయని యుపదేశింపఁబడిన గురువాక్యములను దప్ప, వేఱొకమార్గమును దెలిసికొనలేము.) |
| నవిజానీమః | (అనేకశాస్త్రపరిజ్ఞానము సంపాదించినను, బ్రాహ్మణత్వాది జాతులలోఁ జేరినదిగాగాని, నీలత్వపీతత్వాది వర్ణములలోఁ జేరినదిగాగాని, గణకత్వ పాచకత్వాది క్రియలలోఁ జేరినదిగాగాని, రాజపురుషేత్యాది స్థలమందున్న సంబంధాదులలోఁ జేరినదిగాగాని, ఆత్మను) తెలిసికొనలేము. |
| (తర్హి) | (అయితే) [ము |
| ఏతత్ | (మనస్సు మొదలగువానినిఁ బ్రేరణచేయు) ఈబ్రహ్మ |
| యథా | ఏవిధముగా |
| అనుశిష్యాత్ | (గురువుగాని శాస్త్రముగాని శిష్యునికి) తెలియఁజేసినది? (ఆవిధమును దెలియలేకయున్నాము.) |

తా॥ ఓ శిష్యుఁడా! నేత్రమునకు నేత్రమే బ్రహ్మమని చెప్పుటవలన తాను తనదగ్గఱకు వెళ్లుట నీసంభవముగాన, సమస్తేంద్రియములకు నాత్మగనుండు బ్రహ్మమునుగూర్చి చూపు వెళ్లదు. ఓస్వామీ! కన్నుతో బ్రహ్మమును చూడకపోయినఁబోనిమ్ము, కంటితోఁజూడనలవిగాని స్వర్గాదులను వాక్కుచే గ్రహించునట్లు వాక్కుచేనైన వచించి గ్రహించవచ్చునుగద? అని శిష్యుఁడడిగిన,

శ్లో॥ "వేదవాక్యైరవేద్య"

ఈబ్రహ్మమును వేదవాక్యములె వచించలేక నిలిచిపోయినప్పుడు, మనవాక్కుచే బ్రహ్మమును వచించుటయనునది నరశృంగ తుల్యమేయని గురుఁడు, సిద్ధాంత పఱచెను. ఓస్వామీ! బ్రహ్మమునుఁజెప్పుట వాక్కునకు నలవిగాకపోయినఁబోనిమ్ము, వాఙ్నేత్రములచేఁ గనిపెట్టుట కశక్యమగు సంపంగి, మొగలి, పొగడ, మొదలగు పుష్పములయందలి సువాసనావైచిత్ర్యమును మనస్సుచే గ్రహింపబడునట్లు, బ్రహ్మమును మనస్సుచేతనైన గ్రహింపవచ్చును అనిన, గురువు చెప్పుచున్నాఁడు.

ఓ శిష్యుఁడా! సుషుప్త్యవస్థలో మనస్సు లేమిచే నదియాయవస్థను డెలిసికొనఁజాలదు. అట్లుండ సుషుప్త్యవస్థ నతిక్రమించియుండు బ్రహ్మస్వరూపమును మనస్సు తెలుసుకొనుట ఎట్లు? కాఁబట్టి మనస్సుచేతనుగూడ బ్రహ్మమును డెలిసికొనుటకు సాధ్యముకాదు. ఇంతియగాఁక, అగ్నితనదగ్గఱకువచ్చు వస్తువులదహించి నాశముచేసి తానునాశముగాక నిల్చియున్నట్లును, అడవిలోఁదిరుగు పెద్దపులి తన శరీరమందలి చారలను లెక్కింపవచ్చు మనుజునిఁగబళీకరించి నాశముచేసి తాను నాశములేక నిలిచియున్నట్లును, ఇంద్రియములును మనస్సును సమతమ నామరూపములతో బ్రహ్మమును సమీపించలేక నశించును. బ్రహ్మము తానుమాత్రము యథాప్రకారముగానిలిచి యుండును గనుక పూర్వోక్త నేత్రవాఙ్మనస్సులు బ్రహ్మమును ఏమాత్రము తెలిసికొనఁజాలవని సిద్ధాంతము.

అట్లయినచో ఓస్వామీ! ఆ బ్రహ్మమును ఏవిధముగాఁ డెలిసికొనవచ్చును? అనిన వేదములయొక్క రహస్యార్థములను జక్కఁగఁ డెలిసికొని యనుష్ఠించి స్వానుభవమునుబొందియుండు మహానుభావుఁడగు సద్గురువును జెంది, ఆయన చెప్పిన ప్రకారము నడుచుకొనుచున్న శిష్యులకుఁ జెప్పఁబోవు మంత్రములచేఁ దెలుసుకొనువిధమును స్పష్టపఱచఁబడునని, యీ మూడవమంత్రముపదేశించునని గురువు పలికెను.

---

## ౪ - మంత్రము.

## అవతారిక.

ఓస్వామీ! అన్నిటినిఁదెలిసిన మహనీయుఁడగు సద్గురువుచే నుపదేశింపబడిననే తప్ప బ్రహ్మవస్తువును దెలుసుకొనుట కశక్యమయినయెడల,అట్టిబ్రహ్మమును అపవాద

(నిజమైన — సత్యమైన) వస్తువనిచెప్పవలసి వచ్చునుగాబోలు, అని శిష్యుడు పలుకగా గురువిట్లనియె:—శిష్యుఁడా! ప్రత్యక్షాదిషట్ప్రమాణముల కతీతమైన యపవాద స్వరూపమయిన బ్రహ్మము, స్వానుభవైక వేద్యమేగాని షట్ప్రమాణములకు వేద్యము కాదనునది సత్యమే.

శిష్యుఁడుతిరిగి ప్రశ్నించుచున్నాడు. ఎట్లనిన:—ఆబ్రహ్మమును శాస్త్రోపదేశములవలనఁ బొందవచ్చునుగద? అనిన శాస్త్రోపదేశముచే బ్రహ్మమునుఁ బొందుట యసాధ్యమను సంశయమును దెలియఁజేసెద వినుము, ఎట్లనిన:—

## 4

శ్రు॥ అన్యదేవతద్విదితా దథోఽవిదితాదధి।

ఇతిశుశ్రుమపూర్వేషాం యేనస్తద్వ్యాచచక్షిరే॥ ౪॥

తత్ — (ఏయాత్మవస్తువు కన్నునకుఁ గన్ననియు మనస్సునకు మనస్సనియు, నీ మొదలగు విశేషణములచేఁ బ్రకృతమందుఁ జెప్పఁబడుచున్నదో)ఆబ్రహ్మము (తెలిసికొనఁబడిన దానికంటెను,అనగా శాస్త్రములనుఁ జక్కఁగఁ జదివిన పాండిత్య విశేషముచేఁ దానన్నిటిని దెలిసికొంటి నను తెలివికంటెను, లేక దృష్టిగోచరముగుప్రపంచము నందుఁ దనకుఁ దెలియనిదేదియు లేదను నహంకారరూపమగు తెలివికంటెను, లేక తెలిసికొనబడినవన్నియు నల్పములును దుఃఖకరములును గనుక నిందితములయినవను తెలివికంటెను)

అథః — మఱియు

అవిదితాత్ — తెలిసికొనఁబడనిదానికంటెను. (అనఁగా, కార్యకారణములకు భేదములేదు గనుక ఈకార్యరూపప్రపంచము అవ్యక్తమగు కారణప్రపంచముకంటెను)

అన్యత్ + ఏవ — వేఱైయున్నది

| | |
|---|---|
| | అని |
| (ఆచార్యాః) | ఏ (మహానుభావులగు గురువులు) |
| | మాకొఱకు |
| | ఆ బ్రహ్మవిషయమై |
| చచక్షిరే | మిక్కిలి స్పష్టముగాఁ జెప్పిరో, |
| తేషాం) | (అటువంటి) |
| ర్వేషాం | (శమ దమాది సంపన్నులును, వేదమునుఁ జక్కఁగఁ దెలిసికొనినవారును, సద్గురువునుఁ జెంది వారి యుపదేశముచే స్వానుభవమునుఁ బొందియుండు) పూర్వీకులగు పెద్దలయొక్క |
| చనం) | వాక్యమును, |
| శుమః | (పరంపరాక్రమముగా శిష్యునికి గురువు లుపదేశించిరని) వినుచున్నారము. |

తా॥ ఓశిష్యుడా! ఏ యాత్మ కన్ను నకు కన్ననియు మనస్సునకు మనస్సనియు మొదలయినవిశేషములచే రెండవమంత్రమందుఁ జెప్పఁబడి ఘటపటాదులవలె నింద్రియ గోచరముకానిది యేదియో అట్టి బ్రహ్మము, శాస్త్రజ్ఞానముచేతను సమస్తమునుఁదెలిసికొంటనను తెలివికంటెను, కనుబడు ప్రపంచమందు నాకుఁ దెలియనిదేదియు లేదను నహంకారరూపమగు తెలివికంటెను "యద్దృశ్యం తన్నశ్యం" ఏది కనుబడుచున్నదో అది నశించును అనునట్లు, తెలిసికొనఁబడిన వన్నియు నల్పములు దుఃఖకరములు గనుక నిందించబడినవను తెలివికంటెను, కార్య కారణములకు భేదము లేమిచేఁ గార్యరూపప్రపంచమును కారణరూప ప్రపంచమును ఈ రెండు ప్రపంచములకంటె నాబ్రహ్మము వేఱైయున్నదని, శమ దమాది షట్కసంపత్తిగలవారలై, సద్గురువునుఁజెంది శుశ్రూష జేసి వారిచే నుపదేశింపఁబడి తన్మూలముగా స్వానుభవమునందుండు పూర్వపు మహనీయులచే,

శ్రు॥ "అయమాత్మాబ్రహ్మ"; "యఆత్మాఽపహతపాప్మా"; "యత్సాక్షాదపరోక్షాత్"; "బ్రహ్మమయఆత్మా సర్వం"

తా॥ అనగా "ఈ ఆత్మయే బ్రహ్మము", "ఏది సకల పాపరహితమయి నదో అదియే బ్రహ్మము", "సకలమును భగవత్స్వరూపమను అపరోక్షనాత్మ త్కారముచే ననుభవింప బడునదియే బ్రహ్మము", "కనుబడునదియునంతయు బ్రహ్మమే" అను శ్రుతులచే పరంపరఁగావచ్చిన పద్ధతిచేతనే శిష్యునికి నుపదేశింపఁబడి స్వానుభవముచేఁ దెలియబడినదేగాని, తర్కాది శాస్త్ర పాండిత్యముచేతను బాగుగ వాక్యార్థముఁ జేయుటచేతను వ్యవహారమందుఁ దెలివిగలిగియుండుటచేతను అనేక ప్రవచనములను నిరనుష్ఠానముగా వినుటచేతను యజ్ఞము మొదలగు కామ్యకర్మలు చేయుటచేతను, ఆ బ్రహ్మమునుఁదెలిసికొన సాధ్యముకాదు. అనిచెప్పిన వాక్యమును వినినామనిన యంశము నీనాల్గవ మంత్ర మువదేశించుచున్నది.

అపవాదమునకు వివరము.

శ్లో॥ రజ్జుసర్పవదాత్మానం జీవంజ్ఞాత్వాభయంవహేత్ ।
నాహంజీవఃపరాత్మేతి జ్ఞాతశ్చేన్నిర్భయోభవేత్ ॥

ఈ శ్లోకార్థమును ఈ వ్యాఖ్యాన కర్తచే రచియింపఁబడిన "ఆత్మబోధతత్వార్థదీపిక"లో ౨౬వ శ్లోకమందు, బహుసవిస్తరముగా వ్రాయఁబడియున్నది. గనుక అక్కడ చూచుకొనవలయును. ఇక్కడ సంక్షేపముగా వ్రాయుచున్నాను.

ఒకమనుజుఁడు రజ్జువునుఁజూచి పామని భయఁపడినట్లు, జీవుడు ఆత్మయగు తననుఁగర్తృత్వాది ధర్మసహితుఁడయిన జీవుని గాఁదలచి యనేకవిధములు జనన మరణాది రూపదుఃఖ సముద్రమందు మునిగినవానివలె భయఁపడుచున్నాడు. ఇట్టి భయముతో ననేకజన్మములయందు నిష్కామముగాఁ జేయఁబడిన పుణ్యకర్మ పుంజ జనిత సుకృత పరిపాకముచేఁ జిత్తశుద్ధినిఁజెంది తననిజస్వరూపమును స్వానుభవముచేఁ దెలిసికొనినప్పుడు, నిర్భయుడగును. ఇందుభయమును బొందియుండువానివలె నుండుస్థితియే అధ్యారోపమనియు, నిర్భయస్థితియే అపవాదమనియు నెఱుంగుము. అనఁగా, బ్రహ్మమునకుఁబ్రపంచరూప వికాసమే ఆరోపమనియు, తత్సంకోచమే అపవాదమనియు నెఱుంగుము.

దీని వివరము ద్రావిడగ్రంథమగు "కైవల్య నవనీతమందు" తత్వవిళక్కప్పడలమందు ౭౬వ శ్లోకమునుఁజూచునది.

---

## ౫ - మంత్రము.

### అవతారిక.

ఓ స్వామీ! కనఁబడు స్థూల సూక్ష్మప్రపంచములకంటెను, నీ ప్రపంచకారణ ముగు నవిద్యకంటెను వేఱుగనుండునదియే బ్రహ్మమని నాల్గవమంత్రమునఁ జెప్పఁబడిన దానివలన నామనస్సు తృప్తినిఁబొందలేదు; గనుక నాకు నెట్లు చెప్పినయెడల నామ నస్సు తృప్తినిఁజెందునో, అట్లు నే నడుగఁబోవు ప్రశ్నలకు సమాధానముఁ జెప్పఁ గోరెదను. అవి యేవనిన:—

నామరూపము లేనిదియే బ్రహ్మమా? బ్రహ్మ విష్ణు రుద్రాది రూపముగా నుపా సింపఁబడునదియే బ్రహ్మమా? గృహస్థులచే నుపాసనచేయఁబడు కర్మ స్వరూపమే బ్రహ్మమా? లేకయనేకులచేతఁ బలువిధములుగాఁ జెప్పఁబడునదియే బ్రహ్మమా? అను నట్టి నాసందేహములను నివారింపఁగోరెదనని శిష్యుఁడుపలికిన, గురు విట్లనియె:—

నీవిదివఱకు సందేహముచేత వికల్పించినదేదియు బ్రహ్మము కాదు. సకలమున కాధారముగాను, ఆత్మగానుండునదియే బ్రహ్మమని రాఁబోవు నైదుమంత్రములచేఁ దెలిసికొనుము.

## 5.

శ్రుతి॥ యద్వాచాఽనభ్యుదితం యేనవాగభ్యుద్యతే।
తదేవబ్రహ్మత్వంవిద్ధినేదం యదిదముపాసతే॥ ౫॥

| | |
|---|---|
| యత్ | ఏ బ్రహ్మస్వరూపము |
| వాచా | (అనృత జడ దుఃఖ స్వరూపమగు) వాక్కుచే |
| అనభ్యుదితమ్ | ప్రకాశింపఁబడదో, (చెప్పనలవి కాదో) |
| యేన | ఏ స్వయంప్రకాశ స్వరూపమగు బ్రహ్మముచే |
| వాక్ | ఎనిమిది స్థానములుగల వాగింద్రియము |
| అభ్యుద్యతే | ప్రకాశింపఁజేయఁబడునో, |
| తదేవ | అదియే |
| బ్రహ్మ | (సర్వపరిపూర్ణమగు) బ్రహ్మమని |
| త్వమ్ | (సాధనచతుష్టయ సంపత్తిగల) నీవు |

| | |
|---|---|
| విద్ధి | తెలిసికొనుము. |
| యత్ | (బ్రహ్మవిష్ణురుద్రాదులరూపములుగనుండు) నేవస్తు [వు |
| ఇదమ్ (ఇతి) | ఈబ్రహ్మమని |
| ఉపాసతే | (ఇంద్రియగోచరముగ) నుపాసింపఁబడుచున్నదో. |
| తత్ | అది |
| ఇదమ్ | (నిర్గుణధ్యానాభ్యాసమునకర్హుఁడవగు నీవంటి వానిచే నుపాసనచేయఁదగిన) ఈబ్రహ్మము |
| న | కాదు. |

---

తాత్పర్యము.

సర్వవ్యాపియు, సర్వాంతర్యామియు, సర్వసాక్షియు, సర్వనియంతయు, నిర్వికారియు, స్వయంప్రకాశస్వరూపియు నగు నేబ్రహ్మస్వరూపము, అనృతజడదుఃఖస్వరూపమై యెనిమిదివిధములగు వాక్కుచే వచింప శక్యము కానిదో, చిత్స్వరూపమగు నేబ్రహ్మముచే నీవాక్కు ప్రకాశింపఁజేయఁబడునో, అదియే సర్వపరిపూర్ణమయిన బ్రహ్మమని సాధనచతుష్టయసంపన్నుఁడుగను, తదనుష్ఠానపరుఁడుగను, సగుణధ్యానాభ్యాసస్థితిని దాఁటినవాఁడుగను నుండు నీవు తెలుసుకొనుము. నామరూపములుగల బ్రహ్మవిష్ణురుద్రాది దేవతాస్వరూపములుగను, స్థావరజంగమరూపములుగను నుండు నేవస్తువును, ఈ నిర్గుణబ్రహ్మమని తలఁచునట్టియు, సద్గురువునుజెంది, యాయన యుపదేశముఁబొంది నిర్గుణధ్యానానుష్ఠానముఁ జేయుటకుఁ బ్రయత్నమెంతయు లేని సగుణాభ్యాసస్థితిలో నుండునట్టివారలచే నుపాసింపఁబడునట్టి వస్తువు, నిర్గుణధ్యానాభ్యాసమునకర్హుఁడవగు నీవంటివానిచే నుపాసనచేయఁబడఁదగిన బ్రహ్మముకాదని తెలిసికొనుము.

ఈమంత్రము మొదలుకొని అయిదుమంత్రములచేఁ దెలియఁజేయఁబడు విషయములు సగుణధ్యానాభ్యాసస్థితిని నిందించునది యని గ్రహింపఁ గూడదు. మఱియేమనిన శమదమాదిషడ్గుణములుగల సాధనచతుష్టయసంపన్నుఁడు, నిర్గుణధ్యానాభ్యాసముఁ జేయుటకుఁ బ్రయత్నించవలసిన దేగాని, సగుణధ్యానమందు మనస్సును జొరఁ

బడనివ్వఁగూడదని, శిష్యునికి గురువు నిర్గుణ ధ్యానాభ్యాసమునకు సాధనమగు నిర్గుణ బ్రహ్మస్వరూపమును దెలియఁజేయుచున్నాఁడని యెఱుంగునది.

ఎనిమిది స్థానములుగలవాక్కు యొక్క వివరము:—

శ్లో॥ అష్టౌస్థానాని వర్ణానామురః కంఠశ్శిరస్తథా।
జిహ్వామూలంచ దంతాశ్చనాసికోష్ఠౌచతాలుచ॥

అర్థము॥ హృదయము, కంఠము, తల, నాలుకమొదలు, దంతములు, ముక్కురంధ్రములు, పెదవులు, దవుడలు, ఈ యెనిమిదియు వాక్కునకు స్థానములు.

---

౬ - మంత్రము.

## 6.

శ్రుతి॥ యన్మనసా న మనుతే యేనాహుర్మనో మతమ్।
తదేవ బ్రహ్మత్వం విద్ధి నేదంయదిదముపాసతే॥ ౬॥

| | |
|---|---|
| యత్ | ఏ బ్రహ్మస్వరూపము |
| మనసా | అంతఃకరణముచే |
| న. మనుతే | తలంచుటకు శక్యముకా.(విషయీకరించుటకలవికాదో,) |
| యేన | ఏ బ్రహ్మస్వరూపముచే |
| మనః | అంతఃకరణము |
| మతమ్ | విషయీకరింపఁబడును(తెలుసుకొనఁబడును అని) |
| ఆహుః | చెప్పఁబడునో. |
| తత్ + ఏవ | అదియే |
| బ్రహ్మ | సమస్తమునకాత్మయగు బ్రహ్మస్వరూపముగా |
| త్వమ్ | నీవు |
| విద్ధి | తెలిసికొనుము. |
| యత్ | (వేఱువేఱు నామరూపములుగల దేవతారూపమగు) నేవస్తువును |
| ఇదమ్ | ఈ నిర్గుణబ్రహ్మముగా |

| | |
|---|---|
| ఉపాసతే | (సగుణ ధ్యానాభ్యాస స్థితియందు సద్గురూపదేశ రహితులచే) నుపాసింపఁబడునో, |
| తత్ | అది |
| ఇదమ్ | (నిర్గుణధ్యానాభ్యాసమునకర్హుఁడవయిన) నీవంటి వానిచే ననుష్ఠింపఁ బడవలసిన) ఈబ్రహ్మ స్వరూపము |
| న | కాదు. |

తాత్పర్యము.

అంతఃకరణము నాలుగనియు, రెండనియు, ఒకటే యనియు, సందర్భాను సారముగ నచ్చటచ్చట గ్రంథములయందు వివరింపఁబడుచున్నది. నిజమును బరిశోధింపఁగా, అంతఃకరణము పంచభూతములయొక్క సమ్మేళన మనియే సిద్ధాంతమయియున్నది; గనుక అంతఃకరణము ఆ పంచభూతముల యొక్క భాగములను గలిగియుండవలసినదే యని నిశ్చయము. అంతఃకరణ మనునది సమష్టివాచకము. అనఁగాఁ బంచభూతములయొక్క సమ్మేళనము చేఁ గలిగినయొక వస్తువునకుఁ బేరుగనున్నది.

అంతఃకరణమందు నాకాశాంశ మితరభూతములభాగములకంటె నెక్కువగా నుండు నప్పు డాయంతఃకరణమునకు నుల్లమని పేరు. అదియే ప్రజ్ఞ యనఁబడును. అట్టి స్థితిలో నంతఃకరణము శుద్ధముగను, సకలవిషయాశా రహితముగను, అంతర్ముఖ దృష్టి వ్యాపకముగను నుండును.

అంతఃకరణమందు వాయవ్యాంశము అధికమై తక్కినభూతములయొక్క భాగములు తక్కువ యైయుండు నప్పు డాయంతఃకరణమునకు మనస్సని పేరు. అట్టిస్థితిలో నంతఃకరణము సంకల్పవికల్పములు గలదిగాను గాలితుపానుసమయములందుసముద్ర తరంగములవంటి కామసంకల్పములు గలదిగాను నుండును.

అంతఃకరణమందుఁ దేజోంశమధికమయి యితరభూతభాగములు తగ్గియున్నప్పు డాయంతఃకరణము బుద్ధి యని చెప్పఁబడును. అట్టిస్థితిలో నంతఃకరణము నిశ్చయాత్మకముగ నుండును. అనఁగా మంచిదో చెడ్డదో యగు దేనినో నిశ్చయించుకొని తదభిముఖమైయుండును.

అంతఃకరణమందు జలాంశమధికమై యితరభూతాంశములు తగ్గియున్నప్పుడా యంతఃకరణమునకుఁ జిత్తమనిపేరు. అట్టిస్థితిలో నంతఃకరణము దేనినో యొకదానిం జింతించుచుండును.

అంతఃకరణముయొక్క పృథివ్యంశమధికముగను దక్కినభూతముల భాగములు దగ్గియున్నప్పుడా యంతఃకరణమునకు నహంకారమనిపేరు. అట్టిస్థితిలో నంతఃకరణము కోపతాపములుగలదియై బుసకొట్టు కృష్ణసర్పమువలె లేఁచి, యెదుట కనుపించు విషయములమీఁదదూకును.

అంతఃకరణ మొక్కటియైనను సందర్భాసందర్భములను బట్టి వేఱువేఱైయైదుపేర్లుగలదియై యుండును. ఇట్లంతఃకరణము సమస్తప్రవృత్తి నివృత్తులుగలదై విషయములఁగూర్చి పనివిడునుగాని, తనకు సత్తనుగలుగఁజేయు బ్రహ్మమునుగూర్చి పనిగొత్తఁజాలదు. ఏల ననఁగా, బ్రహ్మము అంతఃకరణమును విషయమగునట్లుచేసికొనునుగాని, యంతఃకరణము బ్రహ్మమును విషయమగు నట్లుచేసికొనఁజాలదు. ఇందునకు "సర్వంఖల్విదంబ్రహ్మ" యను శ్రుతియే ప్రమాణము.

శిష్యుఁడు ప్రశ్నచేయుచున్నాఁడు ఎట్లనిన:—

ఆవుకుఁబుట్టినదూడయు తల్లిదండ్రులకుఁబుట్టిన శిశువును దమతమ తల్లులను దెలిసికొనునట్లు, బ్రహ్మమందుఁ బుట్టినయంతఃకరణమును బ్రహ్మమును దెలిసికొనుననుటలో సందేహమేల?

అందునకు గురువు సమాధానముఁ జెప్పుచున్నాఁడు:—

ఆవునకుఁబుట్టి వచ్చినదూడకును, అట్లే పుట్టివచ్చిన శిశువునకుఁ గండ్లుమొదలగుసమస్తేంద్రియము లున్నను తల్లి నెట్లు తెలిసికొనఁజాలవో, అట్లు బ్రహ్మమువలన బుట్టిన సమస్తము ను బ్రహ్మమునుదెలిసికొనఁ జాలవు.

శిష్యుఁడు :—ఆ దూడకును శిశువునకును సమస్తేంద్రియములుండినను బ్రాణము లేదు గనుక తమతల్లులను దెలుసుకొనలేవు అనునదిసరియే. మఱియునిన ప్రాణము నింద్రియములునుగల దూడయు శిశువును తల్లినిఁదెలుసుకొనుటకు నేమి సందేహము?

గురువు:—అయితే మూర్ఛానిద్రా వస్థలయందుఁ బ్రాణములు నింద్రియములుండినను ఆ సమయమందుఁ దల్లులనుదెలిసికొనకపోవుట ప్రసిద్ధమైయున్నట్లు, బ్రహ్మ

మును అంతఃకరణము మొదలగునవి తెలిసికొనఁజాలవను మాట ప్రసిద్ధము గనుక, శిష్యుఁడా! యేవస్తువు అంతఃకరణము మొదలగువానిని, నాయంతఃకరణమున కాధారమగు పంచభూతములను, ఆ భూతములుగలుగుట కాధారమగు నహంకారతత్త్వమును, ఆ యహంకార తత్త్వోత్పత్తికి నాధారమగు మహత్తత్త్వమును, ఆ మహత్త్వము గలుగుటకు హేతువైన యవిద్యను, వ్యాపించియుండునది యేదియో, అదియే బ్రహ్మమని యెఱ్ఱు. సగుణధ్యానాభ్యాసస్థితి యందుండు సద్గురూపదేశరహితులయినవారు, జ్ఞాతృ జ్ఞాన జ్ఞేయ భేదములతో నుపాసించెడి వేఱువేఱు నామరూపములు గలదేవతలు, శమదమాది సాధన చతుష్టయసంపన్నులగు నీబోటివారలచే ననుష్ఠింపఁబడవలసిన నీబ్రహ్మము కాదని తెలుసుకొనుము.

అన్ని ప్రవృత్తి నివృత్తులకు నంతఃకరణమే కారణమనుటకు శ్రుతిప్రమాణము.

శ్రు॥ కామస్సఙ్కల్పోవిచికిత్సా శ్రద్ధాఽశ్రద్ధాధృతిరధృతి
హ్రీర్ధీర్భీ రిత్యే తత్సర్వంమనఏవ॥ ~

తా॥ కోరిక, సంకల్పము, ఇచ్ఛ, శ్రద్ధ, అశ్రద్ధ, ధైర్యము, అధైర్యము, లజ్జ, బుద్ధి, భయము, మొదలగునవి యన్నియును మనోరూపమగు నంతఃకరణమేయని వాజసనేయ శ్రుతి పలుకుచున్నది.

అంతఃకరణము బ్రహ్మమును దెలిసికొనఁ జాలదనుటకుఁ బ్రమాణము.

శ్లో॥ ... ... ... నత్వంవేత్థపరంతప. (భగవద్గీతా-అ, 4. శ్లో, 5.)
శ్లో॥ ... ... ... నత్వహంతేషుతేమయి. (భ-అ, 7. శ్లో, 12.)
శ్లో॥ ... ... ... నమాంమష్కృతినోమూఢాః ప్రపద్యన్తే
(భ-అ, 7. శ్లో, 15.)
శ్లో॥ ... ... ... మాంతువేదనకశ్చన. (భ-అ, 7. శ్లో, 26.)
శ్లో॥ మత్థ్సానిసర్వభూతాని నచాహంతేష్వవస్థితః. (భ-అ, 9. శ్లో, 4.)
శ్లో॥ పరంభావమజానన్తో ... ... ... (భ-అ, 9. శ్లో, 11.)
శ్లో॥ నతుమామభిజానన్తి ... ... ... (భ-అ, 9. శ్లో, 24.)

వీటికన్నిటికిని దాత్పర్యమును ఈవ్యాఖ్యానకర్తచే రచియింపఁబడిన "భగవద్గీతా గూఢార్థదీపికా" యను వ్యాఖ్యానమునుజూచునది.

అంతఃకరణాంశమగు జ్ఞానము బ్రహ్మనిష్ఠయం దుండదనుటకుఁ బ్రమాణము.

శ్లో॥ జ్ఞానంస్వయంనశ్యేత్ జలంకతకరేణువత్॥

(ఆత్మబోధతత్త్వార్థదీపికా-శ్లో, 5 ను చూచునది.)

౭ - మంత్రము.

**7.**

శ్రు॥ యచ్చక్షుషా న పశ్యతి యేనచక్షూంషిపశ్యతి।

తదేవ బ్రహ్మత్వంవిద్ధి నేదంయ దిద ముపాసతే॥ ౭॥

| | |
|---|---|
| యత్ | ఏ బ్రహ్మస్వరూపమును |
| చక్షుషా | (రూపములనుగ్రహించు) నేత్రముచే |
| న, పశ్యతి | చూడ నలవికాదో, |
| యేన | (సమస్తమునకుచైతన్యస్వరూపమగు) ఏ బ్రహ్మము |
| చక్షూంషి | నేత్రేంద్రియవ్యాపారములు [చే |
| పశ్యతి | చూడఁబడునో, (విషయాకరింపఁబడునో, అనఁగా, బ్రహ్మచైతన్యముయొక్క ఆశ్రయములేకుండ, కన్నులు దామగాఁ జూడ లేవనుట.) |
| తత్, ఏవ | అదియే |
| బ్రహ్మ | బ్రహ్మమని |
| త్వమ్ | నీవు |
| విద్ధి | తెలిసికొనుము. |
| యత్ | (నామరూపములతోఁ గూడిన దేవతారూపముగా |
| ఇదమ్ | ఈ బ్రహ్మమని [నుండు) ఏవస్తువును |
| ఉపాసతే | (సగుణధ్యానాభ్యాసస్థితిలోనుండు సద్గురూపదేశరహితులైనవారు నిరవయవముగనుండు వస్తువున కవయవములఁ గల్పించి,) ఉపాసనఁజేయుచున్నారో |

తత్ — అది

ఇదమ్ — (నిర్గుణధ్యానాభ్యాసమున కర్హుఁడవగు సాధనచతుష్టయసంపన్నుఁడైన నీవంటివారలచే నుపాసింపఁబడవలసిన) ఈ బ్రహ్మస్వరూపము

న — కాదు.

---

తాత్పర్యము.

శ్లో॥ యథాప్రకాశయత్యేకః కృత్స్నంలోకమిమంరవిః।
క్షేత్రంక్షేత్రీతథాకృత్స్నం ప్రకాశయతిభారత!॥
(భగవద్గీతా-అ, 13. శ్లో, 34.

తా॥ సూర్యుఁడీ సమస్తప్రపంచమును నందునుండువస్తువులను బ్రకాశింపఁజేయుచున్నట్లు, పరమాత్మ యీచరాచరరూపమగు సమస్తమును బ్రకాశింపఁజేయుచున్నాఁడనియు,

శ్రు॥ సూర్యోయథాసర్వలోకస్యచక్షుః
నలిప్యతేచాక్షుషైర్బాహ్యదోషైః।
ఏకస్తథాసర్వభూతాన్తరాత్మా
నలిప్యతేలోకదుఃఖేనబాహ్యః॥

తా॥ సమస్తమును బ్రకాశింపఁజేసికొని నేత్రమునకు నేత్రమై యుండు సూర్యుఁడు, నేత్రములచేఁ గలుగు దృష్టిదోషములవలన బాధింపఁబడనట్లు, ఒక్కఁడుగను, సమస్తమునకుఁ బ్రకాశము నిచ్చువాఁడుగను నుండు పరబ్రహ్మము, ఈ ప్రపంచముయొక్క సుఖదుఃఖములచేఁ బాధింపఁబడఁడనియు.

శ్రు॥ యద్వత్సవితర్యుదితే కరోతి కర్మాణిజీవలోకోఽయమ్।
నచతానికరోతిరవిః నకారయతితద్వదాత్మాపి॥

తా॥ సూర్యప్రకాశము వలననే సమస్తమును దమతమవిషయములయందుఁ బ్రవర్తించుచున్నను, సూర్యుఁడు తానుగ నొకటినిఁజేయక నొరులచేఁ జేయింపక యుండునట్లు, ఆత్మ (బ్రహ్మము) తానుగ నొకటినిఁ

యక నెరులచేఁ జేయింపక యుండినను, ఆత్మ చైతన్యముచేతనే సమస్తమును దమతమ విషయములలోఁ బ్రవర్తించుచున్న దనియు,

శ్లో॥ ఆత్మచైతన్యమాశ్రిత్య దేహేన్ద్రియ మనో ధియః।
స్వకీయార్థేషు వర్తన్తే సూర్యాలోకం యథాజనాః॥

(ఆత్మబోధతత్త్వార్థదీపికా-శ్లో, 19.)

తా॥ ప్రజలు సూర్యప్రకాశము నాశ్రయించి తమతమపనులలోఁ బ్రవర్తించుచున్నట్లు, స్థూలాదిదేహములును, జ్ఞానకర్మేంద్రియములును, ప్రాణాదివాయువులును, బుద్ధిమొదలగునవియు నాత్మచైతన్యము నాశ్రయించి తమతమ విషయములయందుఁ బ్రవర్తించుచున్న దనియుఁ జెప్పఁబడినట్లు,

స్వభావముగా జడముగ నుండు వాగింద్రియము ఏబ్రహ్మవస్తువును వాక్కుచే వచింపఁజాలదో, ఏవాక్కుచే చైతన్యస్వరూపమగు పరమాత్మ వచనక్రియలను జరిగింపుచున్నదో, అదియే బ్రహ్మమనియు, చిత్తము నపహరించు సద్గురూపదేశమును బొందక, విత్తాపహారియగు గురువుచే నుపదేశమును బొందియుండు నవివేకులచే నిరవయవస్వరూపిగనుండు వస్తువునకు నవయవములఁగల్పించి నామరూపములతో సగుణముగా నుపాసనఁజేయఁబడు దైవము, సాధనచతుష్టయసంపన్నుఁడై సద్గురువును జెంది నిర్గుణధ్యానమున కర్హుఁడుగావలసిన నీబోటివారలచే నుపాసింపఁబడవలసిన, ఈనిర్గుణ బ్రహ్మముకాదనియు నెఱుంగుము.

---

౮ - మంత్రము.

## 8.

శ్రు॥ యచ్ఛ్రోత్రేణ నశృణోతి యేనశ్రోత్రమిదంశ్రుతమ్।
తదేవబ్రహ్మత్వంవిద్ధి నేదంయదిదముపాసతే॥ ౮॥

| | |
|---|---|
| యత్ | ఏబ్రహ్మము. |
| శ్రోత్రేణ | (శబ్దములనుగ్రహించు) శ్రోత్రేంద్రియముచేత |
| న, శృణోతి | వినుటకలవికాదో, |
| యేన | (సమస్తమునకునాత్మగనుండు)ఏవస్తువుచేత |

| | |
|---|---|
| ఇదం, శ్రోత్రమ్ | ఈశ్రోత్రేంద్రియము |
| శ్రుతమ్ | వినుచున్నదో, |
| తత్, ఏవ | అదియే |
| బ్రహ్మ | బ్రహ్మమని |
| త్వమ్ | నీవు |
| విద్ధి | తెలిసికొనుము. |
| యత్ | (నామరూపములుగల) ఏవస్తువును |
| ఇదమ్ | ఈ బ్రహ్మమని |
| ఉపాసతే | (అవివేకులే దైవమును విత్తాపహారియగు గురువుచే నుపదేశింపఁబడి, యవయవములఁగల్పించి నామరూపములతో సగుణముగా) ఉపాసించుచున్నారో, |
| తత్ | ఆ దైవము |
| ఇదమ్ | (సాధనచతుష్టయముగల నిర్గుణధ్యానాభ్యాసమునకర్హుఁడవగు నీబోటివారలచే నుపాసింపఁబడవలసిన) ఈ బ్రహ్మము |
| న | కాదు. |

---

తాత్పర్యము.

దిక్కును దేవతను అధిదైవతముగాఁగలదియు, పంచభూతములలో ఆకాశాంశమైనదియు, మనోవ్యాపారముతోఁ జేరినదియు, ఇవియన్నియు నుండినను ఆత్మచైతన్యముయొక్క సహాయము లేకుండ తానుగ వినుటకు శక్తిలేని జడమైనదియునగు శ్రోత్రేంద్రియము, తనకు సత్తనుగలుగఁజేయుబ్రహ్మమును (ఆత్మను—భగవంతుని) తెలిసికొనఁజాలదు. ఏచైతన్యముచే నీచవి మొదలగు సమస్తమును తమతమగోళములయందుఁ బ్రవర్తించుచున్నవో, అదియే బ్రహ్మమనియు, జ్ఞాతృ, జ్ఞాన, జ్ఞేయభేదములుగల నామరూపములతోఁ గూడినదిగా సద్గురూపదేశరహితులచే నుపాసింపఁబడు అద్వైవము, సాధనచతుష్టయ సంప

న్నుఁడై సద్గురూపదేశమును జెందియుండు నీబోటివారలచే నుపాసింపఁబడ వలసిన, ఈ బ్రహ్మము కాదనియు నెఱుంగుము.

---

౯ - మంత్రము.

9.

శ్రు॥ యత్ ప్రాణేన న ప్రాణితి యేనప్రాణఃప్రణీయతే।
తదేవబ్రహ్మత్వంవిద్ధి నేదంయదిదముపాసతే॥ ౯॥

| | |
|---|---|
| యత్ | ఏబ్రహ్మము [యువుచే |
| ప్రాణేన | (ఉచ్ఛ్వాస నిశ్శ్వాసరూపముగనుండు) ప్రాణవా |
| న, ప్రాణితి | (వాసనలను గ్రహించునట్లు) గ్రహింపఁజాలదో, |
| యేన | (చైతన్యస్వరూపమగు) ఏబ్రహ్మముచే |
| ప్రాణః | ప్రాణము |
| ప్రణీయతే | చేష్టగలదిగానగుచున్నదో, |
| తత్, ఏవ | అదియే |
| బ్రహ్మ | బ్రహ్మమని |
| త్వమ్ | నీవు |
| విద్ధి | తెలిసికొనుము. |
| యత్ | (నామరూపక్రియలుగల బ్రహ్మ విష్ణు రుద్రాదిదేవతలుగానుండు) ఏవస్తువు |
| ఇదమ్ | ఈనిర్గుణనిరవయవ బ్రహ్మముగా |
| ఉపాసతే | (సద్గురూపదేశమునుబొందని సగుణాభ్యాసదశయందుండు వారలచే) ఉపాసింపఁబడుచున్నదో, |
| తత్ | ఆవస్తువు |
| ఇదమ్ | (సాధనచతుష్టయస్థితిని బొంది సద్గురూపదేశమును జెందవలసిన నీబోటివారలచే నుపాసనచేయఁబడవలసిన) ఈనిర్గుణబ్రహ్మము |
| | కాదు. |

తాత్పర్యము.

పృథివిని నధిదైవతముగాఁ గలదియు, అన్తఃకరణముతోఁ జేరి ముక్కు ద్వారముల మార్గముగా చైతన్యముయొక్క సహాయము లేకుండ నుచ్ఛ్వాస నిశ్వాస రూపములుగా శ్వాసక్రియలను తానుగాఁ జేయ శక్తిలేని జడమైనది యనగు ప్రాణము, బ్రహ్మమును దెలిసికొనఁజాలదు. చైతన్య స్వరూపముగ నుండు నేవస్తువుచే నీప్రాణము మొదలగు సమస్తమును చేష్టలుగలవిగా నగు చున్నవో, అదియే బ్రహ్మమనియు, జ్ఞాతృ, జ్ఞాన, జ్ఞేయ భేదములచే సగుణ ముగా నుపాసింపఁబడునది, ఈ బ్రహ్మము కాదనియు నెఱుంగుము.

ఏవస్తువు సర్వాంతర్యామిగను, స్వయంప్రకాశముగను, సమస్తమును దమ తమ వ్యాపారములయందుఁ బ్రవృత్తించుటకు హేతువుగనుండి ప్రేరణఁజేయునది యో, అదియే సర్వపరిపూర్ణమగు బ్రహ్మమనియు, అట్టి బ్రహ్మమొకటియే "ఇదమ్", శబ్దమునకు విషయముకాదనియు, దెలియఁజేయుటకై యీప్రథమఖండమునందలి నాలుగవ మంత్రము మొదలుకొని నీమంత్రముపరకునుగల ప్రతిమంత్రమందును, "ఏవ" శబ్దముపయోగింపఁబడినదని గ్రహించునది.

ఈ మంత్రమందుగల ప్రాణశబ్దమునకు, ఘ్రాణేంద్రియద్వారా శ్వాసములను విడుచుటయు పీల్చుటయు, అను క్రియగల యొకవస్తువని గ్రహించునది.

జ్ఞానేంద్రియము లైదునకును, కర్మేంద్రియము లైదునకును, అన్తఃకరణములై దునకును అధ్యాత్మము, (స్వభావముగాఁగల పేర్లు) అధిభూతము (పంచభూతములయొక్క యంశము) అధిదైవతము, (క్రియనడుచుటకుసాధనమగు దైవము) అను నీ మూఁడును ప్రతియింద్రియమునకుఁ గలవు.

అందులో, శ్రోత్రము, త్వక్కు, చక్షుస్సు, జిహ్వా, ఘ్రాణ మగు జ్ఞానేంద్రియ పంచకముయొక్క అధ్యాత్మ, అధిభూత, అధిదైవతములయొక్క వివరము క్రింద వ్రాయబడుచున్నది. ఎట్లనిన:—

శ్లో॥ శ్రోత్రమధ్యాత్మమిత్యుక్తం శ్రోతవ్యంశబ్దలక్షణమ్।
అధిభూతంతదిత్యుక్తం దిశస్తత్రాధిదైవతమ్॥ ౧౪।

శ్లో॥ త్వగధ్యాత్మమితిప్రోక్తం స్ప్రష్టవ్యంస్పర్శలక్షణమ్।
అధిభూతంతదిత్యుక్తం వాయుస్తత్రాధిదైవతమ్॥ ౧

శ్లో॥ చక్షురధ్యాత్మమిత్యుక్తం ద్రష్టవ్యంరూపలక్షణమ్।
అధిభూతంతదిత్యుక్తం ఆదిత్యోఽత్రాఽధిదైవతమ్॥ ౧౬॥

శ్లో॥ జిహ్వాఽధ్యాత్మంతయాస్వాద్యం అధిభూతంరసాత్మకమ్।
వరుణోదేవతాత్ర జిహ్వాయామధిదైవతమ్॥ ౧౭॥

శ్లో॥ ఘ్రాణమధ్యాత్మమిత్యుక్తం ఘ్రాతవ్యంగన్ధలక్షణమ్।
అధిభూతంతదిత్యుక్తం పృథివ్యత్రాధిదైవతమ్॥ ౧౮॥

| తా॥ అధ్యాత్మము. | అధిభూతము. | అధిదైవతము. |
|---|---|---|
| శ్రోత్రము(చెవి) | ఆకాశమందు తేజోంశమగు శబ్దలక్షణము. | దిక్కు. |
| త్వక్కు(చర్మము) | వాయువునందు తేజోంశమగు స్పర్శలక్షణము. | వాయువు. |
| చక్షుస్సు(కన్ను) | తేజస్సునందు తేజోంశమగు రూపలక్షణము. | సూర్యుఁడు. |
| జిహ్వ(నాలుక) | జలమునందు తేజోంశమగు రసలక్షణము. | వరుణుఁడు. |
| ఘ్రాణము(ముక్కు) | పృథివియందు తేజోంశమగు గంధలక్షణము. | పృథివి. |

వాక్కు, పాణి, పాద, పాయు, ఉపస్థములనఁబడు కర్మేంద్రియపంచకము యొక్క అధ్యాత్మ, అధిభూత, అధిదైవతములయొక్క వివరములు ఎట్లనిన:—

శ్లో॥ వాగధ్యాత్మమితిప్రోక్తం వక్తవ్యంశబ్దలక్షణమ్।
అధిభూతంతదిత్యుక్తం అగ్నిస్తత్రాధిదైవతమ్॥ ౧౯॥

శ్లో॥ హస్తావధ్యాత్మమిత్యుక్తం ఆదాతవ్యంచయద్భవేత్।
అధిభూతంతదిత్యుక్తం ఇంద్రస్తత్రాధిదైవతమ్॥ ౨౦॥

శ్లో॥ పాదావధ్యాత్మమిత్యుక్తం గన్తవ్యంతత్రయద్భవేత్।
అధిభూతంతదిత్యుక్తం విష్ణుస్తత్రాధిదైవతమ్॥ ౨౧॥

శ్లో॥ పాయురిన్ద్రియమధ్యాత్మం విసర్గస్తత్రయోభవేత్।
అధిభూతంతదిత్యుక్తం మృత్యుస్తత్రాధిదైవతమ్॥ ౨౨॥

శ్లో॥ ఉపస్థేన్ద్రియమధ్యాత్మం స్త్రియాద్యానన్దకారణమ్।
అధిభూతంతదిత్యుక్తం అధిదైవతంప్రజాపతిః॥ ౨౩।

తా॥

| అధ్యాత్మము. | అధిభూతము. | అధిదైవతము. |
|---|---|---|
| వాక్కు | ఆకాశమందుఆకాశాంశమగు శబ్దలక్షణము. | అగ్ని. |
| పాణి (భుజము) | తేజస్సునందుఆకాశాంశమగు దానప్రతిగ్రహలక్షణము. | ఇంద్రుఁడు. |
| పాదము (కాలు) | వాయువునందుఆకాశాంశమగు గమనలక్షణము. | విష్ణువు. |
| పాయు(మలద్వారము) | పృథివియందుఆకాశాంశమగు విసర్జనలక్షణము. | మృత్యువు. |
| ఉపస్థము(జలద్వారము) | జలమునందుఆకాశాంశమగు ఆనన్దలక్షణము. | ప్రజాపతి. |

అంతఃకరణపంచకముయొక్క అధ్యాత్మ, అధిభూత, అధిదైవతముల వివరములు ఎట్లనిన:—

శ్లో॥ మనోఽధ్యాత్మమితిప్రోక్తం మన్తవ్యంతత్రయద్భవేత్।
అధిభూతంతదిత్యుక్తం చన్ద్రస్తత్రాధిదైవతమ్। ౨౪॥

శ్లో॥ బుద్ధిరధ్యాత్మమిత్యుక్తం బోద్ధవ్యంతత్రయద్భవేత్।
అధిభూతంతదిత్యుక్తం అధిదైవంబృహస్పతిః॥ ౨౫॥

శ్లో॥ అహఙ్కారస్తథాధ్యాత్మం అహఙ్కర్తవ్యమేవచ।
అధిభూతంతదిత్యుక్తం రుద్రస్తత్రాధిదైవతమ్॥ ౨౬॥

శ్లో॥ చిత్తమధ్యాత్మమిత్యుక్తం చిన్తవ్యంతత్రయద్భవేత్।
అధిభూతంతదిత్యుక్తం క్షేత్రజ్ఞోఽత్రాధిదైవతమ్॥ ౨౭॥

శ్లో॥ తమోఽధ్యాత్మమితిప్రోక్తం వికారస్తత్రయోభవేత్।
అధిభూతంతదిత్యుక్తం ఈశ్వరోఽత్రాధిదైవతమ్॥ ౨౮॥

| తా॥ అధ్యాత్మము. | అధిభూతము. | అధిదైవతము. |
| --- | --- | --- |
| మనస్సు | వాయువునందుఁబృథివ్యంశమగు మననలక్షణము. | చంద్రుఁడు. |
| బుద్ధి | తేజస్సునందుపృథివ్యంశమగు బోధలక్షణము. | బృహస్పతి. |
| చిత్తము | జలమునందు పృథివ్యంశమగు చింతనాలక్షణము. | క్షేత్రజ్ఞుఁడు. |
| అహంకారము | పృథివియందుపృథివ్యంశమగు అహంకర్తృత్వలక్షణము. | రుద్రుఁడు. |
| తమస్సు | ఆకాశమునందుపృథివ్యంశమగు వికారలక్షణము. | ఈశ్వరుఁడు |

ఈ వివరములను, సురేశ్వరాచార్య విరచితంబగు పంచీకరణవార్తికమందు, ౧౭-వ శ్లోకము మొదలుకొని, ౨౯-వ శ్లోకమువరకుగల వ్యాఖ్యానమును జూచునది. లేక, ఈవ్యాఖ్యానకర్తచే రచియింపఁబడియుండు "ఆత్మబోధతత్త్వార్థదీపికా" అను గ్రంథమునందు సవిస్తరముగా వ్రాయఁబడియున్నది; గనుక నచ్చట జూచుకొనునది.

ఇట్లు

సామవేదములోఁజేరిన తలవకారోపనిషత్తను

కేనోపనిషత్తునందలి

మొదటిఖణ్డము

ముగిసినది.

---

ఓమ్, తత్, సత్,

బ్రహ్మార్పణమస్తు.

---

ओं

ఓమ్, తత్, సత్ బ్రహ్మణే నమః.

# కేనోపనిషద్దీపికా.

## రెండవ ఖణ్డము.

### ౧ - మంత్రము.

### అవతారిక.

ప్రథమఖణ్డమందలి రెండవమంత్రమునందు బ్రహ్మము చెవికిఁ జెవియనియు మనస్సునకు మనస్సనియు, నాల్గవమంత్రమునందుఁ దెలియఁబడినదానికిని తెలియఁబడనిదానికిని వేఱైనదనియు, అయిదు, ఆఱు, ఏడు, ఎనిమిది, తొమ్మిదవ మంత్రముల యందు వాక్కు, మనస్సు, నేత్రము, చెవి, ప్రాణము మొదలగువానిచే బ్రహ్మమును వచించుటకుఁగాని, చూచుటకుఁగాని, వినుటకుఁగాని, లేక, ఘ్రాణించుటకుఁగాని నలవికాదనియు, ఏవస్తువులేనియెడల యీవాక్ఛ్రోత్రములు మొదలగునవి దమతమ విషయములయందుఁ బ్రవృత్తింపఁ జాలవో, అదియే బ్రహ్మమనియు, చెప్పిన వాక్యములచే నాత్మస్వరూపమగు బ్రహ్మ లక్షణములనన్నిటినిఁ జక్కఁగా విని "సమస్తమునకు నేనే యాత్మయై యున్నాను" అని తెలిసికొనినవానివలె నటించు శిష్యునిఁగూర్చి గురుఁడిట్లనియె :—

ఓ శిష్యుఁడా! "నేను బ్రహ్మమును లెస్సగాఁ దెలిసికొనినాను" అని నీవు తలంచి యుండుస్థితి, నాకు మిక్కిలి సంతోషకరమైనదే. అయితే, నీవు బ్రహ్మమును దెలిసికొనవలసిన విధముగాఁ దెలిసికొనినావో లేదో, అను సందేహము నాకున్నది. ఏల యనిన, "నేను బ్రహ్మమును లెస్సగాఁ దెలిసికొనినాను" అనుటలో తెలిసికొనువాఁడు, తెలియఁబడువస్తువు, తెలివి యను మూఁడుపదార్థములు లేకుండఁదెలిసికొనుట యనునది సిద్ధింపదు. గనుక, "నేను బ్రహ్మమును లెస్సగాఁ దెలిసికొనినాను" అని

నీవు చెప్పునది విశ్వసింపఁ దగినదికాదు. అట్టి స్వానుభవము నీకుఁ గలుగుటకై నీవు తెలుసుకొనవలసిన యంశములు కొన్నియున్నవి. వానిని నీకుఁజెప్పెద వినుము:—

## 1.

శ్రు॥ యదిమన్యసే సువేదేతి

*దభ్రమేవాపినూనం త్వంవేత్థబ్రహ్మణోరూపం।

య దస్య త్వం య దస్యదేవే

ష్వథ ను మీమాంస్యమేవ తే మన్యే విదితమ్॥ ౧॥

| అన్వయము. | అర్థము. |
|---|---|
| (అహమ్) | నేను |
| (బ్రహ్మ) | బ్రహ్మమును |
| సువేద, ఇతి | లెస్సఁగాఁదెలిసికొనినానని |
| త్వమ్ | నీవు |
| మన్యసే, యది | తలంచితివేని. |
| (తత్) | ఆ తలంపు |
| దభ్రం, ఏవ, (భవతి) | అల్పమైనదియే యగును. [యొక్క |
| అస్య, బ్రహ్మణః | (దేశకాలవస్తుపరిచ్ఛేదరహితమైన) ఈ బ్రహ్మము |
| యత్, రూపమ్ | ఏ రూపమును |
| త్వమ్ | (శిశుత్వముమొదలు వయోధికత్వముపరకుఁగల ఈ శరీరముగా) నీవు |
| వేత్థ, (ఇతి) | తెలిసికొనినావని |
| (మన్యసే, యది) | తలంచితివేని, |
| (తదపి) | అదియును, |
| అస్య | ఈ బ్రహ్మముయొక్క |
| యత్, (రూపమ్). | ఏ రూపమును |

* "దహరమేవాపి", అనియు పాఠముకలదు.

| | |
|---|---|
| దేవేషు | దేవతారూపములయందు (కరచరణాద్యవయవములు గల యింద్రాది సగుణరూపములుగా) |
| వేత్థ, (ఇతి) | తెలిసికొనినావని |
| (మన్యసే, యది) | తలంచితివేని, |
| (తదపి) | అదియును |
| (దభ్రం, ఏవ) | అల్పమైనదియేయగును (అనునదియు) |
| నూనమ్ | నిశ్చయము. |
| అథ, ను | (అయితే) అందుఁబిమ్మట (ఏమిచేయవలసినదనిన) |
| (తత్) | ఆ బ్రహ్మస్వరూపము |
| తే, (త్వయా) | నీకు (నీచే) |
| మీమాంస్యం, ఏవ | గురూపదేశమూలముగా బాగుగ విచారణఁజేసి తెలిసికొనవలసినదియే (అని గురువు చెప్పినవాక్యములనువినిన శిష్యుఁడిట్లనియె:—) |
| తత్ | ఆ బ్రహ్మస్వరూపము |
| విదితం, (ఇతి) | స్వానుభవముచేఁదెలిసికొనవచ్చునని |
| మన్యే | తలంచుచున్నాను. (అనిపలికెను.) |

## తాత్పర్యము.

“కేనేషితమ్” ఎవ్వనిచేఁ బ్రేరణచేయఁబడినది? అను నీ మొదలగు ప్రశ్నలను ప్రథమఖండ ప్రారంభమునం దడిగిన శిష్యునికిఁ బ్రత్యుత్తరముగాఁ జెప్పఁబడిన గురువాక్యములను జక్కఁగా వినిన పిమ్మట శిష్యుఁడు, “నేను బ్రహ్మమును లెస్సఁగాఁ దెలిసికొనినాను” అని పలికెను. అప్పుడు గురుఁడు శిష్యుని వాక్యమునందు సందియముగలవాఁడై, తనయుపదేశ వాక్యములను శిష్యుఁడు సరిగా గ్రహించినాఁడో లేదో, యను తనసంశయమును నివారణఁ జేసికొనుటకై శిష్యునిఁగూర్చి గురుఁడిట్లనియె:—ఓశిష్యుఁడా! ఏది తెలిసికొనఁబడునో, అది తెలిసికొనువానిచే విషయీకరింపఁ బడునుగదా? ఎట్లనిన, “నేనుపుస్తకమునుదెలిసికొనినాను” అనుటలో, తానువేఱుగాను, పుస్త

కము వేఱుగాను, పుస్తకము దనచేఁ దెలిసికొనఁబడినదిగా నగునుగదా? ఇంతియగాక, ఒకవస్తువును దెలిసికొనుటకుఁ దెలిసికొనువాఁడు, తెలియఁబడువస్తువు, తెలివి, అను మూఁడుపదార్థము లావశ్యకములుకదా? ప్రథమఖండమందలి రెండవ మంత్రముచే నీవేమి తెలిసికొనియున్నావు? నీవు జాగరూకుఁడవై తెలిసికొనియుండిన యెడల వాక్కునకు వాక్కుగను, జెవికిఁ జెవిగను, మనస్సునకు మనస్సుగను, నేత్రమునకు నేత్రముగను, ప్రాణమునకుఁ బ్రాణముగనుండున దేదియో, అదియే బ్రహ్మమనియు, నయ్యది మనస్సుచేతను నింద్రియములచేతను దెలిసికొనుట కలవికానిదియనియును గదా సిద్ధాంతమగును? మఱియు నగ్ని యితర పదార్థములను బ్రకాశింపఁజేయును, దహించును. ఇతర పదార్థములు అగ్నినిఁ బ్రకాశింపఁజేయఁజాలవు, దహింపనుజాలవు. కనుక, బ్రహ్మవస్తు వొకటియే సమస్తమును బ్రకాశింపఁజేసి తానును బ్రకాశించును. బ్రహ్మమును బ్రకాశింపఁజేయగల మఱి యొకవస్తువు లేనేలేదు, అని మొదటి ఖండమునం దిదివరకే చెప్పి యున్నాను గదా? అట్లుండఁగా, నెద్దానికిని విషయముకాని బ్రహ్మమును "నేను బ్రహ్మమును లెస్సఁగాఁ దెలిసికొనినాను" అని నీవు పలుకుచున్న మాటలు కల్లలని సిద్ధాంతమాయెను. గనుక, అట్టి నీమాటలు హేయములుగా ముగిసెను.

అధ్యాత్మిక (నామరూపములుగలవస్తువు, లేక, శరీరముగలవస్తువు) అధిభౌతిక (పంచభూతములయొక్క యంశములుగల వస్తువు) అధిదైవిక (ఏదైన నొక దేవతను నధిష్ఠానముగాఁగల వస్తువు) రహితమయినదియు, దేశకాలవస్తు పరిచ్ఛేద రహితమయినదియునగు బ్రహ్మమును, పంచభూతసమ్మేళనముచేఁ గలిగిన జ్ఞానకర్మేంద్రియాంతఃకరణములుగల నీశరీరముగాఁగాని, లేక, శరీరియగు నవిద్యాప్రతిబింబుఁడైన జీవుఁడుగాఁగాని దెలిసికొనినానని జెప్పితివేని, అదియు నిందింపఁదగినదియగును. అట్లుగాక, నీబ్రహ్మమును మాయోపాధికులైన బ్రహ్మ విష్ణు రుద్రాదులుగాఁగాని, ఇంద్రాగ్నులు మొదలైన దేవతలుగాఁగాని దెలిసికొనినానని జెప్పితివేని, అదికూడ నిందింపఁదగిన మాటలగును. ఈయాత్మయగు బ్రహ్మము కొందఱికి గురూపదేశముచే యథార్థముగాను, కొందఱికి విపరీతముగాను, కొందఱికిఁ దెలిసి తెలియనిదిగాను బోధమగుచున్నది. మఱికొందఱికో, యెన్నివిధములుగఁ జెప్పినను బోధపడు

టయే లేదు. అనేకముగాఁ దర్కము చదువుకొనిన వారలకు నిజముగా బోధఁబడుట దుర్లభము. ఇంద్రుఁడీ బ్రహ్మవిద్య నుపదేశముపొందినప్పుడు, అనఁగా,

శ్రు॥ "యఏషోఽక్షిణిపురుషోదృశ్యతే ఏషతఆత్మేతిహోవా
చైతదమృతమభయమేతద్బ్రహ్మేతి॥"

తా॥ ఓ దేవరాట్టగు ఇంద్రుఁడా! నేత్రముద్వారా నీవే నీయెదుట ఆకాశము నందుఁ జూచు ఛాయాపురుషుఁడే యీయాత్మ. అదియే యమృతమైనది. అదియే యభయమైనది. అదియే బ్రహ్మము. (ఇది యిట్టియభ్యాసముగల గురువుచేఁ దెలిసికొనవలసిన రహస్యాంశము.)

అని ప్రథమమం దుపదేశమునుబొంది తానేకాంతముగనుండి యభ్యసించినను మనస్సు నిలువకఁబోయి నందున తిరిగి గురువువద్దకువచ్చెను. ఆ గురుఁడీతని కనేకవిధములుగాఁ జెప్పి బోధపరచియు మనస్సునంటలేదు. అప్పుడు గురుఁ డింద్రునిఁజూచి, నీవింక కొంతకాలము గురుకులవాసము చేసినఁగాని నీమనస్సునందుండు కాలుష్యములుఁ బోఁజాలవు. మనస్సు కాలుష్య రహితమైనఁగాని గురువాక్యములు బోధపడవు. అనిచెప్పిన మాటలను వినిన యింద్రుఁడు, దుఃఖాక్రాంతుఁడై పట్టుదలగల మనస్సుతో వెళ్లి, కొంతకాలము గురుకులవాసముచేసి, మఱల గురువును జెందెను. రెండవసారియు గురుఁ డా వాక్యమునే యుపదేశించెను. అప్పు డింద్రుఁడు గ్రహింపలేక తిరిగి గురుకులవాసమున కేతెంచెను. ఇట్లు గట్టి పట్టుదలగల యింద్రుఁడు నాల్గవపర్యాయ మెట్లైనసాధించి స్వానుభవమును జెందెనని యుపనిషత్తునందుఁ జెప్పఁబడియున్నది. గనుక, సద్గురువుచే నుపదేశింపఁబడినను అసంభావన, సంశయభావన, విపరీతభావనలచేతను,

1. జీవేశ్వర భిన్న భేదము,

2. జీవాత్మయందుండు కర్తృత్వాది గుణభేదములు వాస్తవములా, కావా? అను, జీవాత్మలయొక్క పరస్పరభేదము,

3. స్థూలసూక్ష్మకారణములను శరీరత్రయముతోఁగూడిన జీవుఁడు, అసంగుఁడుకాఁడు, అను జీవ జడములయొక్క భేదము.

4. జగత్కారణరూపమగు వస్తువునకు వికారిత్వముగల దను, ఈశ్వరజడములయొక్క భేదము.

5. కారణమునకన్న భిన్నముగఁదోఁచు జగత్తు సత్యమను, జడములయొక్క పరస్పరభేదము.

ఇట్టి యయిదువిధములయిన భేదభ్రమములచేతను, శిష్యునికి గురుఁ డుపదేశించు వాక్యముల యథార్థబోధయును, లక్ష్యమందు మనస్సు నిలుచుటయును, తటస్థింపదు. కనుక, హృదయకాలుష్యమును బోఁగొట్టుకొనుటకై గురుకులవాసముచేసి వారియాజ్ఞను శిరసావహించి మాఱుమాటలాడక భృత్యుఁడైయుండిన శిష్యునికి సకల సందేహములును విడిచిపోవును, హృదయకాలుష్యంబును ఛేదింపఁబడును. పిమ్మట గురూపదేశలక్ష్యమందు మనస్సు నిలుచును. కనుక, "నేను బ్రహ్మమును లెస్సఁగాఁ దెలిసికొనినాను" అని నీవుచెప్పుమాటలను నమ్మజాలను. ఏలననిన:—ఈబ్రహ్మమును శ్రుతులయందు,

శ్రు॥ అశబ్దమస్పర్శమరూపమవ్యయం।
తథాఽరసంనిత్యమగన్ధవచ్చయత్॥

తా॥ శ్రోత్రేంద్రియముచేతను, త్వగింద్రియముచేతను, చక్షురింద్రియముచేతను, జిహ్వేంద్రియముచేతను, ఘ్రాణేంద్రియముచేతను, అన్తఃకరణముచేతను దెలిసికొనుట కలవి కాదనియు, ఇవియన్నియు నశించినను,ఆత్మయొకటియే నాశనములేని దనియుఁ జెప్పఁబడును. మఱియు, నీయాత్మను సకలోపాధివర్జితమనియు, శాంతము, నిత్యము, అద్వైతమనియు,

"కాలత్రయాబాధితం బ్రహ్మ".
"నిర్గుణ స్వరూపం బ్రహ్మ".
"ఆదిమధ్యాన్త శూన్యం బ్రహ్మ".
"సర్వం ఖల్విదం బ్రహ్మ".
"మాయాతీతం గుణాతీతం బ్రహ్మ"
"అనన్త మప్రమేయ మఖణ్డ పరిపూర్ణం బ్రహ్మ",
"అద్వితీయం పరమానన్ద శుద్ధ బుద్ధ ముక్త సత్యస్వరూప వ్యాపకాఽభిన్నం అపరిచ్ఛిన్నం బ్రహ్మ".
"సత్యం జ్ఞాన మనన్తం బ్రహ్మ".
"సచ్చిదానన్ద స్వప్రకాశం బ్రహ్మ".

"మనోవాచామగోచరం బ్రహ్మ".

"అమిత వేదాన్తవేద్యం బ్రహ్మ".

"దేశకాలవస్తు పరిచ్ఛేదరహితం బ్రహ్మ".

"సర్వపరిపూర్ణం బ్రహ్మ".

"తురీయం నిరాకారమేకం బ్రహ్మ".

"ప్రణవాత్మకం బ్రహ్మ".

"ప్రజ్ఞానం బ్రహ్మ".

"అయమాత్మా బ్రహ్మ".

"సర్వం సత్యం పరం బ్రహ్మ".

అనియు, శ్రుతులు ఘోషించుటవలన, అట్టి బ్రహ్మమును దెలిసికొనుట మిక్కిలిదుర్లభంబు. కాఁబట్టి, ఓ శిష్యుఁడా! నీవు సద్గురువును జెంది చక్కఁగా బ్రహ్మవిచారణఁజేసి ప్రమాణగత ప్రమేయగత సందేహము లన్నియును బోఁగొట్టుకొనవలసిన దవశ్యకమని చెప్పిన గురువాక్య సారాంశములను లెస్సఁగా శిష్యుఁడు తెలిసికొని, ఏకాంతస్థలము నకువెళ్లి, స్థిరాసనమునందుఁగూర్చుండి, మనస్సును విషయములనుండిత్రిప్పి, గురువుచే నుపదేశింపఁబడిన ప్రతియంశమును లెస్సగా మననముచేసి, నిదిధ్యాసనముచే సకలసందేహములను దొలఁగించి, నిరంకుశతృప్తినిఁజెంది, మనస్సులయముసొచ్చి స్వానందామృత సాగరమునందమగంటియుండుటవలన, ఆంతర సంతాపసంతతి నశించి, స్వానుభవమగు బ్రహ్మానందము ననుభవించి, మనస్సు నిష్ఠనుండి పునరుద్ధారణము యినప్పుడు గురుసన్నిధానమునకు వెళ్లి, సాష్టాంగవందనములానర్చి, ఆనందబాష్ప భరితుఁడై అంజలిబద్ధుఁడగు శిష్యుఁడిట్లనియె, ఓ స్వామీ! బ్రహ్మస్వరూపము స్వానుభవైకవేద్యమేకాని సామాన్యముకాదు, అని పలికెను.

అసంభావన,

సంశయభావన,

విపరీతభావనలయొక్క వివరములు:—

వేదాంతవాక్యములు అద్వైతబ్రహ్మవిషయములోఁ బ్రమాణము లగుసో కావో? అనునది యసంభావనయనఁబడును.

ఆత్మసంశయమనియు, అనాత్మసంశయమనియు, సంశయభావన రెండు తెఱంగులు. అందనాత్మసంశయము సంఖ్యలేనిదియు, ప్రయోజనకారియు కాదు. గనుక, విచారింపఁబడలేదు.

ఆత్మసంశయము ననేకములుగనుండిన నందు ముఖ్యమగు కొన్నిటిని మాత్రము చెప్పఁబడును. ఏవియనిన:—

జీవుఁడు బ్రహ్మముతో నభిన్నమా లేక భిన్నమా? అభిన్నమైనను నెల్లప్పుడు నభిన్నమా, లేక మోక్షకాలమందుమాత్ర మభిన్నమా? ఎల్లప్పుడు నభిన్నమైనను ఆనందాద్యైశ్వర్యవంతుఁడా, లేక తద్రహితుఁడా? ఆనందాదిరహితుఁడైనను ఆనందాదులుగుణమా, లేక స్వరూపమా? అను నీ మొదలగు "తత్" పదము నకభిన్నమైన "త్వమ్" పదార్థుఁడగు జీవుఁడైన ఆత్మనుగూర్చిన సంశయములు.

మఱియు, జీవాత్మ దేహాదులకు భిన్నమా, లేక యభిన్నమా? భిన్నమైనను అణురూపమా, లేక మధ్యమ పరిమాణరూపమా? విభుపరిమాణరూపమా? విభుపరిమాణ రూపమైనను కర్తయా లేక యకర్తయా? అకర్తయైనను పరస్పర భిన్నముగా ననేకమా, లేక, ఏకమా? అనియు, ఈలాగుననే "తత్" పదార్థ వస్తువునందును గలుగు సంశయము లేవియనిన:—

భగవంతుఁడు (బ్రహ్మము) వైకుంఠాదిలోకములయందు నివసించు హస్త పాదాది యవయవములతోఁగూడిన పరిచ్ఛిన్నమగు శరీరముగలవాఁడా, లేక శరీరము లేని విభుఁడా? శరీరములేని విభుఁడనినను జగదుత్పత్తికొఱకు పరమాణువుల నపేక్షించు కర్తగానున్నాఁడా, లేక అపేక్షింపని కర్తగానున్నాఁడా? పరమాణువుల నపేక్షింపని కర్తయైనను కేవలం కర్తగానున్నాఁడా? లేక యభిన్ననిమిత్తోపాధానకర్తగానున్నాఁడా? అభిన్న నిమిత్తోపాధాన కర్తయైనను ప్రాణులకర్మముల నపేక్షింపని కర్తగాఁ బ్రాణుల ననేక పాపకార్యములకు లోఁబఱచి విషమకృత్యములను జేయు దోషములుగలవాఁడా? లేక, ప్రాణులయొక్క కర్మానుసారముగాఁ దత్తత్ కర్మఫలములను విభజించు కర్తయగు దోషరహితుఁడా? అను నీమొదలగు సంశయములు గలుగుటయే, సంశయ భావన యనఁబడును.

గురుకులవాసము చేయునప్పుడు గురుఁడు దనకు నిజము నుపదేశింపలేదనియు, మంచిగ్రంథములను జదివి తత్ప్రకారము నడుచుకొనునదియే చాలు గురు

వక్క అలేదనియు, తనకన్న గురుఁడేమి హెచ్చుగాఁ జదివియున్నాఁడా? వాఁడు చెప్పు ప్రతియంశమును దనకుఁ దెలియనిది కాదనుచు, గురువాక్యములయం దవిశ్వాసుఁడై యుండు శిష్యుని చిత్తవృత్తియే, విపరీతభావన యనఁబడును.

## పంచభ్రమలయొక్క వివరములు :—

భ్రమఃపంచవిధోభాతి తదేవేహాసముచ్యతే।
జీవేశ్వరాభిన్నరూపౌ ఇతిప్రాథమికోభ్రమః॥ ౧॥

ఆత్మనిష్ఠంకర్తృగుణం వాస్తవంవాద్వితీయకః।
శరీరత్రయసంయుక్త జీవస్సంగీ తృతీయకః॥ ౨॥

జగత్కారణరూపస్య వికారిత్వంచతుర్థకః।
కారణాద్భిన్నజగత్ సత్యత్వంపంచమోభ్రమః॥ ౩॥

బింబప్రతిబింబదర్శనేన భేదభ్రమోనివృత్తిః।
స్ఫటికలోహితదర్శనేన పారమార్థికకర్తృత్వభ్రమోనివృత్తిః॥ ౪॥

ఘటమఠాకాశదర్శనేన సంగిత్వభ్రమోనివృత్తిః।
కనకరుచకదర్శనేన వికారిత్వభ్రమోనివృత్తిః॥ ౫॥

రజ్జుసర్పదర్శనేన కారణాద్భిన్నజగత్కర్తృత్వభ్రమోనివృత్తిః॥ ౬॥

తా॥ భ్రమ అయిదువిధములనిఁ జెప్పఁబడును. అందు :

౧. జీవుఁడు వేఱు ఈశ్వరుఁడు వేఱు,అని చెప్పునది ప్రథమభ్రమయనఁబడును. ఈభ్రమ యెట్లుఁ బోవు ననఁగా; బింబ ప్రతిబింబ దృష్టాంతమును స్వానుభవముగాఁ దెలిసికొనినయెడల పోవును. అది యెట్లనఁగా, అనేక చిల్లులుగల యొక పగిలిన పెద్ద యద్దమున కెదుట నొక మనుష్యుఁడు నిలిచినయెడల నతఁడొకఁడే యనేక బింబములుగాఁ దోచును. అటుల దోఁచిన నా బింబములు దనకన్న వేఱుకాదని యెఱుఁగును. వాఁడే పగలని యొక పద్దయద్దము నెదుట నిలుచునెడల నొకబింబము మాత్రము దోఁచును. అదియు దనకన్న వేఱుకాదని యెఱుఁగును. అటులనే, యవివేకమనెడు భూమియందుఁబడి, యనేక సంకల్ప వికల్పము లనెడు విరిగిన చిల్లులుగల యంతఃకరణమను నద్దముగలవానికిఁ బదార్థభేదములైన బింబము లనేకములుదోఁచును; అవివేక భూమియందుఁబడి బగులక, జ్ఞానమను స్వస్థితిలోనేయుండు సంకల్ప వికల్పములనెడు

చిల్లులులేని యద్దమగు నంతఃకరణముగలవానికిఁ బదార్థభేదము లేని యొకబింబమే తోఁచును. అదియు దనకన్న వేఱు కాదనియు, దోఁచు బింబము సత్యము కాదనియు, తానొకఁడే సత్యమనియు నిస్సందేహుఁడై యుండునట్లు, ఈ కనఁబడు నవన్నియు సంకల్ప వికల్పములగల యంతఃకరణమైన (అవివేకమను భూమిలోఁబడి చిల్లులై యుండు) యద్దముయొక్క ఆభాసము లేయని యెఱిఁగిన, సకలసందేహములను నివర్తింపఁదగిన సద్గురూపదేశముచే జీవేశ్వరులు వేఱనే భ్రమము నివారణమగును. గనుక, యిదియే యభేదస్థితినిఁ బొందుటకుపాయము.

౨. వాక్కునకు వాక్కుగనుండి మాటలాడుచున్నాను, నేత్రమునకు నేత్రముగ నుండి జూచుచున్నాను, అను నీ మొదలగు కర్తృత్వాదిగుణము లాత్మయందుఁ గనఁబడుటచే, బ్రహ్మము "నకర్తా, నభోక్తా" యని చెప్పుట యెట్లు? అను భ్రమ రెండవదియగును. ఇయ్యది స్ఫటికలోహిత దృష్టాంతస్వానుభవముచేఁ బోవును. ఎట్లనిన, ఒకస్ఫటిక శిలకుసమీపముగ నెఱ్ఱనివస్త్రమును గట్టిన నాస్ఫటిక శిల యెఱ్ఱనిరంగుగల దగును. అయినను నారంగు స్ఫటికశిలకు స్వాభావికము గాదు. నిజముగా నారంగు ఆ స్ఫటికశిలయందును లేదు; ఉన్నట్లాభాసముగమాత్రము దోఁచును. ఆరంగునుబోఁగొట్టఁ దలఁచి యాశిలను రెస్సఁగరాచి తోమినను ఆరంగుబోదు, లేక, సానఁబెట్టినను బోఁజాలదు, లేకసుత్తునియలు సేసినను బోనేరదు. ఆశిలకు సమీపమునందుండు రంగుబట్టను దొలఁగించిన, నాశిలయందుఁ దోఁచినరంగు దొలంగును. అట్లు దొలఁగించక పోయినను ఆరంగు ఆస్ఫటికశిలను నిజముగ బాధింపఁజాలదు. ఆభాసమాత్రముగ నుండును. అట్టి యాభాసమును తాత్కాలికమే యగును. ఆవిధంబుగను, స్వయముగా దహించు స్వభావములేని యినుము, నిప్పును సమీపించినఁ దదాకారమై యా యాకారగుణముచేఁ దన్ను సమీపించు పదార్థంబులనుగూడ దహించును. అయిననునా యాకారంబును గుణంబును యినుమునకు స్వాభావికంబు గాదు. ఇత్తెఱంగునను నిత్య శుద్ధ బుద్ధ సత్య పరిపూర్ణ స్వభావముగల బ్రహ్మముఅశుద్ధ పదార్థములయొక్క సామీప్యమువలనఁదత్తదాకారగుణాదులు గలదైనట్లు, తాత్కాలికముగ గనఁబడునేగాని యీకర్తృత్వ భోక్తృత్వాదులు బ్రహ్మమందు లేవు. సద్గురూపదేశంబువలన నాత్మ యగుబ్రహ్మమునందుఁ దోఁచు నీ కర్తృత్వాది భ్రమలు నివర్తించును.

3. స్థూల సూక్ష్మ కారణ శరీరములుగల యాత్మయగు జీవుఁడసంగుఁడు కాఁడు; సంగుఁడేయనునది మూఁడవ భ్రమయనఁ బడును. ఇట్టి భ్రమ ఘట మఠాకాశాది దృష్టాంత స్వానుభవంబువలన నివర్తించును. ఎట్లనిన:—

ఘటాకాశ మఠాకాశాది నామరూపములుగల యాకాశము సమస్తమును వ్యాపించి యంతటనిండి యుండినను దేనిచేతను బాధింపఁబడనట్లు, స్థూలసూక్ష్మ కారణ శరీరోపాధులచే నామరూపంబులఁ గలిగియుండు జీవుఁడను పేరుగలబ్రహ్మము, యెచ్చటను నిండియంతటను వ్యాపించి యుండుటచే సంగిగాఁదోఁచినను సంగుఁడని చెప్పఁగూడదు. ఆసంగ మీబ్రహ్మమును బాధింపఁజాలదు. గనుక బ్రహ్మమగు జీవుఁడు సంగికాఁడు; అసంగుఁడే. ఇట్లు గురూపదేశంబుచే నీభ్రమ నివర్తించును.

౪. ఈజగత్తుమొదలగునవి గలుఁగుటకు బ్రహ్మముదప్ప వేఱొకపదార్థమును గారణముగఁ జెప్పఁగూడమిచే బ్రహ్మమునందే జగద్వికారస్థితియున్న దనునది నాల్గవభ్రమయనఁ బడును. ఇయ్యది కనకరుచక (కనకరుక్) దృష్టాంతస్వానుభవముచే నివర్తించును. ఎట్లనిన:—

కనకము (బంగారు) అనేకనామరూపంబులు గలయాభరణములుగ నైనను కనకమునకు హానిలేదు. ఆభరణములగు పేళ్లను, రూపములును నశించినను కనకము మాత్రము నశింపదు. ఆవిధంబుగ బ్రహ్మమనేక నామరూపంబులఁ గలదియైనను అట్టి బ్రహ్మమునకు బాధకములేదు. ఈనామ రూపములు నశించినను బ్రహ్మము నశించదు. ఇట్లు గురూపదేశ స్వానుభవమువలన బ్రహ్మము జగద్వికారియను భ్రమ నివర్తించును.

౫. కారణమునకంటె భిన్నముగుజగత్తు సత్యమనునదియే, యైదవభ్రమ యనఁబడును. ఇది రజ్జుసర్పదృష్టాంత స్వానుభవముచే నివర్తించును. ఎట్లనిన:—

కారణమగు నొకతెల్లత్రాఁటిని మబ్బుమబ్బుగనుండు సాయంకాలమున వేర్వే ఱుదిక్కులనుండి దూరంబున నిలిచి చూచుచుండెడు ముగ్గురిమనుష్యులలో నొక్కఁడు త్రాఁటిని పాముగను, మఱియొక్కఁడు వెండిమొలత్రాడుగను, మూఁడవవాఁడుగఁ యారవు గొలుసుగను జూచిరి. ఈత్రాఁటిని వేర్వేఱుగజూచిన యీముప్పురున నాత్రాటి సమీపమునకుం బోవ వీరికింగల్గిన త్రివిధభ్రమ నశించెను. అనఁగా నాత్రివి ధంబులగు భ్రమములసత్యపదార్థ లయ్యెను. నిజమగు త్రాడొక్కటియే త్రికాలము యందుసత్యముగ నిలిచెను. అవ్విధంబున సాయంకాలమగు యీయవివేక దశల విచారణశూన్యంబగు దూరంబుననుండి చూచినప్పుడు కారణంబగు బ్రహ్మమునకు భిన్నంబుగఁదోఁచు నీజగంబుసత్యంబైనది వలెగనఁబడుచున్నది. గురువాక్య విచా

౦చేసమీపించి ప్రజ్ఞానమనుదీపమును చేతంబట్టి స్వానుభవమనెడు దృష్టిచేఁజూచున ప్పుడు భిన్నముగను, నానావిధముగను దోఁచినయీజగత్తు నశించి యసత్యమగును. బ్రహ్మ మొక్కటి యేసత్యముగనిలుచును. ఈవిధంబగు గురూపదేశస్వానుభవమువలన కారణముకంటె భిన్నమగు జగత్తుసత్యమను భ్రమ నివర్తించును.

స్థూల సూక్ష్మ కారణ శరీరత్రయంబులు నవిద్యచే గలిగిన వనుటకును, బ్రహ్మ మువీటికి విలక్షణమైన దనుటకుఁ బ్రమాణము.

శ్లో॥ అవిద్యకంశరీరాదిదృశ్యం బుద్బుదవత్ క్షరమ్।
ఏతద్విలక్షణంవిద్యాత్ అహంబ్రహ్మేతినిర్మలమ్॥

బ్రహ్మమునకు నింద్రియాదుల సంబంధములు మొదలగునవి లేవనుటకుఁబ్ర మాణము.

శ్లో॥ శబ్దాదివిషయైస్సంగో నిరింద్రియతయానచ॥

బ్రహ్మము మనఃప్రాణాదులయొక్క సంబంధరహితుఁడనుటకుఁ బ్రమాణము.

శ్లో॥ అమనస్త్వాన్న మేదుఃఖ రాగద్వేషభయాదయః॥
అప్రాణోహ్యమనాశ్శుద్ధ ఇత్యాదిశ్రుతిశాసనాత్॥

బ్రహ్మమాకాశమువలె నిస్సంగుఁడనుటకుఁ బ్రమాణము.

శ్లో॥ అహమాకాశవత్సర్వం బహిరన్తర్గతోఽచ్యుతః।
సదాసర్వసమశ్శుద్ధో నిస్సంగోనిర్మలోఽచలః॥

ఈ శ్లోకములకు అర్థము యీవ్యాఖ్యానకర్తచే రచియింపఁబడి యుండు "ఆత్మబోధతత్త్వార్థదీపిక" లోని ౩౦, ౩౧, ౩౨, ౩౪, వశ్లోకములను జూచునది

---

## ౨ - మంత్రము.

### అవతారిక.

ఓ శిష్యుఁడా! ఆ బ్రహ్మము స్వానుభవైకవేద్య మే యని యీ ఖండవ ప్రథమ మంత్రము తుదను నీవు సెప్పినమాటలు నాకు బోధపడలేదు. అవి లెస్సఁగ బ ధపడునట్లు నీ యనుభవమును నాకుఁ జెప్పు మని గురుఁ డడుగఁగా శిష్యుం డిట్లని

## 2.

శ్రు॥ నాహం మన్యే సువేదేతి నో న వేదేతి వేద చ।
యో న స్తద్వేద తద్వేద నో న వేదేతి వేదచ॥

| | |
|---|---|
| అహమ్ | నేను |
| (తత్) | ఆ బ్రహ్మవస్తువును |
| సు వేద, ఇతి | లెస్సఁగాఁ దెలిసికొనినా, నని |
| న, మన్యే | తలంచను. (అనఁగా బ్రహ్మమును దెలిసికొనుట మిక్కిలి కష్టసాధ్యము.) |
| న, వేద, ఇతి | తెలిసికొనలే దని యు |
| (నో, మన్యే) | తలంచను. |
| (కిం) చ | మఱి యే మనఁగా |
| వేద, (ఇతి, మన్యే) | (శాస్త్రి)ములవలనను, ముఖ్యముగ గురూపదేశము వలనను, చక్కఁగా విమర్శింపఁబడి సంశయవిపర్యయరహిత మైన సర్వభేదశూన్య సాక్షాత్కార దృఢనిశ్చయ స్వానుభవము వలనఁ దెలిసికొనినాను (అని తలంచుచున్నాను. |
| నో, న, వేద, ఇతి, వేద, చ | తెలిసికొన లే దనియు దలంచను. స్వానుభవము చేఁ దెలిసికొనినా నని తలఁచుచున్నాను (అని చెప్పిన) |
| తత్ | ఆ (నాయభిప్రాయమును) |
| నః | (బ్రహ్మవిచారశక్తిగల) మాలోపల. |
| యః | ఎవ్వఁడు |
| వేద | (పారమార్థికముగఁ) దెలిసికొనుచున్నాఁడో |
| (సః) | వాఁడు |
| తత్ | ఆబ్రహ్మవస్తువును |
| వేద | తెలిసికొనుచున్నాఁడు. |

## తాత్పర్యము.

ఓ మహా స్వామీ! తాము దలంచినప్రకారము నాకు స్వానుభవము లేకపోవుటవలనను, విమర్శ లేకపోవుటవలనను, సంశయవిపర్యయ జ్ఞానము విడిపోకుండుటవలనను, బ్రహ్మమును లెస్సఁగఁదెలిసి కొనినా నని వాఙ్మాత్రమున నేఁ జెప్పినది నిజమే. అయితే తాము సర్వజ్ఞులు గనుక నన్ను నే నే యేమార్చుకొనిన సంగతినిఁ దాము దెలిసికొని నన్నుఁ బ్రశ్న చేసి నాయొక్క సంశయవైపరీత్యములను దమయొక్క హస్తమస్తకసంయోగ మగు స్పర్శదీక్ష చేతను, కటాక్షవీక్షణమగు దృష్టిపాతము చేతను, మనస్సంయోగమగు మానసికదీక్ష చేతను నన్నుఁ గృతార్థుం జేసి, యేకాంతస్థలంబున నన్నుఁ గూర్చుండఁ బెట్టి చిత్తసమాధానముగలవానిఁగఁ జేసి తా ముపదేశించిన మార్గమును బ్రథమమున మననము నేసి తర్వాత నెడతెగక లక్ష్యమందు మనసును నిలుపుట యను నిదిధ్యాసచేయ నాజ్ఞాపించిన ప్రకారముగ ననుష్ఠించుటవలన నాకుఁ గలిగిన స్వానుభవసంగతిని జెప్పెదను. అందువలన నాయొక్క నిజస్థితిని దామే తెలిసికొన వచ్చును. అనినశిష్యుం డిట్లనియె

ఆబ్రహ్మము స్వానుభవముచేఁ బొందఁదగినది గనుకను, జ్ఞాతృ జ్ఞాన జ్ఞేయ భేదరహితము గనుకను, "నేను బాగుగఁ దెలిసికొనినాను" అని యిప్పుడు చెప్పఁజాలను. ఆ బ్రహ్మము సర్వపరిపూర్ణముగ లోను, వెలుపలను, పైనను, క్రిందను, యెచ్చటను నిండి సమస్తములోను నంతర్యామిగనుండుటవలనను, జ్ఞానులు స్వానుభవముచే ననుభవించుటవలనను, నేను దెలిసికొనలే దనియుఁ జెప్పఁ జాలను.

మఱి యే మనిన శ్రుతులచేతను, ముఖ్యముగ గురూపదేశముచేతను లెస్సఁగా విచారణ చేసి గురుకులవాసమువలన సకలసందేహ విపర్యములఁ బోగొట్టుకొనిన పిమ్మటగలుగు సర్వభేదశూన్య సాక్షాత్కార దృఢనిశ్చయ స్వానుభవముచేఁ దెలిసికొనినాననియుఁ దలంచుచున్నాను.

నేను తెలిసికొనలే దని చెప్పఁజాలనివాఁడనుగ నున్నా నని మాలో నెవ్వఁడు దెలిసికొనుచున్నాఁడో, వాఁడే బ్రహ్మమును నిజముగాఁ దెలిసికొనినవాఁ డగును.

"నాహం మన్యే సువేద" నేను బ్రహ్మమును జక్కఁగాఁ దెలిసికొనినా నని తలంచ నని చెప్పుటచేత నాబ్రహ్మమును దెలిసికొనుట మిక్కిలికష్ట మనునది తెలియుచున్నది.

“ నో న వేద” నేను దెలిసికొనలేదు అని తలంచను అనుటవలన శాస్త్రములయందు నమ్మకమును గురువాక్యములయందు విశ్వాసమునుంచుటచే ఆ బ్రహ్మమును బొందుటసులభ మని తెలియుచున్నది.

“ వేదచ” నేను తెలిసికొన్నాను అని తలంచుచున్నా ననుటవలన నాబ్రహ్మము సకలభేదశూన్య సాక్షాత్కారవస్తు వని దెలియుచున్నది.

---

## 3 - మంత్రము.

### అవతారిక.

“ కేనేషితమ్” “ ఎవనిచేఁ బ్రేరణచేయఁబడి” అని శిష్యుఁడు గురువును బ్రశ్న చేసిన ప్రథమఖండము ప్రథమమంత్రము మొదలుకొని యిదివరకు జరిగినప్రశ్నోత్తర రూపములగు గురుశిష్యుల సంవాదములచే నిర్ణయింపఁబడిన సిద్ధాంత తాత్పర్యమును యీశ్రుతి స్థిరపరుచుచున్నది. ఎట్లనిన:—

### 3.

**శ్రు॥ యస్యామతం తస్య మతం మతం యస్య న వేద సః।**
**అవిజ్ఞాతం విజానతాం విజ్ఞాత మవిజానతామ్॥**

| | |
|---|---|
| యస్య | (ఇంద్రియ మనోనిగ్రహములఁ జెంది బ్రహ్మానుభవమును బొందుట కత్యాసక్తుఁడై యుండు) ఏ సాధకునకు. |
| (బ్రహ్మ) | బ్రహ్మము |
| అమతమ్ | (ఆత్మ తత్త్వ నిశ్చయ ఫలావసానావబోధముతోఁ గూడిన మనోనివృత్తి లేని) సామాన్యమనోనివృత్తి మాత్రముచే గోచరము గాదు. (అని తెలిసికొనిన) |
| తస్య | ఆ పురుషునకు |
| (ఆత్మత్వేన) | విషయ ప్రవృత్తి లేని స్వస్వరూపానుభవముచే |
| మతమ్ | తెలిసికొనఁబడును |

| | |
|---|---|
| యస్య | ఇంద్రియ మనో నిగ్రహసాధన రహితునికి |
| (తత్) | ఆ బ్రహ్మము |
| మతమ్ | నా మనంబునకు గోచరమైన దని యభిప్రాయము గలిగి యున్నాఁడో |
| సః | వాఁడు (అట్టి వివేక శూన్యుఁడు) |
| న, వేద | బ్రహ్మము నెఱుంగఁడు |
| విజానతామ్ | (బ్రహ్మమును బుద్ధికి విషయమయినదిగా) నెఱుంగువారికి |
| అవిజ్ఞాతమ్ | తెలియఁ జాలదు. |
| అవిజానతామ్ | (బ్రహ్మము దెలియఁబడిన దానికిని, దెలియఁబడని దానికిని వేఱైనదిగను, బుద్ధి మొదలగు వానికి విషయముగానిదిగను దలంచి యుండు) తెలిసికొనని వానికి |
| విజ్ఞాతమ్. | (స్వస్వరూపానుభవముచే) తెలియఁ బడుచున్నది. |

---

తాత్పర్యము.

ఏదైన నొక్క సంగతి సిద్ధాంతము గావలసియున్నప్పు డయ్యది శ్రుతియుక్త్యనుభవములతోఁ గూడియుండినఁగాని సిద్ధాంత మనఁబడదు. ఈ యుపనిషత్తు ప్రథమశ్రుతి మొదలుకొని యీశ్రుతివఱకును బ్రహ్మమునుగురించి జరిగినగురుశిష్య సంవాదముచే యుక్త్యనుభవప్రకారంబుగ బ్రహ్మవస్తువు యొక్క సిద్ధాంతమును గురుఁడుశిష్యుని కుపదేశించెను. అట్టి యుపదేశముచే శిష్యునికి యుక్తిచేతను, అనుభవముచేతను నుపదేశించిన సిద్ధాంతము స్వానుభవంబైనను అది స్థిరపడుటకై యాధార (Anthority) రూప మగు శ్రుతి సిద్ధాంతము శిష్యుని కుపదేశింపఁ బడుచున్నది. ఎట్లనినః—

ఏది జ్ఞానకర్మేంద్రియములకును, అంతఃకరణమునకు ను నగోచర మైనవస్తువు గనున్నదో. దానిని సద్గురువును జేరి శ్రుతియుక్త్యనుభవములతోఁ జేరిన శ్రవణముచేఁ దెలిసికొన వలసినది.

గనుక నెవ్వఁడు పైఁజెప్పినప్రకారముగ సద్గురువును జెంది వారివద్ద చక్కఁగ శ్రవణముం జేసి సకలసందేహ విపర్యయముల నివర్తించుకొని గుర్వాజ్ఞాప్రకారమనుష్ఠించి, ఆత్మతత్త్వనిశ్చయ ఫలావసానావబోధముతోఁ గూడినమనోవృత్తిం బొందక సామాన్య మనోనివృత్తిచే గోచరముగా దని తెలిసికొనిన యింద్రియమనోనిగ్రహముగల సాధకునికి బ్రహ్మస్వరూపము స్వానుభవసిద్ధముగ నున్నది.

బ్రహ్మస్వరూపమును నేను దేజోమయస్వరూపునిగాను, కోటిసూర్యప్రకాశునిఁగాను, బట్టబయలుగను నిట్టియనేకవిధంబులుగఁ దలంచుచుండు, లేక, పలుకుచుండు యింద్రియమనోనిగ్రహములేని యవివేకులు యిట్టి తేజోమయములుగను గనఁబడు సమస్తమును మనోవికారములే యనియు, మనస్సుచేఁ దెలియనవియన్నియు యనిత్యములే యనియు, గనుక నే మనస్సుచేఁ దెలిసికొనఁబడుసమస్తమునకు వేఱైనదనియు, సద్గురువును జెంది తత్త్వములఁ దెలిసికొనకయుండున వివేకులకు బ్రహ్మము దెలిసికొనఁబడఁ దగనిదిగా నున్నది.

శ్లో॥ యా వేదబాహ్యాః స్మృతయః యాశ్చ కాశ్చ కుదృష్టయః
సర్వా స్తా విష్ఫలాః ప్రోక్తాః తమోనిష్ఠా హి తాః స్మృతాః॥

తా॥ వేదశాస్త్రములయందు విశ్వసింపనివారును, వేదములలోనికొంతభాగము మాత్రము నమ్మువారును, తానుగాఁ గాని, గురుముఖముగాఁ గాని తెలిసికొనక వేదశాస్త్రబాహ్యు లచ్చటచ్చట నుపన్యసించు కొన్నిమాటలను విని, నమ్మి, వాని నే యాధారముగఁ జేసికొని; కుతర్క, జల్ప, వితండావాదములను జేయువారును, యిట్టియనుష్ఠానము గలవారందఱు నపమార్గప్రవర్తకులే యనియు, నిష్ఫలసిద్ధాంతముగలవా రనియు, శ్రుతి స్మృతులు సాక్ష్యమిచ్చుటచే "నేను నా యిష్టానుసారముగ బ్రహ్మమును దెలిసికొన్నాను" అనువారలకుఁ దెలియఁబడదు. ఆబ్రహ్మము దెలియఁబడినదానికినిఁ దెలియఁబడనిదానికి వేఱైనదిగను, బుద్ధ్యాదులకు విషయము గానిదిగను నెవ్వరు దెలిసికొనుచున్నారో, వారు గురూపదేశానుష్ఠాన స్వానుభవమువలన నా బ్రహ్మమును దెలిసికొనుచున్నారు. అని యీమంత్ర ముపదేశించుచున్నయది.

---

## అవతారిక.

"అవిజ్ఞాతం విజానతామ్" "బ్రహ్మము దెలిసికొన లేదనువారలకుఁ దెలియఁ బడును" అనియు "విజ్ఞాత మవిజానతామ్" బ్రహ్మమును దెలిసికొంటిని అను వారలకుఁ దెలియఁబడదనియు పై శ్రుతియందుఁ జెప్పఁబడియున్నది. తెలిసికొంటిని అను వానికిఁ దెలియకపోవుటయు, తెలియలేదు అను వానికిఁ దెలియుటయు మిక్కిలి విరుద్ధముగదా? ఇంతియగాక, సుషుప్తి, మూర్ఛ మొదలగు నవస్థలయందును సారాయి, కల్లు, గంజాయి, అభిని, మదత్తు, పూర్ణాదిలేహ్యము, మొదలగు మత్తుపదార్థములను భుజించి, సంపూర్ణముగ మత్తెక్కియుండునప్పుడు అట్టి యవస్థగలవారలను కృతకృత్యులనియు, ధన్యులనియు, బ్రహ్మజ్ఞానులనియు, చెప్పవలసివచ్చును. ఏల ననిన, వారలందఱును మత్తుచే నొక్కటిని దెలియని యవస్థగలవారలు గనుక బ్రహ్మమును దెలిసికొనినవారలనియే చెప్పవలసి వచ్చును. అను నీ మొదలగు సందేహములు నివర్తించుటకొఱ కీ మంత్రము ప్రారంభింపఁబడుచున్నది:—

## 4.

శ్రు॥ ప్రతిబోధవిదితం మతం అమృతత్వం హి విన్దతే।
ఆత్మనా విన్దతే వీర్యం విద్యయా విన్దతేఽమృతమ్॥ ౪॥

(యదా) ఎప్పుడు

హి ఏ కారణమువలన

ప్రతిబోధవిదితమ్ (పైఁ జెప్పఁబడిన మత్తుపదార్థముల భుజించి బుద్ధి జదికిలఁబడియుండు నవస్థను, విషయాసక్తిగల యవివేకులు బోధము అని చెప్పుదురు. అట్టి బుద్ధిని జెడుపు బోధమును నిజమగు బోధముగఁ దలఁచి మోసపోవక) ఎది తనలో "నేను" అని వ్యవహరించుకొనుచున్నదో, అదియే సమస్తములోను "నేను" అని వ్యవహరించుకొనియున్నది. గనుక "నేను" అని దన్నుఁ దప్ప రెండవపదార్థము లేనే లేదని సర్వసమత్వబుద్ధిచే స్వానుభవానంద నిజబోధ మెప్పుడు గలుగునో,

| | |
|---|---|
| (తదా) | అప్పుడు |
| (బ్రహ్మ) | బ్రహ్మము |
| మతమ్ | స్వానుభవముచేఁ దెలియఁబడును. |
| (తస్మాత్) | ఆ కారణమువలన |
| అమృతత్వమ్ | (అవిద్యను, దత్కార్యములగు జననమరణాదులును లేని స్వయంప్రకాశానందస్వరూపమగు, తాను దానుగ నుండుటయను) మోక్షమును |
| విన్దతే | పొందుచున్నాఁడు; |
| (ఆత్మవిత్) | (పైనఁ జెప్పఁబడినవిధముగా స్వాత్మానంద మగు స్వానుభవమునుబొందియుండు) జీవన్ముక్తుఁడు |
| ఆత్మనా | స్వస్వరూపానుసంధానముచే |
| వీర్యం | అణిమాది సకలసామర్థ్యమును |
| విన్దతే | పొందుచున్నాఁడు; |
| విద్యయా | ఇట్టిబ్రహ్మవిద్యచే |
| అమృతమ్ | మోక్షమును |
| విన్దతే | పొందుచున్నాఁడు (అనునది) |
| (హి) | ప్రసిద్ధము. |

---

తాత్పర్యము.

ఆకాశ మెట్లు ఘట మఠ కుడ్యములు మొదలగు సమస్తములందును దాను గానే యున్నదో, అట్లు

శ్రు॥ దృష్టే ర్ద్రష్టా శ్రుతే శ్రోతా
మతే ర్మన్తా విజ్ఞాతే ర్విజ్ఞాతా॥

తా॥ చూచువారలకుఁ జూచువాఁడుగను, వినువారలకు వినువాఁడుగను, తలంచు వారలకుఁ దలంచువాఁడుగను, తెలిసికొనువారలకుఁ దెలిసికొనువాఁడుగ నున్నాఁడు; అనియు, సమస్తమునకు సమస్తము దానే యనియు, తన్నుఁ దప్ప మఱియొక్కటిని దెలియని బోధస్వరూపమాత్రముగ నిలుచు స్వస్వరూపానుభవా

నందస్థితి యెప్పు డొక్కనికిఁగలుగునో, అప్పుడు నిజ ముగు బ్రహ్మమును (ఆత్మను= భగవంతుని) వెలిసికొనుచున్నాఁడు. ఇట్టి బ్రహ్మానుభవము గలవాఁడు మోక్షమును బొందును. అట్టి బ్రహ్మవేత్త సకల సర్వజ్ఞత్వాది సామర్థ్యములఁ గలిగి యుండును. అట్టి బ్రహ్మవిద్యచే మోక్షము సిద్ధించు ననుటలోఁ గొంచమైన సందియము లే దని యీ మంత్ర ముపదేశించుచున్నది.

ఇందుకుఁ బూర్వపక్షి ప్రశ్న చేయుచున్నాఁడు.

ఏది వృక్షములను, జెట్లను, చలింపఁజేయుచున్నదో, అదియే గాలియైనట్లు వాక్కు, నేత్రము, ఘ్రాణము, శ్రోత్రము, మనస్సు మొదలగువానిని బ్రవర్తింపఁజేయు నది బ్రహ్మమని చెప్పునెడల మొదటిఖణ్డము రెండవమంత్రము మొదలుకొని యిదివఱ కును జెప్పఁబడుచున్న యీ బ్రహ్మము ద్రవ్యపదార్థమని చెప్పవలసివచ్చును. ఎప్పుడు బ్రహ్మము ద్రవ్యపదార్థమాయెనో, అప్పుడు బోధ క్రియాశక్తిగలదిగఁ జెప్పవలసిన దే కాని బోధస్వరూపము బ్రహ్మమని చెప్పఁగూడదుగదా? ఇంతియగాక, బోధము గలు గుచు నశించుచుండు స్వభావముగలదియగును. ఎప్పుడు బోధము కలుగునో, అప్పుడు బ్రహ్మమునకు బోధ క్రియగలుగును. ఎప్పుడు బోధము నశించునో, అప్పుడు బ్రహ్మము నశించును. ఇట్లైనచో బ్రహ్మము గలిగి నశించునదనియు, సావయవస్వరూపమనియు, అనిత్యవస్తువనియు, అశుద్ధవస్తువనియు, చెప్పవలసివచ్చును. అనిన,

సిద్ధాంతి సమాధానము చెప్పుచున్నాఁడు.

నీ వింతకుమునుపు చెప్పినదంతయు జీవాత్మ వేఱుగను బరమాత్మ వేఱుగఁ జెప్పు తార్కికమత సిద్ధాంతమనియు వేదాంత సిద్ధాంత మిది కా దనియు నెఱుంగుము.

వేదాంత సిద్ధాంతము.

శ్రు॥ 'విజ్ఞాన మానన్దం బ్రహ్మ'. 'ప్రజ్ఞానం బ్రహ్మ'.
'అసఁగో నహిసజ్జతే'.

తా॥ జ్ఞానస్వరూపముగను, ఆనందస్వరూపముగను నుండునదియే బ్రహ్మ మనియు, ప్రజ్ఞానమే బ్రహ్మమనియు, బ్రహ్మము సంగరహితమైనది గనుక సంగముచే బాధింపఁ బడని దనియు,

శ్లో॥ అసక్తం సర్వభృచ్చైవ । నిర్గుణం గుణభోక్తృ చ॥
(భగవద్గీతా-అ, 13. శ్లో, 15.)

తా॥ ఈ బ్రహ్మము దేనిని నంటనిదియు, సమస్తజగద్భ్రమకు నధిష్ఠానమై నదియు, సత్త్వ రజ స్తమో గుణరహితమైనదియు గుణముల ననుభవించునది వలెఁ దోఁచునదిగ నున్నదనియు.

శ్రుతిస్మృతులు ఘోషించుటవలన నీ బ్రహ్మమున కుపమానముగాఁ మఱియొక వస్తువుఁ జెప్ప నలవి కాదు. ఇదియొక్కటియే బోధస్వరూపముగ నుండునది యని యెఱుఁగుము.

మఱలఁ బూర్వపక్షి ప్రశ్న చేయుచున్నాఁడు. అట్లైనచో బ్రహ్మము బుద్ధిని, ఇంద్రియము మొదలగువానిని గల్పించుకొని దన్నుఁ దెలిసికొనుచున్న దను వ్యవహార ముండుటచే బ్రహ్మమును నిరుపాధికవస్తువని చెప్పఁగూడదు. అనిన,

సిద్ధాంతి సమాధానము చెప్పుచున్నాఁడు. అట్లుగాదు. ఏల ననిన,

శ్రు॥ ఆత్మ నైవాత్మా నంపశ్యతి,

తా॥ శుద్ధాంతః కరణ స్వరూపమగు దనచేత నే బ్రహ్మమును స్వానుభవ ముచేఁ బొందవచ్చును. అనియు,

శ్లో॥ స్వయ మే వాత్మ నాత్మానం । వేత్థ త్వం పురుషోత్తమ!॥

(భ-అ, 10. శ్లో, 15.)

శ్లో॥ ఆత్మ న్యే వాత్మనా తుష్టః॥ ... ... ... (భ-అ, 2. శ్లో, 55.)

శ్లో॥ ఆత్మ న్యేవ చ సన్తుష్టః॥ ... ... ... (భ-అ, 3. శ్లో, 17.)

శ్లో॥ ఆత్మైవ హ్యాత్మనో బంధుః॥ ... ... ... (భ-అ, 6. శ్లో, 5.)

శ్లో॥ ఆత్మా పశ్యేన సర్వత్ర॥ ... ... ... (భ-అ, 6. శ్లో, 32.)

* దీనివివరములు యీ వ్యాఖ్యానకర్తచే రచియింపఁబడియుండు 'భగవద్గీతా గూడార్థదీపిక' నుచూచునది:

అనియు, శ్రుతిస్మృతులు చెప్పుటవలన ఇందుఁ జెప్పఁబడు బ్రహ్మము సోపాధికముగాదు, నిరుపాధిక మనియే యెఱుంగునది.

పూర్వపక్షి మఱలఁ బ్రశ్న చేయుచున్నాఁడు. ఏమియు దెలియక తానుగ నుండుటయే బోధమైనయడల సుషుప్తి మూర్ఛావస్థలయందును, కల్లు, సారాయి, మొదలగు మత్తుపదార్థముల భుజించినప్పుడును నేమియు తెలియని యవస్థ సంభ వించుచున్నది. అది యే బ్రహ్మానుభవముగాఁబోలు? అందుచేతనే బైరాగులను జారు

లను, చోరులను, సోమారులను, జ్ఞానులని చెప్పవలసివచ్చెను. అట్లైనచో శాస్త్రము, గురువు మొదలగువారిచేఁ బ్రయోజన మేమి? అనిన,

సిద్ధాంతి సమాధానము చెప్పుచున్నాఁడు. నీవు చెప్పునట్లేమియు దెలియని సుషుప్తి మూర్ఛావస్థలను, మత్తుపదార్థముల భుజించి మతిచెడి యుండు నవస్థను బోధస్థితియని చెప్పఁగూడదు. ఏలననిన :—

సమాధి, నిష్ఠ, ధ్యానము, స్వానుభవము, ఐక్యము అని చెప్పఁ బడుబోధస్థితిలో స్వానుభవరూప మగు స్వప్రకాశస్థితి యుండును. అందుచేత నే ఆస్థితిలో స్వానుభవము దప్ప మఱి యొక్కటియు దెలియదు. నీవు చెప్పుబోధస్థితిలో బుద్ధి చెడి యేమియు దెలియక గాఢాంధకార మగు నవివేకములో మునిఁగి తన్నుఁ దాను దెలియకయుండు నవస్థ యే గదా? నేను చెప్పు నిష్ఠలో నట్లు గాదు.

ఈనిష్ఠలోసమస్తము దానై యుండుటవలనఁ దన్నుఁ దప్ప మఱియొక్కటియు నుండదు; గనుక దన్నుఁ దప్ప నేమియు దెలియ దని చెప్పఁ బడినదే కాని నీవుచెప్పినట్లు గాదని యెఱుంగుము.

---

## ౫ - మంత్రము.

### అవతారిక.

నాలుగవ మంత్రమందుఁ జెప్పఁబడిన "ప్రతిబోధ విదితమ్" సమస్తమును దానుగాఁ జూచెడి సర్వసమత్వబుద్ధి యగు బోధమును బొందినం గాని మోక్షము గలుగదు. అని చెప్పిన, అట్టి బోధమును బొందుట మిక్కిలి కష్టసాధ్య మయ్యె గావున నది నాకు నక్కర లేదు. మోక్షప్రాప్తివిషయ మో పిమ్మట చూచుకొన వచ్చును. ఇప్పుడు నా కంత యవసరము లేదు. ఇప్పుడు నేనుండుస్థితి యంతకష్టముగను దోఁచలేదు. మోక్షము లేనియెడల నా కంతనష్టమును లేదు. కావలయు ననిన మోక్షవిషయమును గురించి కాలాంతరమున నాలోచింప వచ్చును. అని తలంచెద వేమో, వినుము; ఇట్టి దురాలోచన యగు నజ్ఞానముచే మిక్కిలి కష్టమైన దేవ మనుష్య తిర్యగాది జన్మములును, ఆజన్మములవలన కామ క్రోధాది సంసార దుఃఖములును, వ్యాధి, పీడ మొదలగు ననుభవింప నశక్యము లగుదుఃఖములను సంభవించును. ఇంతియగాక నీ వీశరీరముయొక్క నిజస్థితిని దెలిసికొనిన యెడల

నిట్లుచెప్పవు; ఈశరీరమో అరువుదెచ్చికొనిన పదార్థము. ఇందుకు దృష్టాంతమును వినుము. ఒక మనుజుని హస్తములోనున్న యీ నీశావాస్యోపనిష ద్వ్యాఖ్యాన పుస్తకమును మఱి యొక్కఁడుచూచి, యీ పుస్తకము నాకు రెండురోజుల కరువుగ నిమ్మని యడిగి తీసికొనెను. ఇట్లు తెచ్చుకొనినవాఁ డా పుస్తకమునందు నాలుగుపజ్తులను జూచినపిమ్మట, ఆహా! ఈపుస్తకము చదువుటకు మిక్కిలి రమణీయముగ నున్నది. ఇట్టిపుస్తకమునకు నన్యాయముగాఁ గాగితపు అట్టవేసినా రేమి, అని తలఁచి ఆకాగితపు అట్టను విడఁదీసి యా పుస్తకమునకుఁ బట్టుతోఁ జేయఁ బడిన యట్టను వేయించెను. ఆ పట్టుబైండు చేయఁబడిన పుస్తకమును జూచి తనలోఁ దాను చెప్పుకొనున దేమి యనిన; అన్నిగ్రంథములలోనుత్తమమైనది యుపనిషత్తు. అట్టి యుపనిషత్తు గలిగి యుండు పుస్తకమునకు శ్రేష్ఠ మగు నట్టయే యుండవలయును. అనిదిగ్గున లేఁచి యొక వేయిరూపాయిలు గల సంచిని చేతఁ బుచ్చుకొని, కంసాలి యింటికిఁ బోయి, వానితోడిట్లనియె. ఓ కంసలీ! ఇదిగో! చూడుము; మిక్కిలి శ్రేష్ఠతమ మగు నుపనిష త్పుస్తకము. ఇందున కొక్కబంగారపు అట్టవేయవలయును. ఆ యట్టలోఁ బచ్చ, వైడూర్యము మొదలగు విలువ గల రత్నములు చెక్కి యుండవలయును. అని చెప్పి యతనిచేతిలో వేయిరూపాయల నిచ్చి, పనియారంభింపఁ జేసెను. ఈతీరున నాఱేఁడుదినంబులు గడంచెను. ఇట్లుండఁగా నరు విచ్చిన వాఁడు 'తనపొత్తముం గొనినవాఁ డేమయ్యె? ఆతండు రెండుదినంబులలోఁ దెచ్చి యిచ్చెద ననెను గదా? ఇంకనురాఁడయ్యెను,' అని వానిని వెదుకసాగెను. ఎచ్చటెచ్చటనో వెదకియు వానిం జూడఁ జాలక, కట్టకడ నాకంసలి గృహంబున బొడఁ గనెను. అప్పుడు విచారింపఁగా నా పొత్తమునకు నింతవిలువగల యలంకారము జేసియుండుటం దెలిసికొని, ఓహో! ఇదెక్కడివింత, అరువుదెచ్చుకొనినవస్తు వెచ్చట, ఈ యలంకారమెచ్చట, ఇదంతయుఁజూడ మొదటికి మోసము వచ్చినట్టు కనపడుచున్నయది. అని చెప్పుచు ఆ పుస్తకాధికారి తా నగుటం జేసి, యాయరువుదెచ్చుకొన్నవానిచేతిలో నున్నయరకొఱగానుండు తన పుస్తకము నూడఁ దీసికొని తిరిగిచూడక వెళ్లిపోయెను.

అప్పుడు దనకుఁ గలిగిన ద్రవ్యనష్టమును, తాను జేసినతప్పును గూర్చి చక్కఁగా విమర్శించిన యా యెరవలి దెచ్చుకొన్నవాఁ డిట్లనియె. 'తాను యెరవలి

దెచ్చిన పుస్తకము యొక్క నిజస్థితిని మరచుటయే మొదటితప్పిదము; దానినెందుకు గాఁదెచ్చెనో, అదియు మరచుట రెండవదప్పితము; ఇట్టిమరుపులచేఁ బుస్తకమును దనదే యని తలఁచి దానికి ననేకవిధము లైన విలువగల యలంకారములఁ జేయించుటయను గొప్పతప్పితము మూఁడవది.

ఇవ్విధంబు లైన తప్పిదములచేఁ బుస్తకంబునంగల గూఢార్థంబులం దెలిసికొనక పోవుట మొదటినష్టము; అట్టి పుస్తకమునకై వ్యయముఁజేసిన ద్రవ్యనష్టము రెండవది; ఇఁకమీఁద మఱల సొంతగాని నడిగినం దన్ను విశ్వసించి యెరవలి యివ్వకుండుట మూఁడవనష్టము.

ఈ విధంబుగా సద్గతిఁజెందుటకు ముఖ్యసాధనమైయుండు జ్ఞానముగల యీ మానుషశరీరమును అరువుగాఁదెచ్చుకొనియుండు మనము, ఈ దేహము అరువని దెలిసికొనక పోవుటయే మొదటితప్పితము, ఎందునకై యీశరీర మెరవలిగాఁదెచ్చుకొంటిమో యనునది మరచుట రెండవతప్పితము. ఇట్టి విస్మృతులచే నీ దేహమును స్వకీయము గాఁదలంచి, ఈ దేహాలంకార భోగములకొఱకై పుత్త్ర మిత్ర కళత్ర ధన కనక వస్తువాహన సౌధ హర్మ్యోద్యాన ప్రమదావనాంతఃపురాదుల విషయ మై యమితమైనధనవ్రయము చేసియు, చేసికొనుచు నుండుట యే మూఁడవతప్పితము.

ఇటువంటి తప్పితములచే నరువుగాఁ దెచ్చిన యీశరీరంబున నుండు మోక్ష సాధకము లగు తత్త్వములను దెలిసికొనకపోవుటయే మొదటినష్టము. "పరోపకారార్థమిదంశరీరమ్" "మోక్షసాధనముకైనది యీశరీరము" అనునది మఱచి, యీ శరీరము దనదిగాఁ దలఁచి యెరవలి యనుదానిని మఱచి, యీ శరీరము నందలి యలంకారముల కొఱకు, మఱియు ననేకములగు నిహలోక సుఖములకొఱకు ద్రవ్యమును విచ్చలవిడిగా వ్రయముచేయుచుండఁగా నెరవలి యిచ్చినవాఁడు వచ్చి యరు వగు నీ శరీరమును గొంపోయినఁ గలుగు ద్రవ్యనష్టము రెండవది. మఱల నా యరు విచ్చినవాని నడుగుద మనిన నా యరు విచ్చువాఁడొక్కతూరి మోస పోయి యుండుటవలన వానినుండి మోక్షసాధన మగు జ్ఞానముగల యీ మనుష్య జన్మము మఱల నొందకయుండుట యే మూఁడవగొప్పనష్టము. ఎట్లు మానుషశరీరము సద్గతి నొంద ముఖ్యసాధన మనిన, దేవాదిశరీరములు తాముచేసిన పుణ్యకర్మ ఫలముల ననుభవింపఁ బుట్టినవి. అవి,

"శ్రు॥ క్షీణే పుణ్యే మర్త్యలోకం విశన్తి"

పుణ్యానుభవము ముగిసినతోడనే మనుష్యలోకమును బ్రవేశించును, అను శ్రుతిప్రకారము మనుష్యజన్మము నే చెందును. అట్లుగాక పాపకర్మము లధికము లయ్యె నేని, తిర్యగాది జన్మములఁ జెంది, పాపఫలముల ననుభవించిన పిమ్మట, మఱల మనుష్యజన్మము నొందవలయును; గనుక దేవాదిజన్మస్థితిలోను, తిర్యగాది జన్మస్థితిలోను, సద్గతిఁ జెందుటకు నవకాశము లేదు. ఈ మనుష్యజన్మమున నొక్క దానివలన నే సద్గతిఁ జెందవలయు ననునది సిద్ధము.

కాఁబట్టి యీ మనుష్యజన్మమునందే మోక్షమునకుఁ బ్రయత్నము చేయ వలసిన దావశ్యకమను నంశమును, అట్టి ప్రయత్నములు చేయమిచేఁ గలుగు పైఁ జెప్పఁబడిన గొప్పనష్టములు గలుగు నంశమును దెలియఁ జేయుటకై యీమంత్రము ప్రవర్తించుచున్నది. ఎట్లనిన :—

## 5.

శ్రు॥ ఇహ చే దవేదీ దథ సత్య మస్తి ।
న చే ది హావేదీ న్మహతీ వినష్టిః ।
భూతేషు భూతేషు విచిన్త్య ధీరాః ।
ప్రే త్యాస్మా ల్లోకా దమృతా భవన్తి॥ ౫॥

| | |
|---|---|
| సత్యమ్ | (ఈ మనుష్య జన్మమందు) నాశము లేనిదియు, సత్స్వరూపము గలదియు, నిజమైనదియునగు |
| అస్తి, (ఇతి) | కలదని [(ఒకవస్తువు) |
| (ఆత్మానమ్) | బ్రహ్మమును |
| ఇహ | ఈ మనుష్యజన్మమందు ఈశరీరముతో నున్నప్పుడు |
| అవేదీత్, చేత్ | తెలిసికొనవలసిన విధముగాఁ దెలిసికొనిన యడల, |
| అథ | అప్పుడు |
| (సత్యమ్, విద్యతే) | సద్గతి గలదు. |
| ఇహ | తాను జీవించి యున్నప్పుడు |
| (ఆత్మానమ్) | బ్రహ్మమును. |
| న, అవేదీత్, చేత్ | తెలిసికొనని యడల, |

| | |
|---|---|
| మహతీ | గొప్ప (పరిమాణము లేని) |
| వినష్టిః | (ఎడతెగక తిర్యగ్జన్మపరంపరలోఁ బుట్టుచు, చచ్చుచునుండు నీ సంసారముచేఁ గలుగు ననేక విధ దుఃఖముల ననుభవింప వలసిన దుర్గతి యగు) విశేషనష్టము |
| (భవతి) | సంభవించుచున్నది. |
| తస్మాత్ | ఆ కారణమువలన (పైఁ జెప్పఁబడిన విధముగ గుణదోషములను సద్గురు ముఖముగఁ దెలిసికొని యనుష్ఠించు ధీరులు) |
| భూతేషు, భూతేషు | చరాచర స్వరూపముగనుండు ప్రతి భూతములోను |
| విచిన్త్య | (రెండవది లేక తానుగానే యుండు బ్రహ్మమును శ్రవణ మనన నిదిధ్యాసాదులచేఁ బొందఁబడిన స్వానుభవమువలనఁ) దెలిసికొని, |
| అస్మాత్, లోకాత్ | (అహంకార, మమకారములచే భూయిష్ఠ మైనదియు, అవిద్యాస్వరూప మైనదియు నగు) ఈ లోకమునుండి (ఈ జన్మమునుండి) |
| ప్రేత్య | విరమించి, (అనఁగా ఘటాకాశ జలాకాశములు మహాకాశ మైనట్లు) |
| అమృతాః | (సకలము తానుగను, తానే సకలముగనుండు నద్వితీయస్థితి యగు) మరణము లేని మోక్షము గల |
| భవన్తి | అగుచున్నారు. [వారుగా |

## తాత్పర్యము.

దేవజన్మము జన్మాంతర పుణ్యవిశేషముచేఁ గలుగును. ఆలోకమ్మునఁ బుణ్యానుభవ సుఖమే హెచ్చుగ నుండును. సుఖ మధికముగా నుండు నప్పుడు దైవచింతనగాని, ధ్యానము గాని గలుగ దనునది యనుభవసిద్ధము

గదా? ఇంతియుకాక, పుణ్యానుభవము ముగిసినతోడనే మనుష్యలోకమును ప్రవేశించవలసిన దను శ్రుతిప్రకారము మఱల మనుష్యజన్మము నొందవలసియే వచ్చును. ఎప్పుడు జన్మము గలదో; అప్పుడు మరణము నిశ్చయము గనుక పుట్టుచు, చచ్చుచు నుండవలసియే వచ్చును.

అట్లుగాక, తిర్యగాదిజన్మము లతిపాపకృత్యములచేఁ గలుగును. ఆజన్మములో సద్గతినిఁ జెందుటకుఁ దగినజ్ఞానము లేదు. ఎట్లు అధికదుఃఖసమయములో (అనఁగా గొప్పగాయము దగిలి రక్తప్రవాహ మై యుండుసమయమందు) బుద్ధి భ్రమను జెంది, మూర్ఛను జెంది, తెలివి లేక యుండునో, అట్లు తిర్య గాదిజన్మస్థితిలోను సద్గతినిఁ జెంద దగినజ్ఞాన ముండదు. గనుక మనుష్యజన్మములోనే సద్గతిఁ జెందఁ దప్పక ప్రయత్నపడవలసినది.

అట్లుచేయనిచో "మన మెత్తునట్టి యసంఖ్యము లగు జన్మములలో నీ మనుష్యజన్మ మెత్తుట మిక్కిలి దుర్లభము; ఈ మనుష్యజన్మమును వ్యర్థపరచి దీనిని బోఁగొట్టుకొన్నయెడల నిఁకేజన్మము గలుగునో, ఇఁకేది సంభవించునో, అనునది గనుగొనవలెను" అని మహనీయుఁ డగు తాయుమానస్వామి "సిద్ధగణపథిక" ము॥ నాలవ పద్యమునందుఁ జెప్పియున్నాఁడు గనుక, నాశములేనిదియు, సత్స్వరూప మైనదియు, నిజముగాఁ ద్రికాలంబులం దుండునదియునగు బ్రహ్మవస్తువును (ఆత్మను=భగవంతుని) యీమానుషజన్మమందే పృథక్శక్తిగల కరచరణాద్యవయవములు గల యీ శరీర ముండు నప్పుడే, సద్గురువును జెంది, వారియాజ్ఞ నతిక్రమించని గురుకులవాసము చేసి, యుపదేశమునుబొంది, లెస్సఁగా ననుష్ఠించి, తెలియవలసిన యంశములను జక్కఁగాఁ దెలిసికొన్ననే గాని, సద్గతిఁజెందుట కలవికాదు. ఈ విధముగాఁ జేయక "ఈప్రపంచమే సత్యము; మన మెప్పుడు జరామరణములు లేక శాశ్వతుల మై యుందుము" అని మనము చేయఁదగని యనేకపాపకృత్యములచే ద్రవ్యార్జనఁ జేసి, లోకోపకారక మగు ధర్మవిషయములలో భగవదర్పణముగా ద్రవ్యము నుపయోగింపక శరీరాలంకారముకొఱకును, ఇహలోకసుఖముకొఱకును, అన్యాయముగా వ్రయము చేసి, పారమార్థిక విచారణ గాని చేయక, పాపకార్యములలోనే కాలము గడుపుచుండు మనబోఁటివారలకుఁ గలుగు నష్టమును వాక్కుతోఁ వచింపను, చేతితో వ్రాయను నలవికాదు. మఱల నీ మనుష్యుఁడుగా జన్మింప

నలవి కాకపోవుట యే యట్టినష్టస్థితి యనఁ బడును. కాఁబట్టి పైనఁ జెప్పఁ బడిన విధముగా సద్గురుముఖమువలన గుణదోషవిచారణ చేసి, తెలిసికొని, యనుష్ఠించి, చరాచరస్వరూపము లగు ప్రతిభూతములలోను నద్వితీయముగ నుండు బ్రహ్మమును శ్రవణ, మనన, నిదిధ్యాసలచేఁ గలుగు స్వానుభవమువలనఁ దెలిసికొనిన ధీరు లహంకార, మమకారములచే నిండియుండునదియు, అవిద్యాస్వరూపమును నగు నీప్రపంచములోనుండి (ఈ జన్మమునుండి) పదార్థభేదములచే ఘటాకాశ మనియు, మఠాకాశ మనియు వ్యవహరింపఁబడి యుపాధులకు నాశముగలిగినప్పుడు మహాకాశ మైనట్లును ఉపాధితో నుండిన నాకాశ మెట్లుపాధులవలన బాధింపఁబడదో, అటువలె సకలము తానుగాను, తానేసకలముగాను స్వానుభవముచేఁ జూచుచు మరణము లేని మోక్షమును బొందుచున్నారు. అని యీ మంత్ర ముపదేశించుచున్నది.

ఇట్లు

కేనోపనిషద్దీపికలో రెండవ ఖణ్డము

ముగిసినది.

---

ఓమ్, తత్, సత్,

బ్రహ్మార్పణమ్ అస్తు.

# ఓమ్

## ఓమ్, తత్, సత్ బ్రహ్మణేనమః.

# కేనోపనిషద్దీపికా.

## మూఁడవఖణ్డము.

### ౧ - మంత్రము.

"అవిజ్ఞాతం విజానతాం విజ్ఞాత మవిజానతామ్" బ్రహ్మము తెలియదు, అనువాఁడు బ్రహ్మమును దెలుసుకొనును; తెలియును అనువాఁడు దెలిసికొనఁడు, అని రెండవఖణ్డము 3-వ మంత్రమునందుఁ జెప్పఁబడియున్నది. అందువలన నేది యున్నదో, అది తెలుసును. ఏది లేదగునో, అది తెలియదు. కుందేటి కొమ్ము, అను వస్తువు లేదు. కాఁబట్టి కుందేటికొమ్ము యెవ్వరికిఁదెలియదు. అటువలెనే యీ బ్రహ్మము దెలియని దగుటంజేసి, కుందేటికొమ్మువలె నసత్తనియే చెప్పవలసివచ్చెను. ఇట్లసత్తుగా నుండు బ్రహ్మమునకుఁగల సర్వజ్ఞత్వాది సామర్థ్యమునుబట్టి, యీ బ్రహ్మమును స్వానుభవముచే ధ్యానించువారలు ("యద్భావం తద్భవతి" ఎవరు దేనిని భావించెదరో, వా రదియేయగుదురు, అనునట్లు) ఆ బ్రహ్మయే యగుదురనునది యెంత మోసపుమాటగా నున్నది? ఏలననఁగా, నసత్తుగనుండు వస్తువున కునికి యెక్కడిది? లేనివస్తువును ధ్యానించు టెట్లు ? వస్తువే లేనప్పుడు దానికి సామర్థ్య మెక్కడిది ? సామర్థ్యమే లేనప్పుడు దానిని ధ్యానించువారలకు మాత్రము సామర్థ్య మెచ్చటనుండి వచ్చును? అను నీమొదలగు సందేహములను సద్గురుముఖముగా విచారణచేసి నివర్తించుకొనక, తనకుఁదోఁచినట్లు మహాబుద్ధిశాలివలె బ్రేలు మందబుద్ధిగలవారియొక్క వ్యామోహమును దొలఁగించుటకై యీ ఖణ్డము ప్రారంభింపఁబడుచున్నది.

## 1.

శ్రు॥ బ్రహ్మ హ దేవేభ్యో విజిగ్యే
తస్య హ బ్రహ్మణో విజయే దేవా
అమహీయన్త త ఐక్షన్తాస్మాక మేవాయం
విజయోఽస్మాక మేవాయం మహిమేతి॥ ౧॥

| | |
|---|---|
| బ్రహ్మ, హ | (ఇదివఱకు నీకుఁ జెప్పఁబడుచు వచ్చినదియు, ఇప్పుడు నీచే నసత్తు (లేనిది) అని, వాదింపఁబడుచుండునదియునగు) ఆ బ్రహ్మమే |
| దేవేభ్యః | దేవతలకొఱకు (అనఁగా నసురులు పలుమాఱు దేవతలతో యుద్ధముచేసి, జయించి, వారలఁ జెరపెట్టియు, ఇంద్రునిఁగూడ జయించి, తామే యింద్రాద్యులుగా దేవలోకములను బాలించుచు వచ్చినప్పుడు, దేవతలందఱు భగవంతునిఁ గూర్చి ప్రార్థించఁగా నప్పుడు) భగవంతుఁడు (ఆత్మ=బ్రహ్మము) |
| (అసురాన్) | అసురులను |
| విజిగ్యే | జయించెను. |
| తస్య, హ, బ్రహ్మణ | ఆ బ్రహ్మమునకే (కలిగిన) |
| విజయే | అసురజయమునందు |
| దేవాః | ఇంద్రాద్యులు మొదలగు దేవతలు |
| అమహీయన్త | కీర్తినిబొందిరి. |
| తే | అట్టిదేవతలు |
| అయం | ఈ |
| విజయః | జయము (గెలుపు) |
| అస్మాకమ్, ఏవ | మనదేయనియు, |
| అయం | ఈ |

| | |
|---|---|
| మహిమా | సామర్థ్యము |
| అస్మాకమ్, ఏవ, ఇతి | మనదేయనియు |
| ఐక్షన్త | చూచిరి (తలంచిరి.) |

---

తాత్పర్యము.

నీ వే వస్తువును నసత్తుగాను, లేనిదిగాను, దలంచియున్నావో, దేవతలకు దేవతవుగాను, ఈశ్వరులకందఱికి నీశ్వరుఁడవుగాను నుండు నాబ్రహ్మము, పలుమాఱు దేవతలకు, నసురులకును జరిగిన యుద్ధములయందు దేవతలపక్షమునందు జయమును, నసురులపక్షమునందు నపజయమును గలుగునట్లు చేసెను. ఇందుకు దృష్టాంతముగా మహిషాసురుఁడు, శుంభనిశుంభులు, చండముండులు, రక్తబీజుఁడు, మధుకైటభులు, మొదలైనవారలకును, దేవతలకును జరిగిన యుద్ధమునందు నసురులింద్రుఁడు మొదలైన దేవతలను జయించి, వారిని దమసేవకులఁ గావించి, దేవలోకము నేలుచుండఁగా దేవతలు భగవంతునిఁగూర్చి ప్రార్థించినప్పుడు, భగవంతుఁడన్నిటిలోను శక్తిస్వరూపుఁడై యుండుటవలన నింద్రుఁడు, అగ్ని మొదలగు దేవతలయందుండెడు తన శక్తియంతయు నొక్కటిగాఁజేర్చి, యొక్క పెద్దశక్తిస్వరూపముగఁజేసి ఆ శక్తిస్వరూపమును బంపించెను. ఆ స్వరూప మసురులను జయించి, దేవతలకు రాజ్యమిప్పించి, తాను చాటయ్యెను. ఇట్లు పరబ్రహ్మముచేఁ బంపఁబడిన శక్తియొక్క జయమువలన నగ్న్యాదిదేవతలు మహిమను బొందిరి. అన్నిటిలోను బ్రహ్మాత్మ స్వరూపముగనుండు సర్వజ్ఞుఁడును, సకలప్రాణులయొక్క సర్వశక్తిస్వరూపముగనుండు జగదీశునియొక్క (బ్రహ్మముయొక్క) మహిమచే నీ జయము గలిగినదని తెలిసికొననివారగు నగ్ని, వాయువు, ఇంద్రుఁడు మొదలగుదేవత లిప్పుడు గలిగిన జయము మాచేతనే యనియు, పరమాత్మగా నుండునట్టి యా బ్రహ్మముయొక్క సంబంధమైనది గాదనియుఁ దలఁచి, అధిక గర్వమును బొందిరి.

---

౨ - మంత్రము.

అవతారిక.

మొదటిమంత్రమునందు బ్రహ్మము, తనయొక్కస్వశక్తివలన దేవతలకుఁగలిగిన జయమును దేవతలు తమదిగాను, నిరాకారుఁడును, నిర్వికారియునగు బ్రహ్మము

నకు నీజయముంగూర్చియేమి సంబంధము గలదు? గనుక నీజయమును, తత్కీర్తియును మనదేయని, గర్వించి, మిథ్యయగు దురభిమానము గలిగియుండు దేవతలకు నాగర్వమును, దురభిమానమును బోఁగొట్టఁ దలంచి, పరమదయాళువగు నా పరబ్రహ్మము చేసిన యొక యద్భుతమైన చర్యను యీమంత్రము దెలియఁజేయు చున్నది.

## 2.

శ్రు॥ తద్ధైషాం విజజ్ఞౌ తేభ్యో హ ప్రాదుర్బభూవ।

తన్న వ్యజానన్త కి మిదం యక్ష మితి॥

| | |
|---|---|
| తత్ + హ | (అబ్రహ్మమున్నది గదా) అది |
| ఏషామ్ | అగ్ని, వాయువు, ఇంద్రుఁడు మొదలగు దేవతల యొక్క. |
| (మిథ్యేక్షణమ్) | తప్పుతాత్పర్యమును (అనఁగా దురభిమానమును) |
| విజజ్ఞౌ | తెలిసికొనెను. |
| తేభ్యః (దేవేభ్యః) | (ఇట్టిదురభిమానమును, గర్వమును బొందియుండెడి) దేవతల ననుగ్రహించుట కొఱకు. |
| ప్రాదుర్బభూవ | (స్వయోగమాహాత్మ్యముచేఁ గలిగించుకొనిన య త్యద్భుతమైనదియు, మిక్కిలి యాశ్చర్యమైన దియు, అందఱు చూచిభయపడఁ దగినదియు నగురూపముతో నుద్భవించెను.) |
| తత్ | ఆ యుద్భవించిన బ్రహ్మస్వరూపమును |
| కిం, ఇదం, యక్షం, ఇతి | ఈయక్షరూప మెట్టిదని (అనఁగా, మనగర్వమును, దురభిమానమును బోఁగొట్ట ననుగ్రహముతో నావిర్భవించిన బ్రహ్మస్వరూపమని) |
| న, వ్యజానన్త | తెలిసికొనకపోయిరి. |

---

తాత్పర్యము.

ఈఖండమందు మొదటిమంత్రమునందుఁ జెప్పఁబడిన పరబ్రహ్మస్వరూపము దేవాసురయుద్ధమునందు, మనకుఁ గలిగినజయమును, కీర్తియు, మన స్వశ

_క్తిచేతనే గాని, ప్రత్యగాత్మస్వరూపియగు పరబ్రహ్మయొక్క శక్తిచేత గాదని తప్పుతాత్పర్యముచే దురభిమానులగు దేవతలయొక్క మనస్సులోని యభిప్రాయమును దెలిసికొనెను. ఆత్మతత్త్వ స్వరూపవిచారణ లేకపోవుటచేత నిటువంటి గర్వమును, దురభిమానమును గలిగిన దని, అగ్ని, వాయువు, ఇంద్రుఁడు మొదలగు దేవతల ననుగ్రహించుటకొఱకుఁ దనయొక్క యోగమాయాసామర్థ్యమువలన స్వేచ్ఛగాఁ గలుగఁజేసికొనినదియు, మిక్కిలియాశ్చర్యకర మైనదియు, అందఱు చూచి మిక్కిలిభయపడఁ దగినదియునగు నొక పెద్దరూపముతో నావిర్భవించెను. అట్లుద్భవించిన పరమాత్మస్వరూపమును, దేవతలు మనకు మేలు గలిగించునిమిత్త మావిర్భవించిన బ్రహ్మస్వరూప మనితెలిసికొనలేక యిదేమి యిది? పెద్దవ్యక్తిగానున్న దని చూచి భ్రమించిరి.

బ్రహ్మము=భగవంతుఁడు=ఆత్మ, పుట్టుక లేనిదైనను తనవద్ద నుండుమాయాశక్తిచేఁ దాను స్వేచ్ఛగాఁ గలిగించుకొనుటకు, గీతావచనము.

* శ్లో॥ అజోఽపి స న్నవ్యయాత్మా భూతానా మీశ్వరోఽ పి సన్।
ప్రకృతిం స్వా మధిష్ఠాయ సంభవా మ్యాత్మ మాయయా॥
భగవద్గీతా. 4 అధ్యాయము 6 శ్లో.

## 3 - మంత్రము.

### అవతారిక.

రెండవమంత్రమునందుఁ జెప్పఁబడిన యక్షరూపమైన బ్రహ్మమును జూచి, భ్రమఁజెందియుండు దేవత లీరూపమును జూడఁజూడ భయముగలుగుచున్నది. ఇదేమో విపరీతముగ నున్నది. ఏదో యొక యపాయమునకు సూచకముగ నున్న దనియు, రాక్షసులతో యుద్ధము చేసి, వారిని జయించితిమిగదా? మనకునికమీఁద నేమి భయము లేదనియు దలంచియుండునప్పుడు యిదొక్కటి క్రొత్తగా వచ్చి చేరెను, అని దేవత లొకరికొకరు భయముతో నాలోచించుకొనుచు నేమియు దోఁచక, కట్టకడ నగ్నిని జూచి చెప్పుమాటల నీమంత్రము దెలియపరుచు చున్నన్నది.

---

* దీని యర్థము నీవ్యాఖ్యానకర్తచే రచియింపఁబడియుండు భగవద్గీతా గూఢార్థదీపికను జూచునది.

# 3.

శ్రు॥ తేఽగ్ని మబ్రువన్ జాతవేద ఏతద్విజానీహి।
కి మేత ద్యక్ష మితి తథేతి॥

| | |
|---|---|
| | పరమాత్మయొక్క మహిమను దెలిసికొననందున భయమును జెంది, నిజమును దెలిసికొనుట కిచ్ఛగలవారలై యుండు దేవతలు. |
| అగ్నిమ్ | (దేవతలకు ముందునడచెడి) యగ్నిహోత్రునిం జూచి, |
| (హే) జాతవేదః! | (వేదములను ననేకవిధములగు జ్ఞానములతోఁ దెలిసికొనఁదగిన సమస్తవేదాత్మకమగు జాతవేదుఁ డనెడు మాఱుపేరుగల) యగ్నిహోత్రుఁడా! |
| ఏతత్, యక్షమ్ | మాకంట్ల కగపడెడి యీగొప్పభూతమును |
| కిమ్ | ఎట్టిదని |
| ఏతత్ | దీనిని |
| (త్వమ్) | నీవు |
| విజానీహి, ఇతి | తెలిసికొనుమా, యని |
| అబ్రువన్ | పలికిరి. |
| అగ్నిః | అగ్నియు |
| తథా, ఇతి | అట్లేకానియని (ప్రత్యుత్తరమిచ్చెను.) |

---

తాత్పర్యము.

మంచిదిగాని జయమొకనికిఁ గలుగునప్పుడు అది తనయొక్క సామర్థ్యముచేఁ గలిగిన దని తలంచుట తనస్వభావము గనుక నసురులకును దేవతలకును జరిగిన యుద్ధమందు గలిగినజయము దేవతలు తమదిగాఁ దలంచియుండునప్పుడు వారల కెదుట గొప్పరూపముఁ దాల్చియుండు భగవంతునియొక్క మహిమను దెలిసికొననందునఁజూచి భయపడి నానావిధములుగా నాలోచనచేయుచు నీభూతముయొక్క స్వరూపమును దెలిసికొను తలంపు గలవారలై, తమకు ముందు నడచునట్టి సకలవేదస్వరూపుఁడగు నగ్నిహో

త్రునిఁజూచి, ఓజాతవేదుఁడా! మా కెదుట దృష్టిగోచరముగాఁ గనఁబడు నీగొప్పరూపము నిట్టిదని తెలిసికొనుమా యని, దేవతలు చెప్పఁగా, నగ్నిహోత్రుఁడును నట్లకానిమ్మని చెప్పి వెళ్లసాగెను.

---

## ४ - మంత్రము.

### అవతారిక.

ఇవ్విధముగా దేవతలతోఁ జెప్పి తత్క్షణమే బయలుదేరి, యెదుటఁ గనఁబడు భూతమువద్ద వెళ్లినప్పుడు, ఆయక్షస్వరూపమునకును, నగ్నిహోత్రునికిని జరిగిన సంగతుల నీ మంత్రము, ౫, ౬, మంత్రములును దెలియపరచుచున్నవి. ఎట్లనిన:—

## 4.

శ్రు॥ త దభ్యద్రవ త్త మభ్యవదత్కోఽసీతి।
అగ్ని ర్వా అహ మస్మీ త్యబ్రవీ జ్జాతవేదా వా అహ మస్మీతి॥

| | |
|---|---|
| తత్ | ఆబ్రహ్మస్వరూప మగు గొప్పభూతమువలెఁ గనఁబడు యక్షరూపమును గూర్చి |
| (అగ్నిః) | అగ్నిదేవుఁడు. |
| అభ్యద్రవత్ | సమీపించెను. (సమీపించి భయమున నేమియుఁ దోఁచక మౌనముతో నిలిచెను) |
| తమ్ | అటువంటి యగ్నినిజూచి, |
| (త్వమ్) కః, అసి, ఇతి | నీ వెవ్వాఁడవు అని, |
| అభ్యవదత్ | (యక్షరూపమైన బ్రహ్మము) అడిగెను. |
| అహమ్ | నేను |
| అగ్నిః, వా | ప్రసిద్ధమగు నగ్ని యను పేరుగలవాఁడనుగాను |
| అస్మి, ఇతి | అగుచున్నాను అని, |
| అబ్రవీత్ | పలికెను. |
| (అపిచ) | మఱియు |
| అహమ్ | నేను |

జాతవేదాః, వా — వేదాత్మకమగు ప్రసిద్ధమైన జాతవేదుఁడని పేరుగల వాఁడనుగా

అస్మి, ఇతి — ఉన్నాను అనియు (పలికెను.)

---

తాత్పర్యము.

దేవతలవద్ద సెలవు పుచ్చుకొని వెళ్లిన యగ్నిహోత్రుఁడు దనసామర్థ్యమును దానే పొగడుకొనుచు నెదుటనుండు యక్షరూపమును జూచి భయము చెందినవాఁడుగ నుండినను, దేవతలవద్ద నేను పోయి తెలిసికొనివచ్చెదనని యొడంబడితిని గదా. యను వాగ్దత్తముఁ దలఁచి మనసున ధైర్యము దెచ్చుకొని, యక్షరూప మగు బ్రహ్మమును సమీపించి, యేమియు మాటలాడఁ దోఁచక, చేతులు, కాళ్లు వణఁకుచు స్తంభించియుండు నగ్నిని జూచి, 'నీవెవ్వఁడవని,యీబ్రహ్మమడుగఁగా నాగొప్పరూపము మొదటమాటలాడినందునఁ గొంచము ధైర్యము జెంది మనస్సును స్థిరపరచుకొని, ఏమి యిట్లు మాటలాడుచున్నావు? నేనెవ్వరైనది గుర్తెఱుఁగవు? ఎల్లనుబ్రసిద్ధుఁడగు నగ్నిహోత్రుఁడను నేను; నన్నే వేదాత్మకమగు జాతవేదుఁడనియు చెప్పుకొందురు. అని పలికెను.

---

## ౫ - మంత్రము.

### అవతారిక.

ఇట్లు చెప్పిన యగ్నిహోత్రునిం జూచి యక్షరూపధారియగు పరబ్రహ్మమిట్లనియె.

## 5.

శ్రు॥ తస్మింం స్త్వయి కిం వీర్య మిత్య పీదగ్ం సర్వం దహేయమ్।
యదిదం పృథివ్యా మితి॥

తస్మిన్ — అటువంటి ప్రసిద్ధమైన పేరుగల

త్వయి — నీయందు

| | |
|---|---|
| కం, వీర్యం, అస్తి, ఇతి. | ఏమి సామర్థ్యమున్నదని, |
| (యక్షేణ, పృష్టః, సః,) | పెద్దభూతస్వరూపమగు బ్రహ్మముచేత నడుగఁబడిన యగ్నికూాత్రుఁడు. |
| పృథివ్యామ్ | ఈభూమి, అంతరిక్షము మొదలగు సమస్తములోను నుండెడి |
| యత్, ఇదం | ఈ (స్థావర జంగమ రూపములుగనుండు.) |
| ఇదం, (తత్) సర్వమ్, అపి | ఈసమస్తమైన వానిని |
| దహేయమ్, ఇతి | భస్మము చేయుదునని |
| (అవదత్) | పలికెను. |

---

## తాత్పర్యము.

తన్నుఁగూర్చి వచ్చి యేమియు మాటలాడక యుండు నగ్నిని జూచి, గొప్ప యక్షరూపమును దాల్చినబ్రహ్మము, నీయందుఁ బ్రసిద్ధిగలుగఁజేయఁదగిన సామర్థ్య మేమి యున్నదని, యడిగెను. ఈ భూమి, అంతరిక్షము మొదలగు సమస్త ప్రపంచ మును, అందులోని స్థావర జంగమముల నన్నిటిని భస్మముచేయునట్టి సామర్థ్యము నాయందు న్నదని యగ్నిదేవుఁడు ప్రత్యుత్తర మిచ్చెను.

---

## ౬ - మంత్రము.

### అవతారిక.

అగ్నిదేవుఁ డగు జాతవేదుఁడు చెప్పిన యాత్మస్తుతి మాటలను వినిన యా గొప్పరూపము దాల్చియుండు పరబ్రహ్మ మగ్నియొక్క గర్వము నణఁచి వానికి శ్రేయస్సును గలుగఁజేయుటకొఱకుఁ జెప్పిన దేమనఁగా.

## 6.

శ్రు॥ తస్మై తృణం నిదధావేత ద్దహేతి
తదుపప్రేయాయ సర్వజవేన తన్న శశాక దగ్ధుం।

స తత ఏవ నివవృతే నైత దశకం
విజ్ఞాతుం య దేత ద్యక్ష మితి॥

| | |
|---|---|
| (తర్హి, త్వమ్) | అట్లయినచో, నీవు |
| ఏతత్, తృణం, (మాత్రమ్) | ఈగడ్డిపోచను మాత్రము |
| దహ, ఇతి | (నాయెదుట) భస్మము చేయుమూ, అని, |
| తస్మై | (అయిదవ మంత్రమందుఁ జెప్పఁబడిన డ్లభిమానము, గర్వమును బొందియుండెడి) ఆయగ్ని హోత్రుని కొఱకు (అగ్ని హోత్రుని యెదుట) |
| నిదధౌ | (ఆ యక్షరూపమును దాల్చినబ్రహ్మము) వైచెను. |
| తత్ | ఆగడ్డిపోచనుగూర్చి |
| సర్వజవేన | (ప్రపంచమంతయు బూడిదగాఁజేయు నాకిది యే మాత్రమను గర్వముతోను, మిక్కిలియుత్సాహ ముతోను) అతివేగముగా |
| సః | ఆ అగ్ని హోత్రుఁడు |
| ఉపప్రేయాయ. | (ఆగడ్డిపోచయొక్క సమీపమునకు) వెళ్లెను. |
| తత్ | (వెళ్లినపిమ్మట) ఆగడ్డిపోచను. |
| దగ్ధుమ్ | భస్మము చేయుటకు |
| న, శశాక | సమర్థుఁడు కాకపోయెను. |
| తతః | పిమ్మట |
| నివవృతే, ఏవ | (తనచేతఁ గాకపోవుట వలన, గర్వభంగముతో) మఱల వలసియేవచ్చెను. |
| దేవాన్ | (ఈవిధముగా మఱలివచ్చినయగ్ని) దేవతలఁగూర్చి |
| ఏతత్, యక్షమ్ | ఈయెదుటనున్న గొప్పభూతమును |
| యత్, ఇతి | ఎట్టిదని. |
| ఏతత్ | దీనిని |
| విజ్ఞాతుమ్ | తెలిసికొనుటకు |
| న, అశకమ్, ఇతి | నాచేతఁ గాలేదని. |
| (ఉక్తవాన్) | పలికెను. |

## తాత్పర్యము.

ఇవ్విధముగా గర్వముఁ జెందియుండు నగ్ని హోత్రునిం జూచి, యీయక్ష రూపము దాల్చిన గొప్పభూతమగు బ్రహ్మమిట్లనియె :—

ఓ అగ్నిహోత్రుఁడా! ప్రపంచము నంతయు దహించుసామర్థ్య ముండు నది నిజమైనచో నిదిగో! ఈగడ్డిపోచను నాయెదుట దహించుమూ, యని వైచెను. అదివిన్న యగ్నిహోత్రుఁడు సమస్తప్రపంచముల నొకక్షణములో దహించెడి నాకిది యొకకార్యమా యని మిక్కిలి యుత్సాహముతో గడ్డిపోచను సమీపించి దానిని భస్మముచేయుటకుఁ దనకుఁగల సర్వశక్తి నుపయోగపఱచియు నేమియు గాక తాను గర్వభంగమునొంది మిక్కిలి యవమానముతో దేవతలవద్దకు తిరిగి వెళ్లి, అయ్యా! ఈయెదుటనుండునట్టి యాగొప్పభూతముయొక్క నిజస్థితిఁ దెలిసికొ నుటకు నాకు శక్యముగాలేదని యగ్నిహోత్రుఁడు పలికెను.

---

## ౭ - మంత్రము.

### అవతారిక.

ఇట్లు మహాదాంభికముగాఁ దన్నుఁ, దనశక్తిని గూర్చియు పొగడుకొనుచు గర్వించియుండిన యగ్నిహోత్రునికి గర్వభంగము గలిగినను దేవతలావిషయమై యాలోచింపక తిరుగ వాయువును బంపిరి; ఆవాయుదేవునకును, యక్షరూపధారి యగు పరబ్రహ్మమునకును నడచిన సంగతుల, నీ యేడవమంత్రమును, ఎనిమిది, తొమ్మిది, పదియవ మంత్రములును దెలియఁజేయుచున్నవి. ఎట్లనిన:—

## 7.

శ్రు॥ అథ వాయు మబ్రువన్ వాయ వేతద్విజానీహి।
కి మేత ద్యక్షమితి తథేతి॥

| | |
|---|---|
| అథ | అగ్నిదేవుఁడు గర్వభంగము నొందిన పిమ్మట |
| (తే) | ఆదేవతలు |
| వాయుమ్ | వాయువునుగూర్చి |
| హే, వాయో! | ఓవాయుదేవుఁడా! |
| ఏతత్ | ఈయెదుటఁగనఁబడుచుండు |

| | |
|---|---|
| యక్షమ్ | గొప్పభూతమును |
| ఏతత్, కిమ్ | ఇదేమియని |
| (త్వమ్) | నీవు |
| విజానీహి, ఇతి | తెలిసికొనుమూ, అని |
| అబ్రువన్ | పలికిరి. |
| (వాయుః) | వాయుదేవుఁడును |
| తథేతి | అట్లేయని (యనెను.) |

---

### తాత్పర్యము.

ఇవ్విధముగా దేవత లగ్నిని బంపి యాభూతమును దెలిసికొనక పోయినప్పుడు మఱల వాయువును బిలిచి నీవాభూతమును దెలిసికొనుమూ యని చెప్పిరి. అప్పుడువాయు వట్లే యని చెప్పెను.

---

## ౮ - మంత్రము.

### అవతారిక.

దేవతలవద్ద నాభూతమును దెలిసికొనివచ్చెదని చెప్పినవాయుదేవునకు నాభూతమునకును జరిగినసంగతులను యీమంత్రము దెలియపఱచుచున్నది. ఎట్లనిన:—

## 8.

శ్రు॥ తదభ్య ద్రవ త్తమభ్యవద త్కోఽసీతి వాయు ర్వా
అహ మస్మీత్యబ్రవీ న్మాతరిశ్వా వా అహ మస్మీతి॥

| | |
|---|---|
| తత్ | (వాయుదేవుఁడు) ఆమహాభూతమును గూర్చి |
| అభ్యద్రవత్ | వెళ్లెను. |
| తమ్ | తన్నుఁగూర్చి వచ్చినిలిచెడి వాయువును జూచి, |
| (తత్) | ఆమహాభూతము, |
| (త్వమ్) | నీవు |
| కః, అసి, ఇతి | ఎవ్వఁడవు, అని, |
| అభ్యవదత్ | ప్రశ్నచేసెను. (అందుకు వాయువు) |
| అహమ్ | నేను |

| | |
|---|---|
| వాయుః, వా | (వానాత్=గమనాత్, గంధనాత్ వా, వాయుః) ప్రసిద్ధమైన వాయువను పేరుగలవాఁడను. |
| అస్మి, ఇతి | అగుచున్నానని |
| అబ్రవీత్ | పలికెను. |
| అహమ్ | నేను |
| మాతరిశ్వా, వా | (మాతరి=అంతరిక్షే, శ్వయతీతి=మాతరిశ్వా) సమస్తమును స్వీకరించి, ఆకాశమందు సంచరివాఁడనెడు ప్రసిద్ధమైన 'మాతరిశ్వ' యను పేరుగలవాఁడను |
| అస్మి, ఇతి | అగుచున్నాననియు |
| (అబ్రవీత్) | పలికెను. |

తాత్పర్యము.

దేవతలవద్ద సెలవు దీసికొనివచ్చిన వాయుదేవుఁడు ఆమహాభూతమువద్దకు వెళ్లి యాస్వరూపమును జూచి యేమియు దోఁచక మౌనములోనిలిచెను. ఇట్లు తన్నుఁగూర్చి వచ్చి యేమియు పలుకకుండు వాయువుంజూచి యామహాభూతము పలికెను. ప్రథమమున నాభూతము ప్రశ్న చేసినందున, మనస్సున ధైర్యము దెచ్చుకొని, నాపేరు ప్రసిద్ధమైన వాయువనెను. మఱియు సమస్తమును స్వీకరించి యంతరిక్షమునకుఁ గొనిపోవు సామర్థ్యము గలవాఁడనుగనుక నన్నే మాతరిశ్వ, యనిచెప్పుదురనియు పలికెను.

౮ - మంత్రము.

అవతారిక.

ఇట్లంత నీవుప్రసిద్ధుఁడవుగా నుండఁదగిన కారణమేమి? నీయందట్టి మహత్తేమియున్నది? అను భూతముయొక్క ప్రశ్నను, వాయువుయొక్క ప్రత్యుత్తరమును నీమంత్రము దెలియఁజేయుచున్నది.

9.

శ్రు॥ తస్మింస్త్వయి కిం వీర్య మిత్యపీదగ్ం సర్వమాదదీయం।
యదిదం పృథివ్యా మితి॥

| | |
|---|---|
| తస్మిన్ | అటువంటిప్రసిద్ధమైననామముగల |
| త్వయి | నీయందు |
| కిమ్, వీర్యమ్, (అస్తి) ఇతి | ఏమిసామర్థ్యమున్నదని |
| (తేన, పృష్టః, సః) | ఆభూతరూపముదాల్చిన బ్రహ్మముచే నడుగఁబడిన వాయుదేవుఁడు |
| పృథివ్యామ్ | భూమియందు |
| యత్, ఇదమ్ | ఈస్థావరజంగమరూపములుగానుండున దేదిగలదో, |
| ఇదం, సర్వం, అపి | ఆ యీసమస్తమునుగూడ |
| ఆదదీయమ్, ఇతి | గ్రహింపఁగలవాఁడనని |
| (అబ్రవీత్) | పలికెను. |

తాత్పర్యము.

నిన్నుఁ బ్రసిద్ధముగాఁ దెలిసికొనఁదగిన సామర్థ్యవిశేష మేమియున్నది? అని తన్నుఁగూర్చి వచ్చి మాటలాడక సమీపమున నిలిచియుండు వాయువునుగూర్చి యా మహాభూతమడుగఁగా, నీప్రపంచమందుగల స్థావరజంగమరూపములగు సమస్త వస్తువులను గ్రహించి యంతరిక్షమునకుఁ గొనిపోవు సామర్థ్యమున్నదని పలికెను.

౧౦ - మంత్రము.

అవతారిక.

ఇవ్విధముగా నాత్మస్తుతిఁ జేసిన వాయువుయొక్క మాటలువిన్న యాబ్రహ్మ మీ వాయువుయొక్క గర్వము నణఁచి యతనికి మంచిని గలుగఁజేయు తలంపుతోఁ జెప్పిన దేమనఁగా:—

10.

మూ॥ తస్మై తృణం నిదధా వేత దాదత్స్వేతి

తదుపప్రేయాయ సర్వజవేన తన్నశశాకాదాతుం

స తత ఏవ నివవృతే నైత దశకం విజ్ఞాతుం
యదేత ద్యక్ష మితి.

| | |
|---|---|
| (తర్హి, త్వమ్) | అట్లయితే, నీవు |
| ఏతత్, తృణమ్ (మాత్రమ్) | ఈ గడ్డిపోచనుమాత్రము |
| ఆదత్స్వ, ఇతి | (నాయెదుటను) గ్రహించుము (చూచెదనని) |
| తస్మై | అభిమానమును, గర్వమును బొందియుండెడి వాయువునుగూర్చి (వాయువునెదుట) |
| నిదధౌ | ఆయక్షరూపమును ధరించియుండు బ్రహ్మము వైచినది. |
| తత్ | ఆగడ్డిపోచనుచూచి |
| సర్వజవేన | (ప్రపంచమునంతయు నామూలముగఁ బెళ్లగించి వేయు సామర్థ్యముగల నాకు నిది యొక్క-కార్యమా యను గర్వముతోను, ఉత్సాహము తోను) అతివేగముగా |
| సః | ఆవాయువు |
| ఉపప్రేయాయ | (గడ్డిపరకను) సమీపించెను. |
| తత్ | ఆగడ్డిపోచను |
| ఆదాతుమ్ | గ్రహించుటకు |
| న, శశాక | సామర్థ్యములేనివాఁడయ్యెను. |
| తతః | పిమ్మట |
| నివవృతే, ఏవ | (తనచేతఁ గానందున గర్వభంగముతో) మఱల వలసినదయ్యెను. |
| దేవాన్ | (ఇవ్విధముగా మఱలవలసివచ్చిన యీవాయువు) దేవతలనుగూర్చి |
| ఏతత్, యక్షమ్ | ఈమహద్భూతస్వరూపము |
| యత్, ఇతి | ఏదియని |

| | |
|---|---|
| విజ్ఞాతుమ్ | తెలిసికొనుటకు |
| న, అశకమ్, ఇతి | నాచేఁ గాలేదని |
| ఉక్తవాన్ | చెప్పినవాఁడాయెను. |

---

## తాత్పర్యము.

ఈవిధముగా గర్వమును బొందియుండెడి వాయువును జూచి, యక్షరూపమును దాల్చియుండెడి యాబ్రహ్మము చెప్పిన దేమనఁగా:— ఓ మాతరిశ్వ యను పేరుగల వాయూ! ప్రపంచమునంతయు పెళ్లగించి విసిరివేయ సామర్థ్యముండునది నిజమైనచో నీ వీ గడ్డిపోచను నాయెదుట యెత్తుముచూచెదనని వాయువునెదుట వేసెను. ఆ గొప్పభూతమగు బ్రహ్మము చెప్పిన వాక్యము వినిన యావాయువు సమస్తమును దూదివలె నూదివేయు సామర్థ్యముగల నాకిది యొకగొప్పకార్యమా యని మిక్కిలి యుత్సాహముతో గడ్డిపోచను సమీపించి దానిని గదలించుటకుఁ దనశక్తికొలఁదిని ప్రయత్నపడియుఁ గదలింపలేనందున మిక్కిలి యవమానముతో దేవతలయొద్దకుఁ దిరుగా వెళ్లి, అయ్యా! ఈ యెదుటనున్న భూతముయొక్క నిజస్థితిని దెలిసికొనుటకు నావలనఁ గాకపోయెనని పలికెను.

౧౧ - మంత్రము.

---

## అవతారిక.

ఇట్లు మిక్కిలి సంభ్రమముతోఁ దన్నుఁ, దనశక్తిని బొగడుకొని గర్వించి యుండిన వాయువుయొక్క గర్వముగూడ నణఁగినపిమ్మట, దేవతలు మరల నింద్రునిఁ బంపిరి. ఈయింద్రుఁడు బయలుదేరి వెళ్లుచుండఁగా నడచినసంగతుల నీమంత్రము దెలియపరచుచున్నది.

## II

శ్రు॥ అథేన్ద్రమబ్రువన్ మఘవన్నేతద్విజానీహి
కిమేతద్యక్షమితి తథేతి తదభ్యద్రవత్
తస్మాత్తిరోదధే॥

| | |
|---|---|
| అథ | వాయువు గూడ గర్వభంగము నొంది మఱలివచ్చిన పిమ్మట |
| ఇన్ద్రమ్ | (ఇది=పరమైశ్వర్యే, ఇతిధాతోః రప్రత్యయః) పరమైశ్వర్యము గలవాఁడును, త్రిలోకాధిపతి యగు నింద్రునింజూచి, |
| (తే) | ఆదేవతలు |
| హేమఘవన్ | (మహ్యతే=పూజ్యతే, ఇతి, మహ=పూజాయామ్ ఇతిధాతుః) సకలలోక పూజ్యుఁడవగు దేవేంద్రుఁడా ! |
| (త్వమ్) | నీవు |
| ఏతత్, యక్షమ్ | ఎదుటఁ గనఁబడుచుండు నీ మహాభూతమును |
| కిమ్, ఏతత్ | ఇది యేమని |
| విజానీహి, ఇతి | తెలిసికొనుమాయని |
| అబ్రువన్ | పలికిరి. |
| (సః) | (అందుకు) నింద్రుఁడు |
| తథా, ఇతి | అట్లె కానిండని |
| తత్ | ఆమహాభూతమునుగూర్చి |
| అభ్యద్రవత్ | వెళ్లెను. |
| (తత్) | ఆమహాభూతమగు బ్రహ్మము |
| తస్మాత్ | ఇంద్ర పదవియందు నధికాభిమానము గలవాఁడు గనుక వీనికిమిక్కిలి యవమానముచేయఁగూడదని తలఁచి, ఇంద్రుఁడు తన్ను సమీపించు నంతలోనే |
| తిరోదధే | అంతర్ధానమును (కనఁబడకపోవుటను) బొందెను. |

## తాత్పర్యము.

ఎప్పు డగ్నియును, వాయువుయును నీయక్షరూపమును దాల్చినబ్రహ్మ స్వరూపమును దెలిసికొనలేక, గర్వభంగము నొంది తిఱిగివచ్చిరో, యాతోడనే

దేవతలు త్రిలోకపూజ్యుఁడైన యింద్రునిఁ బిలిచి నీవు వెళ్లి యాగొప్ప భూతము యొక్క సంగతిని దెలిసికొనిరమ్మని పంపఁగా నింద్రుఁడు నట్లేకాని యని యాగొప్పరూప మగుబ్రహ్మమును సమీపించునంతలో నాబ్రహ్మ స్వరూప మీవచ్చినట్టి యింద్రుఁడు, దేవతలకుఁ బూజ్యమైనవాఁడుగనుక వీనికి నట్టియవ మానము సంభవింపఁగూడదని తలఁచి యాకాశమునం దంతర్ధానము నొందెను.

## ౧౨ - మంత్రము.

### అవతారిక.

ఇట్లు యక్షరూపమును దాల్చినబ్రహ్మము చాటైనతోడనే యాకాశమందు మిక్కిలిప్రకాశముతోఁ గనఁబడు స్త్రీరూపమునకును నింద్రునకును నడచినసంవాదము నీమంత్రము దెలియఁజేయుచున్నది.

## 12.

శ్రు॥ సతస్మిన్నేవాకాశే స్త్రియ మాజగామ బహుశోభమానా
ముమాం హైమవతీం తాగ్ంహోవాచ కి మేతద్యక్ష మితి॥

| | |
|---|---|
| సః | (తాను దెలుసుకొనుట కొఱకు వచ్చిన తోడనే యామహా భూతమగు బ్రహ్మము కనఁబడక పోయినం జూచి వెల్లబోయిన మోము గల వాఁడుగాను, దుఃఖాక్రాంతమనస్కుఁడుంగాను నుండు) నింద్రుఁడు. |
| తస్మిన్, ఆకాశే, ఏవ | (కనఁబడక పోయినచోటగు నా యాకాశమునందు నారూపమును ధ్యానించుకొనుచును, దన యొక్క యిష్టదేవతయు, విద్యారూపియు నగు పరమేశ్వరినిగూర్చి స్తోత్రములచే స్తుతించుచు, మనసున ధ్యానించుచు నగ్ని వాయువుల వలె నేనును దిరిగిపోవలసి వచ్చెను గదా యని యంబను ప్రార్థించుచుండఁగా) నా యాకాశమునందు. |

| | |
|---|---|
| హైమవతీమ్ | (1) బంగారుచేఁ జేయఁబడిన యాభరణములఁ గలదియు.<br>(2) హిమవద్గిరియొక్క పుత్త్రికయును,<br>(3) మంచుగడ్డవలె స్వచ్ఛముగాను, నిర్మలముగాను, స్వయంప్రకాశముగాను, ఆనంద స్వరూపముగాను నుండునదియు, |
| బహుశోభమానామ్ | అవిద్యాస్వరూపమగు సమస్తమునకును, వేఱైనదియు, మిక్కిలి కాంతి గలదియు, |
| ఉమామ్ | అవిద్యను బోఁగొట్టుటవలన శ్రేష్ఠమైన బ్రహ్మవిద్యా స్వరూపమైనదియు నగు |
| స్త్రియమ్ | స్త్రీరూపమును గూర్చి |
| ఆజగామ | వచ్చెను. |
| తామ్, హ | ఆప్రసిద్ధమైన స్త్రీరూపమును జూచి |
| ఏతత్, యక్షమ్ | (కనఁబడి, యగ్నిని, వాయువును నవమానము చేసి, యిప్పుడు కనఁబడకపోయిన) అమహాభూత స్వరూపము |
| కిమ్, ఇతి | ఏది యని |
| ఉవాచ | అడిగెను. |

---

తాత్పర్యము.

తానువచ్చినతోడనే కనఁబడకపోయిన యా యక్షరూపమును గురించి దుఃఖాక్రాంతుఁడై, యట్టిగొప్పవస్తువుయొక్క సంగతి దెలియకపోయెను గదా యనియు, ఇంతవఱకే యగ్నివాయువు లవమానమును జెంది వెనుకకుబోయిరే యనియు, యాగొప్పస్వరూపము వారలతోమాటలాడి, మనతోనొక మాటయు నాడకబోయెననియు, తిరిగివెళ్లి దేవతలకేమి చెప్పుదునియు మనస్సునఁ గలఁతఁజెంది, యాగొప్పస్వరూపము నేకాగ్రచిత్తుఁడై ధ్యానించి తరువాత దనయిష్టదేవతయగు లక్ష్మినిగూర్చి ధ్యానించుకొని మఱలివెళ్లుటకు యత్నిం

చుచుండఁగాఁ దెల్లనిమంచుగడ్డవలె మిక్కిలి శుద్ధముగను, నిర్మలముగను, స్వయంప్రకాశముగను, సదానందస్వరూపముగను, అవిద్యాస్వరూపముగు సమస్తమునకును వేఱయినదిగను, జగజ్జ్యోతి స్స్వరూపముగను, నవిద్యను బోఁగొట్టఁదగిన శ్రేష్ఠమైనబ్రహ్మవిద్యా స్వరూపియు నగు నొకస్త్రీరూపము నాకాశమునందుఁ జూచి, నమస్కరించి, తల్లీ! అగ్నిని, వాయువును నవమానపరచి, యిప్పుడు కనఁబడకపోయిన యామహాభూత స్వరూపమెట్టి దని నాకుఁజెప్పవలయు నని ప్రార్థించెను.

శ్లో॥ ఇన్ద్రోఽతీవ విషణ్ణ స్తు మహాతాప సమన్వితః।
విద్యారూపా మిమాం దేవీం ధ్యాత్వా కారుణికోత్తమామ్॥
,, లౌకికై ర్వైదికై స్స్తోత్రై స్తుష్టావ పరమేశ్వరీమ్।
సా శివా కరుణామూర్తిః జగన్మాతా త్రయీమయీ॥
,, శివాభిన్నా పరానందా శంకరస్యాపి శంకరీ।
స్వేచ్ఛయా హిమవత్పుత్రీ స్వ భక్తజన వత్సలా॥
,, మహాదేవస్య మాహాత్మ్యం దుర్జ్ఞేయం సర్వజన్తుభిః।
ఇతి దర్శయితుం దేవీ తత్రై వావిరభూ త్స్వయమ్॥
,, తా మారాధ్య శివా మిన్ద్రః శోభమానాంచ సర్వతః।
ఉమాం పర్వతరాజేంద్ర కన్యకా మపి వప్రభృత్॥
,, కి మేత ద్యక్ష మత్రైవ ప్రాదుర్భూతం తిరోహితమ్।
వక్తు మర్హసి దేవేశి! మమ కారుణికోత్తమే!॥

తా॥ తాను వచ్చినతక్షణమే యంతర్ధానమునొందిన యామహాభూత స్వరూపముగు బ్రహ్మముఁగూర్చి, యింద్రుఁడు మిక్కిలివ్యసనమును, తాపమును బొందినవాఁడై యవిద్యను బోఁగొట్టఁదగిన శ్రేష్ఠమైన కరుణానిధియైనదియు. విద్యాస్వరూపియైనదియు, త్రిలోకములకు మాతయైనదియు, మంగళస్వరూపుఁడగు పరబ్రహ్మమున కభిన్నమైనదియు, శ్రేయస్సుల కన్నిటికిని శ్రేయస్సైనదియు, హిమవంతుని పుత్త్రికయైనదియు, తన్ను ధ్యానించు భక్తులకు భక్తవత్సలస్వరూపి యయినదియు, సకలప్రాణులచేఁ దెలిసికొనఁబడఁ దగని

దియు, పరబ్రహ్మముయొక్క మహిమను స్వానుభవముచేఁ దెలియఁ జేయఁదగినదియు, ఆమహాభూతమైన యక్షరూపము దాల్చినబ్రహ్మము కనఁబడిన స్థానమునందే యావిర్భవించినదియు, తేజోమయమైనదియు నగు నుమాదేవిని ధ్యానించి యావిర్భవించిన పిమ్మటఁబ్రార్థించి, ఓపరమేశ్వరీ! ఇదివఱకుఁ గనఁబడి యిప్పు డంతర్ధానమును బొందిన యీగొప్ప భూతము యొక్క వివరమును నాకుఁదెలియఁ జెప్పవలసినదని, యాకరుణానిధియగు దేవిని బ్రార్థించుకొనెను. అనియు బ్రహ్మగీతలోఁ జెప్పఁబడి యున్నది.

ఇట్లు

## కేనోపనిషత్తు మూఁడవ ఖండము

సమాప్తము.

---

ఓమ్, తత్, సత్,

బ్రహ్మార్పణమ్,

అస్తు.

ఓమ్, తత్, సత్, బ్రహ్మణేనమః.

# కేనోపనిషద్దీపికా.

## నాలవఖండము.

### ౧ - మంత్రము.

### అవతారిక.

ఇంద్రుఁడు లక్ష్మీయగు నుమాదేవిని ధ్యానించఁగాఁ, బ్రత్యక్షమైన యాయుమాదేవిని జూచి, యిప్పుడు కనఁబడి యంతర్ధానమునొందిన వస్తువును దెలియఁజేయుమని యడుగఁగా నాయుమాదేవి యిచ్చిన ప్రత్యుత్తరము నీమంత్రము దెలియపరచుచున్నది.

**1.**

శ్రు॥ సా బ్రహ్మేతి హోవాచ
బ్రహ్మణో వా ఏతద్విజయే
మహీయధ్వమితి తతో హైవ
విదాఞ్చకార బ్రహ్మేతి॥ ౧॥

సా — స్త్రీరూపముగాఁ గనఁబడు విద్యాస్వరూపియగు పార్వతియైన లక్ష్మి

బ్రహ్మ, ఇతి — (కనఁబడి, యంతర్ధానమును బొందినట్లు చెప్పితివే ఓ ఇంద్రా! అదేమనుకొంటివి?) అదే పరబ్రహ్మము సుమీ, అని

| | |
|---|---|
| ఉవాచ | (బ్రహ్మవిద్యాస్వరూపియగు దేవి) పలికెను. |
| బ్రహ్మణః, వా | బ్రహ్మముదిగానే యుండు |
| ఏతద్విజయే | పైనఁజెప్పఁబడిన యసురవిజయమందు |
| (యూయమ్) | మీరు |
| మహీయధ్వమ్ | (నిమిత్తమాత్రముగనుండి) మహిమను బొందితిరి గనుక నీజయము మీదిగాఁదలఁచి. గర్వమును గాని, మిథ్యాభిమానమునుగాని పొందవలదు. |
| ఇతి | ఈప్రకారముగా |
| (ఇన్ద్రః) | ఇంద్రుఁడు |
| తతః, హ, ఏవ | ఆ యుమాదేవియొక్క వచనముచేతనే |
| బ్రహ్మ, ఇతి | (కనఁబడి యంతర్ధానమును బొందిన యక్షరూపము) పరబ్రహ్మమని. |
| విదాఞ్చకార | తెలిసికొనెను. |

తాత్పర్యము.

ఆకాశమునందు స్త్రీరూపముగాఁ గనఁబడిన మహాలక్ష్మీ స్వరూపురాలగు నుమాదేవి, తన్ను స్తోత్రము చేయుచున్నవాఁడును, కనఁబడి యంతర్ధానమునొందిన బ్రహ్మమును దెలియ నాసక్తిగలవాఁడునగు నింద్రునిఁగూర్చి, ఓ యింద్రుఁడా! నీవు చూచుచుండఁగానే తిరోధానముఁబొందిన యాభూతము బ్రహ్మమనుమీ. దేవతలకును నసురులకును నడచిన యుద్ధమునందు దేవతలు నిమిత్తమాత్రముగ నుండిరే కాని జయమంతయు నీ పరబ్రహ్మముదే. దానినిదెలుసుకొనక, తమదేయని గర్వించి యుండినందున, యాగర్వమునుబోఁగొట్టి పరబ్రహ్మస్వరూప పరిజ్ఞానముఁగలుగఁ జేయుటకు నావిర్భవించెను. అప్పుడు దేవత లగ్నిని, వాయువును బంపఁగా, వారికి గర్వభంగముగావించియు, పరబ్రహ్మస్వరూపమునుదెలిసికొనక పోయినందున, వారలకందఱికిని నీచే నాపరబ్రహ్మస్వరూపమునుదెలియఁజేసి, జయవిషయముగాఁ గలిగినసకలవిజయములు పరబ్రహ్మముదేగాని, యాదేవతలదిగాదని యనుభవముగాఁ దెలియఁజేయుటకొఱకే గర్వమును బొంది యుండిన యగ్నివాయువుల యెదుట

నుక్కాగట్టిపోయినుట్టెది, వారియొక్క యావచ్ఛక్తిచేతను గదలింపశక్యముగానట్లు చేసెను. కాఁబట్టి ప్రపంచమందుండు సమస్తములును పరబ్రహ్మశక్తియేగాని, వేఱు గాదు. మనదే యని తలంచితిమేని, యగ్ని వాయువులవలె యవమానపడవలసి వచ్చునే గాని మనము దలఁచినట్లు నెఱవేర్చుకొనఁజాలము, గనుక, మనము చేయునట్టి యన్నిపనులును నాపరబ్రహ్మముదే యనియు, అట్టిపనులచేఁ గలుగు సుఖదుఃఖములు మనవి కావనియు నుందువారికే యాపరబ్రహ్మ స్వరూపానుభవము గలుగుననియు, నుమాదేవి చెప్పిన వాక్యములచేఁదెలిసికొనెను.

---

౨ - మంత్రము.

## అవతారిక.

ఇంద్రుఁడు లక్ష్మీదేవి మూలముగాఁ బరబ్రహ్మమును దెలిసికొనిన పిమ్మట నడచిన సంగతులను గూర్చి యీమంత్రము చెప్పుచున్నది.

## 2.

శ్రు॥ తస్మాద్వా ఏతే దేవా అతితరా మివాన్యాన్దేవాన్ య
దగ్నిర్వాయురిన్ద్రస్తే హ్యేన న్నేదిష్ఠం పస్పృశుస్తే
హ్యేనత్ ప్రథమో విదాఞ్చకార బ్రహ్మేతి॥

| | |
|---|---|
| తస్మాత్, వా | (అగ్నియు, వాయువును బ్రహ్మముయొక్క సమీపమునకు వెళ్లి సమ్భాషించినగౌరవమును బొందిరి. ఇంద్రుఁడు లక్ష్మీదేవివాక్యములచే బ్రహ్మనిర్ణయమును దెలిసికొనెను.) ఆకారణమువల్లనే, |
| ఏతే, దేవాః | ఈయగ్ని, వాయువు, ఇంద్రుఁడు మొదలగుదేవతలు |
| అన్యాన్, దేవాన్ | ఇతరదేవతలను |
| అతితరామ్, ఇవ | శక్తిగుణైశ్వర్యములచేనతిక్రమించినవారివలెనున్నారు |
| యత్ | ఏకారణమువలన, |
| అగ్నిః | అగ్నియు, |
| వాయుః | వాయువును, |

| | |
|---|---|
| ఇన్ద్రః | ఇంద్రుఁడును |
| నేదిష్ఠమ్ | అతిసామీప్యముననుండు |
| ఏనత్ | ఈ బ్రహ్మమును |
| పస్పృశుః | లెస్సఁగా నుత్తరప్రత్యుత్తరములచే స్పృశించిరో, |
| తే, (ఇన్ద్రాదయః) హి | (ఆకారణమువలన) ఆ యింద్రాదిదేవతలే |
| ఏనత్ | ఈయక్షరూపముదాల్చిన బ్రహ్మస్వరూపమును |
| ప్రథమః | మొట్టమొదట |
| బ్రహ్మ, ఇతి | పరబ్రహ్మమని |
| విదాఞ్చకార | తెలిసికొనిరి. |

---

తాత్పర్యము.

పరబ్రహ్మము యక్షరూపమును దాల్చినప్పుడు, అగ్నియు, వాయువును ప్రథమమున దేవతలచేఁ బంపఁబడి యాబ్రహ్మముయొక్క సమీపమునకు వెళ్లి, దానితో సంభాషించిన గౌరవమునుబొందిరేకాని, దానిని బరబ్రహ్మస్వరూపమని తెలిసికొనలేక పోయిరి. తరువాత దేవత లింద్రునిఁ బంపఁగా వాఁడు దగ్గరకుఁ బోవుటకు మునుపే యంతర్ధానమును బొందినందువలన నాస్వరూపమును, తనయొక్క యిష్టదేవతయైన లక్ష్మియగు నుమాదేవినిధ్యానించుచుండునప్పుడు యక్షరూపముదాల్చిన బ్రహ్మముం డిన యాకాశమునందే యాలక్ష్మీదేవి స్త్రీరూపముగాఁగనఁబడి, యింద్రునకు నాయక్షరూపమును బయలుపరచిన మూలముగా నాబ్రహ్మ నిర్ణయము నింద్రుఁడు దెలిసికొనెను. ఇట్టికారణములచే నగ్ని, వాయువు, ఇంద్రుఁడు మొదలగు దేవత లితరదేవతలకన్న నైశ్వర్యము, శక్తి, మొదలగువాటిలో నధికులైరి. అగ్ని, వాయువును, బ్రహ్మమునుసమీపించి, యాబ్రహ్మముతోసంవాదముచే స్పృశించుటచేతను, ఇంద్రుఁడు లక్ష్మీదేవిమూలముగా నాబ్రహ్మమును దెలిసికొని, యగ్నికిని, వాయువునకు నాబ్రహ్మస్వరూపమును దెలియఁజేసినందున నితరదేవతలకన్న వీరు మొట్టమొదట బ్రహ్మమును దెలిసికొనినవారలైరి.

---

## అవతారిక.

ప్రథమమునందు నగ్ని, వాయువు, బ్రహ్మముయొక్క సమీపమునకు వెళ్లి దానితో మాటలాడినప్పటికిని అప్పుడు తాము మాటలాడినది బ్రహ్మముతోనని తెలిసికొనలేదు. తరువాత నింద్రుఁడు వెళ్లి లక్ష్మీమూలముగాఁ దాను బ్రహ్మమును దెలుసుకొని యగ్నికిని, వాయువునకును జెప్పినాఁడు గనుక వారలకన్న నింద్రునికిఁగల శ్రేష్ఠత్వము నీమంత్రము తెలియఁజేయుచున్నది.

## 3.

శ్రు॥ తస్మా ద్వా ఇంద్రోఽతితరా
మివాన్యాన్ దేవాన్ స హ్యేన
న్నేదిష్ఠం పస్పర్శ స హ్యేనత్
ప్రథమో విదాఞ్చకార బ్రహ్మేతి ॥

| | |
|---|---|
| తస్మాత్, వా | (ఇంద్రుఁడు ప్రథమమున లక్ష్మీదేవిమూలముగా బ్రహ్మమును తెలిసికొనినపిదప నగ్నికిని, వాయువునకును జెప్పెను.) ఆకారణమువల్లనే |
| ఇన్ద్రః | ఇంద్రుఁడు |
| అన్యాన్, దేవాన్ | అగ్ని, వాయువు మొదలగు నితరదేవతలను |
| అతితరామ్, ఇవ | అతిక్రమించినవాఁడువలె(నున్నాఁడు.) |
| సః, హి | ఆయింద్రుఁడే |
| నేదిష్ఠమ్ | సమీపించియుండు |
| ఏనత్ | ఈపరబ్రహ్మస్వరూపమును |
| పస్పర్శ | (దేవియొక్క యుపదేశమువలనఁ దనకుఁ గలిగిన స్వానుభవముచే) తాఁకెను. (అనఁగాఁ దన యందే తెలిసికొనెను.) |
| | ఆయింద్రుఁడే |
| | ఈమహాభూతస్వరూపమును |

| | |
|---|---|
| బ్రహ్మ, ఇతి | పరబ్రహ్మస్వరూపమని |
| ప్రథమః | అంగీకరించుముందే |
| విదాంచకార | తెలిసికొనెను. |

---

తాత్పర్యము.

ఇదివఱకుఁ జెప్పఁబడిన అగ్ని, వాయువు మొదలగు వారిలో నింద్రుఁడు ముఖ్యమయినవాఁడుగాఁ జెప్పఁబడుచున్నాఁడు. ఏలననిన, గొప్పస్వరూపముఁ దాల్చివచ్చిన పరబ్రహ్మస్వరూపమును ధ్యానించినందునను, లక్ష్మీదేవి యగు నుమాదేవివలన నాబ్రహ్మమును లెస్సగాఁదెలిసికొనెను. అగ్ని, వాయువు, వీరలన్ననో, దేవతలచేఁ బంపఁబడి గర్వముతో నాగొప్పభూతము వద్దకు వెళ్లి, గర్వభంగముగలవారై మఱలిరేకాని, యాబ్రహ్మమును దెలిసికొనలేదు. అయితే తెలిసియో, తెలియకయో, యాబ్రహ్మముతో మాట్లాడినమహిమను జెందిరి. అట్టియగ్ని, వాయువులకు నింద్రుఁడు దాను దేవతాముఖముగాఁ దెలిసికొనినబ్రహ్మము నుపదేశించెను గనుక, అగ్నివాయువులకన్న నింద్రుఁడు ప్రథమమున బ్రహ్మమును దెలిసికొన్నవాఁడాయెను.

బ్రహ్మవిష్ణురుద్రులు ముగ్గురు నొక్కటియేయనుటకును, గనుక నేసరస్వతి, లక్ష్మి, పార్వతి, యొక్కటియేయనుటకును శ్రుతిప్రమాణము. ఇయ్యవి శుకమహర్షి తనతండ్రి యగు వ్యాసుల నడిగినప్పుడును, యీశ్వరుఁడే శుకమహర్షి కుపదేశించినఘట్టమందును జెప్పఁబడినవాక్యములు. అవి యేవి యనిన:—

శ్లో॥ యే నమస్యన్తి గోవిన్దం తే నమస్యన్తి శఙ్కరమ్।
యేఽర్చయన్తి హరిం భక్త్యా తేఽర్చయన్తి వృషధ్వజమ్॥
యే ద్విషన్తి విరూపాక్షం తే ద్విషన్తి జనార్దనమ్,
యే రుద్రం నాభిజానన్తి తే న జానన్తి కేశవమ్॥
రుద్రాత్ప్రవర్తతే బీజం బీజయోని ర్జనార్దనః।
యో రుద్ర స్స స్వయం బ్రహ్మా యో బ్రహ్మా స హుతాశనః॥
బ్రహ్మ విష్ణుమయో రుద్ర అగ్నీషోమాత్మకం జగత్।
పుల్లిఙ్గ సర్వ మీశాన స్త్రీలిఙ్గ భగవ త్యుమా॥

ఉమా రుద్రాత్మికాః సర్వాః ప్రజాః స్థావరజఙ్గమాః।
వ్యక్తం సర్వ ముమారూప మవ్యక్తం తు మహేశ్వరః॥
ఉమాశఙ్కరయో ర్యోగః స యోగో విష్ణు రుచ్యతే।
య స్తు తస్మై నమస్కారం కుర్యా ద్భక్తిసమన్వితః॥
ఆత్మానం పరమాత్మాన మన్తరాత్మాన మేవ చ।
జ్ఞాత్వా త్రివిధ మాత్మానం పరమాత్మాన మాశ్రయేత్॥
అన్తరాత్మా భవే ద్బ్రహ్మా పరమాత్మా మహేశ్వరః।
సర్వేషా మేవ భూతానాం విష్ణు రాత్మా సనాతనః॥
అస్య త్రైలోక్యవృక్షస్య భూమావిటపశాఖినః।
అగ్రం మధ్యం తథా మూలం విష్ణు బ్రహ్మా మహేశ్వరాః॥
కార్యం విష్ణుః క్రియా బ్రహ్మా కారణం తు మహేశ్వరః।
ప్రయోజనార్థం రుద్రేణ మూర్తి రేకా త్రిధా స్థితా॥
ధర్మో రుద్రో జగ ద్విష్ణుః సర్వ జ్ఞానం పితామహః।
శ్రీబ్రహ్మ విష్ణురుద్రేతి య స్తం బ్రూయా ద్విచక్షణః॥
కీర్తనా త్సర్వదేవస్య సర్వపాపైః ప్రముచ్యతే।
రుద్రో నర ఉమా నారీ తస్మై తస్యై నమో నమః॥
రుద్రో బ్రహ్మ ఉమా వాణీ తస్మై।
రుద్రో విష్ణు రుమా లక్ష్మీః తస్మై॥
రుద్ర స్సూర్య ఉమా ఛాయా తస్మై।
రుద్ర స్సోమ ఉమా తారా తస్మై॥
రుద్రో దివా ఉమా రాత్రిః తస్మై।
రుద్రో యజ్ఞ ఉమా వేదీ తస్మై॥
రుద్రో వహ్ని రుమా స్వాహా తస్మై।
రుద్రో వేద ఉమా శాస్త్రం తస్మై॥
రుద్రో వృక్ష ఉమా వల్లీ తస్మై।
రుద్రో గన్ధ ఉమా పుష్పం తస్మై॥

రుద్రోఽర్థ అక్షర స్సోమా తస్మై ।
రుద్రో లిఙ్గ ఉమా పీఠం తస్మై ॥

బ్రహ్మాణో జలమధ్యేతు సర్వపాపైః ప్రముచ్యతే ।
సర్వాధిష్ఠాన మద్వన్ద్వం పర బ్రహ్మ సనాతనమ్ ॥
సచ్చిదానన్దరూపం త ద వాఙ్మానసగోచరం ।
తస్మిన్ సువిదితే సర్వం విజ్ఞాతం స్యా దిదం శుక ! ।
తదాత్మకత్వా త్సర్వస్య తస్మా ద్భిన్నం న హి క్వచిత్ ॥

---

తాత్పర్యము.

ఎవ్వారలు గోవిందుని నమస్కరించు చున్నారో, వారు శంకరుని నమస్కరించుచున్నారు. ఎవ్వారలు శ్రీహరిని భక్తితోఁ బత్రపుష్పములచేత నర్చనచేయుదురో, వారు వృషభా రూఢుఁడగు నీశ్వరుని యర్చన చేసినవా రగుదురు. ఎవ్వారలు విరూపాక్షుఁడుగనుండు నీశుని ద్వేషించు చున్నారో, వారు జనార్దనుని ద్వేషించినవారగుదురు. ఎవరు రుద్రునిఁదెలిసికొనలేరో, వారలు కేశవునిఁదెలిసికొనలేరు. రుద్రునిచే బీజము ప్రవర్తించుచున్నది. ప్రవర్తించినపిమ్మట సంరక్షణచేయునది జనార్దనుఁడనఁబడును. ఎవ్వఁడురుద్రుఁడో, వాఁడేబ్రహ్మగానున్నాఁడు. ఎవ్వఁడుబ్రహ్మయో, వాఁడే సకలమునుభక్షించుచుహుతాశనుఁడుగనున్నాఁడు. ఏరుద్రుఁడుబ్రహ్మవిష్ణుస్వరూపుఁడుగ నున్నాడో, వాఁడే యగ్ని సోములయొక్క స్వరూపమైన జగత్స్వరూపిగనున్నాఁడు. పురుష స్వరూపముగనుండు నవన్నియు నీశ్వరస్వరూపమనియు, స్త్రీరూపముగానుండు సమస్తము నుమాస్వరూపమనియు, స్థావర జంగమ రూపములుగానుండు సమస్తమును ఉమా రుద్రస్వరూపములే యనియుఁ దెలిసికొనుము. నేత్రము మొదలగునింద్రియములకు గోచరవస్తువులన్నియును మాస్వరూపములనియు,ఇంద్రియగోచరముగానిది మహేశ్వరస్వరూపమనియుఁ దెలిసికొనుము. ఇట్లు సమస్తము నుమాశంకరస్వరూపముగాఁజూచు సమబుద్ధియనెడి యోగమే విష్ణుయోగమనఁబడును. గనుకనే మహావిష్ణువును మహాభక్తితో నమస్కరింపవలయును. ఆ మహా విష్ణుస్వరూపమే, యాత్మయనియు, పరమాత్మయనియు, యంతరాత్మయనియు మూఁడు తెఱఁగులై యుండును. వానిలోఁ బ్రహ్మమే యంతరాత్మ యనఁబడును. ఈశ్వరుఁడే పర

మాత్మ; సకలభూతములయందు మహావిష్ణువే యాత్మ. ఈ మాటనే, సృష్టికర్తయగు బ్రహ్మయనియు, సంరక్షణకర్తయగు విష్ణువనియు, సంహారకర్తయగు రుద్రుఁడనియు, చెప్పుదురు. వీరిలో సృష్ట్యాది క్రియారూపమే బ్రహ్మయనియు, కార్యముగాఁగనఁబడునట్టి జగత్తే విష్ణువనియు నీరెండును లయించుకారణము మహేశ్వరుఁడనియు శిష్యునియొక్క యాత్మానాత్మ వివేక ప్రయోజనముకొఱకు నీయొకేవస్తువు మువ్విధములుగానున్నదని తెలిసికొనుము. సకలమును లయింపఁజేయునది రుద్రుండనియు, జగత్స్వరూపము విష్ణువనియు, సమస్తముయొక్క జ్ఞానమే బ్రహ్మస్వరూపమనియు, నెవ్వరు సకలస్వరూపిగానుండు శ్రీమన్నారాయణమూర్తిని "శ్రీ బ్రహ్మ, విష్ణు, రుద్రేతి" అని పరిశుద్ధముగా నుచ్చరించుచున్నారో, వారు సకలపాపములనుండి విడువఁబడుచున్నారని తెలిసికొనుము. ఆ శ్రీమన్నారాయణమూర్తియే యెట్లు సమస్త రూపిగా నున్నాఁడు? ఎట్లు నమస్కరించుట? అని యడిగెదవేమో, చెప్పెదవినుము. పురుషస్వరూపములనన్నిటిని రుద్రస్వరూపమనియు, స్త్రీస్వరూపములనన్నిటిని నుమాస్వరూపమనియుఁదలంచుకొని, నమస్కరింపుము. మహావిష్ణువే రుద్రస్వరూపమనియు, లక్ష్మియే యుమా స్వరూపమనియు, బ్రహ్మయే రుద్రస్వరూపమనియు, వాణిని నుమాస్వరూమనియు, సూర్యుని రుద్రస్వరూపమనియు, ఛాయ నుమాస్వరూపమనియు, చంద్రుని రుద్రస్వరూపమనియు, తార నుమాస్వరూపమనియు, పగటిని రుద్రస్వరూపమనియు, రాత్రి నుమాస్వరూపమనియు, యజ్ఞమును రుద్రస్వరూపమనియు, వేది నుమాస్వరూపమనియు, నగ్నిని రుద్రస్వరూపమనియు, నగ్నియందు వేయఁబడుపదార్థము నుమాస్వరూపమనియు, వేదమును రుద్రస్వరూపమనియు, శాస్త్రముల నుమాస్వరూప మనియు, వృక్షములను రుద్ర స్వరూప మనియు, తీఁగెల నుమా స్వరూపమనియు, గంధమును రుద్రస్వరూపమనియు, పుష్పము నుమాస్వరూపమనియు, నర్థమును రుద్రస్వరూపమనియు, అక్షరముల నుమాస్వరూపమనియు, లింగమును రుద్రస్వరూపమనియు, పీఠము నుమాస్వరూపమనియుఁదలఁచి నమస్కారముఁజేయుము. ఇట్లు సకలమును రుద్రోమాస్వరూపములుగాఁదలఁచి నమస్కరించినయెడల సకలపాపములనుండి విడువఁబడుదువు. ఇట్లు పాపరహితుఁడైన పిమ్మట సమస్తమున కధిష్ఠానమైనదియు, ప్రాచీనమైనదియు నగు బ్రహ్మమును, సచ్చిదానంద స్వరూపునిగాను, నవాఙ్మానసగోచరముగాను నుండునదియని తెలిసికొనుము. ఇట్లు ఆ బ్రహ్మ

మును సద్గురుముఖముగాఁదెలిసికొని స్వానుభవమును జెందినవాఁ డన్నిటినిఁదెలుసు కొన్నవాఁడగును. ఇట్లు తెలుసుకొన్నవాఁడు బ్రహ్మస్వరూపియే యగును. కావున వాఁడే సమస్తముగను, సమస్తమును దానుగానుండును. ఇందుకు భిన్నమైనది వే ఱొక్కటియు లేదు. గనుక నిదియే మోక్షము; ఇదియేముక్తి; ఇదియే రహస్యము సుమీ. దీనిని నీకుఁజెప్పితిని. అని తండ్రియగు వ్యాసులచేఁ బ్రార్థింపఁబడి ప్రత్యక్షమై వ్యాసపుత్త్రులగు శుకమహర్షి కుపదేశించిన జగదీశ్వరుఁడును, మహానారాయణము రుద్రహృదయము అను నుపనిషన్మూలముగఁ జెప్పియున్నారు గనుక నిదియే సర్వ సమత్వబుద్ధికిని, తన్మూలముగా యథార్థజ్ఞానమునకును సాధనమగునని తెలియునది.

---

## ౪ - మంత్రము.

### అవతారిక.

ద్వితీయఖండము కడపటి మంత్రమగు నైదవమంత్రమునందు, నీవీజన్మములోనే పరబ్రహ్మమును దెలిసికొనక పోయినయెడల, నీకు మిక్కిలి గొప్పదగు నష్టము సంభ వించునని యుపదేశించితినిగదా? ఓ శిష్యుఁడా!, ఆపరబ్రహ్మమే సుమీ, యిప్పుడు లక్ష్మియగు నుమాదేవిచే నింద్రునికిని, నాయింద్రునిచే నగ్ని, వాయువులకును చెప్పఁ బడినది. ఇట్లు పరంపరగా వచ్చినదే సుమీ యీ బ్రహ్మవిద్య. దానినే నీకిప్పుడు నే నుపదేశించుచున్నాను సుమా. కాఁబట్టి లెస్సగా గమనించితెలిసికొనుము. అదే మియనఁగా:—

**4.**

శ్రు॥ తస్యైష ఆదేశో య దేత ద్విద్యుతో వ్యద్యుతదా 3 ఇతీ న్యమీమిష దా3ఇ త్యధిదైవతమ్॥ ౪॥

తస్య — (ఇంద్రుఁడు చూచి తెలిసికొనుటకై సమీపమునకు వచ్చునంతలో నంతర్ధానము నొందిన యా యక్షరూపము దాల్చిన) యా పరబ్రహ్మము యొక్క

ఆదేశః — ఉపదేశము

| | |
|---|---|
| ఏషః | (ఇఁకమీఁద నుపమానములతోఁ జెప్పఁబడునదేది యో, అది యిదిగానున్నది. |
| యత్ | (శాస్త్రములచేతను, సద్గురువులచేతను జెప్పఁబడి ప్రసిద్ధమైన) యే బ్రహ్మస్వరూపము గలదో, |
| ఏతత్ | ఆ చెప్పఁబోవు బుద్ధికి సాక్షియగు నీ స్వరూపము |
| విద్యుతః, * ఆ, * (ఇవ) | మెరుపు మెరసినతోడనే హఠాత్తుగా కండ్లుమూయునట్లు యెచ్చటను వ్యాపించియుండు దట్టముగాఁ బ్రకాశించునట్లు |
| వ్యద్యుతత్, ఇతి | అనేకకోటి మెఱుపులవలె స్వయం ప్రకాశముగఁ బ్రకాశించి చాటైనదనియు |
| (చక్షుః, నిమేషమ్, ఆ,) | నేత్రము మూసికొనినట్లు |
| న్యమీమిషత్, ఇతి | మూసికొనెననియు |
| అధిదైవతమ్ | (దైవతా న్యధికృత్య భవతీత్యధిదైవతమ్=దేవతలను గురించి చెప్పునది యధిదైవత మనఁబడును.) దేవతలకొఱకు బ్రహ్మముయొక్క యుపమానములు చెప్పఁబడినవి. (అనఁగా నింద్రునికి బ్రహ్మోపదేశము చేయఁదలఁచి, దేవిచే మెఱుపును కండ్లరెప్పవాల్చుటయును నుపమానములుగాఁ జెప్పఁబడినది.) |

---

తాత్పర్యము.

మహాలక్ష్మియగు నుమాదేవి యింద్రునికిఁ బ్రథమముగా నీబ్రహ్మవిద్య నుపదేశించెను. పిదప యింద్రుఁ డగ్నికిని, వాయువునకు నుపదేశించెను. ఇట్లు పరంపరాక్రమముగా నీబ్రహ్మవిద్యయుపదేశింపఁబడుచువచ్చుచున్నది. ఈబ్రహ్మస్వరూపము దేవిచే నింద్రునికేవిధముగా నుపదేశింపఁబడెనని యడిగెదవే మో శిష్యుఁడా! చెప్పెదవినుము.

మొట్టమొదట నీయింద్రుఁడా యక్షరూపమును ధరించిన పరబ్రహ్మమువద్దకుఁ బోఁదలఁచియుండునప్పు డది చాటయ్యెను. అట్లు చాటైనబ్రహ్మముయొక్క యుప

దేశ మిఁక నుపమానములతోఁ జెప్పఁబడును. ప్రాణులు జననమరణప్రవాహమునుండి లేఁచుటకొఱకు గురువులచేతను, శాస్త్రములచేత నుపదేశింపఁబడిన బుద్ధికిసాక్షియగు నీబ్రహ్మస్వరూపము మెరుపుమెరసినతోడనే యొక్కమాఱు వ్యాపించి కన్నులు చెద రఁదగిన ప్రకాశము గలిగి క్షణములోనే చాటగునట్లు అనేకకోటి మెఱుపులవలె నా యక్షరూపముదాల్చిన బ్రహ్మస్వరూపముప్రకాశించెననియు, రెప్పవాల్చు నంతలో చాటైనదే(మఱుఁగైనదే) బ్రహ్మమనియు నుమాదేవియింద్రునకుపదేశించెనని తాత్ప ర్యము.

---

౫ - మంత్రము.

## అవతారిక.

ఎట్లు బ్రహ్మసాక్షాత్కార మగునను వివరమును, అందుకు సాధనము నీమం త్రము దెలియఁజేయుచున్నది.

## 5.

అథాధ్యాత్మం యదేత ద్గచ్ఛతీవచ
మనోఽనేనచైత దుపస్మర త్యభీక్ష్ణం సఙ్కల్పః ॥

| | |
|---|---|
| అథ | (ఆయింద్రునికి దేవి బ్రహ్మస్వరూపము నుపమానముల చేత నుపదేశించిన)పిమ్మట. |
| అధ్యాత్మమ్ | (ఆత్మని=అధికారిదేహే,ఆత్మోపదేశమునకు సర్వ త్వమునుబొందిన శరీరమునందు; అధి= ఉరరీ కృత్య ఉచ్యమానముపదేశః, అంగీకరించిచెప్పఁ బడునుపదేశము అధ్యాత్మమనఁబడును. అనఁ గా దేహమను నుపాధి ననుసరించి యుండెడి యాత్మస్వరూపమునకుఁబ్రత్యగాత్మయని పేరు. అట్టి)ప్రత్యగాత్మయగు |
| యత్, ఏతత్ | ఏయీబ్రహ్మస్వరూపమును (ప్రకృతమందు జ్యోతి స్స్వరూపముగాఁగనఁబడిన బ్రహ్మముంగూర్చి) |
| మనః | మనస్సు |

| | |
|---|---|
| గచ్ఛతి, ఇవ,చ | పొందునట్లున్నది. (అనఁగా నట్లుచింతన చేయవలసినది. చకారమువలన మనసునే బ్రహ్మస్వరూపముగనెంచి ధ్యానము చేయవలయుననియెఱుంగుము. కనుక స్వయంజ్యోతి స్స్వరూపముగు పరమాత్మయే మనస్సుగ నున్నట్లు ధ్యానించ వలయును.) |
| మనసః | అంతఃకరణముయొక్క |
| సఙ్కల్ప | (సమ్యక్, కల్ప్యంతే, (కామాః = మోక్షాపేక్షాః) అనేనేతిసంకల్పః=మోక్షాపేక్షయందు మనసును లెస్సగాఁ బ్రవేశపెట్టుటయను) సంకల్పము |
| అభీక్ష్ణమ్ | (పరమాత్మవిషయమందు పూర్వజన్మకృత పుణ్యపరిపాకమువలనను, నీజన్మమందుఁ జేయు సత్సంగములవలనను సంభవించిన పుణ్యక్రియలచేతను) అడుగడుగునకు (ఎడతెగక పరమాత్మధ్యానములోనేమనసును నిలుపవలసినది.) |
| ఏతత్ | ఈబ్రహ్మస్వరూపమును |
| అనేన,చ | ఈమనస్సుచేతనే |
| ఉపస్మరతి | (మందబుద్ధిగలవారలుగూడసగుణముగా యమనియమాద్యష్టాంగయోగా భ్యాసముచే) ధ్యానింపవలసినది. |

---

## తాత్పర్యము.

ఉమాదేవి స్వయంజ్యోతి స్స్వరూపముగనుండు బ్రహ్మమును యింద్రునికి నుపమానములతో నుపదేశించినపిమ్మట నాయింద్రుఁడు యితరదేవతలకుపదేశించినది యిట్లనియే. ఓదేవతలారా! ఆత్మోపదేశమున కర్తృత్వమునుబొందిన శరీరము నంగీకరించి చెప్పఁబడునట్టి యుపదేశ మధ్యాత్మమనఁబడును. అనఁగా దేహమను నుపాధి ననుసరించి యుండెడి స్వరూపమునకుఁ బ్రత్యగాత్మయని పేరు. అటువంటి ప్రత్యగా

త్మ స్వరూపమగు స్వయంజ్యోతియైన పరమాత్మను మనసుచెందినట్లు ధ్యానింపవలయును. ఇట్టిధ్యానము పూర్వజన్మకృత పుణ్యపరిపాకము వలనను, నీజన్మమందుఁ జేయఁబడు సత్సాంగత్యమువలనను, అట్టిసత్సాంగత్యము వలన సద్గురువును జెంది యనుష్ఠింపఁబడు సత్క్రియలవలనను,పలుమాఱు ప్రతిక్షణమందు నాపరమాత్మయందే నిలుపుట యను నిష్ఠ గలుగును. ఇట్లు చేయుట కసమర్థులగు మందబుద్ధిగలవారలు యమ, నియమ, ఆసన, ప్రాణాయామ, ప్రత్యాహార, ధారణ, ధ్యాన, సమాధి మొదలగునష్టాంగ యోగముల నభ్యసించుటవలన మనస్సును వశపఱచుకొని పరమాత్మయందు నిలుపవలసినది.

## అష్టాంగ యోగముల స్థూలవివరము.

1. యమము
2. నియమము
3. ఆసనము
4. ప్రాణాయామము
5. ప్రత్యాహారము.
6. ధారణ.
7. ధ్యానము.
8. సమాధి.

యమము పదివిధములైనది.

(యమః=యచ్ఛతి పాపాత్ సాధు)

శ్లో॥ యమోయమ ఇతిశ్రుత్వా వృథావ్యుద్విజతే జనః।
ఆత్మా చ యమితో యేన నతస్యైవ యమ స్మృతః॥
యమైశ్చ నియమైశ్చైవ యఃకరోత్యాత్మసంయమం।
సచదృష్ట్వా తు మాంయాతి పరం బ్రహ్మ సనాతనమ్॥
అంహిసా సత్య మస్తేయం బ్రహ్మచర్యం దయాఽఽర్జవం।
క్షమా ధృతి ర్మితాహారః శౌచం చైవ యమా దశ॥

(1) అహింస యనఁగా, మనోవాక్కాయములచే సమస్తభూతములకు ననావశ్యకమైన వ్యసనము గలుగఁజేయకుండుట.

భగవద్గీతా, అ-౧౦. శ్లో-౫. అ-౧౩. శ్లో-౮. అ-౧౬. శ్లో-౨.

(2) సత్యమనఁగా,మనోవాక్కాయములచే సమస్తభూతములకు హితములుగను యథార్థములుగ నుండు వచనములఁబలుకుట.

భగవద్గీతా, అ-౧౦. శ్లో-౪. అ-౧౬. శ్లో-౨. అ-౧౭. శ్లో-౧౫.

(3) అస్తేయమనఁగా, మనోవాక్కాయములచేఁబరద్రవ్యమునందు నిస్స్పృ
హ. భగవద్గీతా. అ. ౬. ౧౦. వ. శ్లోకమున, "నిరాశీరపరిగ్రహః" అని ౪ వ. పాద
ముచేఁజెప్పఁబడియున్నది.

(4) బ్రహ్మచర్యమనఁగా, స్త్రీలను విషయాసక్తులతో మాత్రము తలంప
కుండుటయు, భిక్షాన్నముచే జీవించుటయు, గురుశుశ్రూష చేయుటయు, బ్రహ్మవిచా
రణ చేయుటమొదలగునవి. భగవద్గీతా, అ-౬. శ్లో-౧౪. అ-౧౭. శ్లో-౧౪.

(5) దయ యనఁగా, సమస్తభూతములయందు ననుగ్రహముంచుట.

భగవద్గీతా, అ-౧౬. శ్లో-౨.

(6) ఆర్జవమనఁగా, మనోవాక్కాయములచే విహితావిహితములైన వారల
యందుఁ బ్రవృత్తి నివృత్తి రెండింటిలోను నొక్కవిధముగా నుండుట.

భగవద్గీతా, అ-౧౩. శ్లో-౮.

(7) క్షమయనఁగా, ప్రియాప్రియవస్తువులయందును, దన్నుఁబొగడు వారల
యందును, లేక, దూషించువారలయందును మనోవికారము పొందకుండనణఁచుట.

భగవద్గీతా, అ-౧౦. శ్లో-౪.

(8) ధృతియనఁగా, ద్రవ్యనష్టము సంభవించినప్పుడును, తనపుత్ర, మిత్ర,
కళత్రాదుల వియోగకాలమందును, మనసును చలింపనీయకయుంచు ధైర్యము.

భగవద్గీతా, అ-౧౧. శ్లో-౨౪. అ-౧౮. శ్లో-౨౬, ౩౩, ౩౪, ౩౫, ౫౧.

(9) మితాహారమనఁగా, తైలసంబంధమైనదియు, మధురములగు భోజనము
లనుసగము కడుపునకు భుజించి, నీటిచే పాతికభాగమును వాయుసంచారణార్థము
వదలుట. భగవద్గీతా, అ-౬. శ్లో-౧౭.

(10) శౌచమనఁగా, బాహ్యమనియు, అభ్యంతరమనియు రెండువిధములుగలది.
అందు శరీరమును మృత్తికోదకములచే శుద్ధిచేయుట బాహ్యమనియు, ఇంద్రి
యనిగ్రహ మాభ్యంతరమనియుఁ జెప్పఁబడును. రెండవది యగు నాభ్యంతరశుద్ధి
సద్గురువును జెంది, వారివద్ద నధ్యాత్మవిద్య నభ్యసించుటకు మొదటిమెట్టైయున్నది.

నియమము పదివిధములుగలది.

(నియమః—నియమ్యతే, అత్మా, అనేనేతి నియమః, ని, యమ్, అప్.)

శ్లో॥ తప స్సంతోష మాస్తిక్యం దాన మీశ్వరపూజనమ్।
సిద్ధాన్తశ్రవణ శ్చైవ హ్రీర్మతి శ్చజపో వ్రతమ్॥
దశైతే నియమాః ప్రోక్తాః యోగశాస్త్రవిశారదైః॥

(1) తపస్సనఁగా, శాస్త్రములచే విధింపఁబడి యుండెడిదేశాటనము, వ్రతము మొదలగువానిచే శరీరమును గృశింపఁజేయుట.
భగవద్గీతా, అ-౬. శ్లో-౪౬. అ-౭. శ్లో-౯. అ-౧౦. శ్లో. ౫. అ-౧౭. శ్లో-౧౬, ౧౭, ౧౮ అ. ౧౮. శ్లో-౫.

(2) సంతోషమనఁగా, తానుగా సంభవించిన వాటితోఁ దృప్తిని, తనకున్న మట్టుకుఁ దృప్తిని చెందియుండు మనస్థ్సితి.
భగవద్గీతా. అ. ౪. శ్లో-౨౨. అ౧౨. శ్లో౧౪. ౧౯.

(3) ఆస్తిక్యమనఁగా, వేదములచేవిధింపఁబడియుండెడి ధర్మాధర్మములయందుఁగల విశ్వాసము. భగవద్గీతా. అ. ౧౮. శ్లో. ౪౨.

(4) దానమనఁగా, న్యాయముగా నార్జింపఁబడిన ధనధాన్యాదులను, ద్రవ్యమును ధాన్యాదులంగలిగియుండు వారల కివ్వక యివి లేనివారలకును, ప్రతిగ్రహించిన వానిని సద్వినియోగముచేయువారలకును, ప్రతిగ్రహించువారల కావశ్యకమగుకాలమునందుఁ బ్రతిప్రయోజనము నపేక్షింపకయే యివ్వఁబడు క్రియారూపమైనది.
భగవద్గీతా, అ-౧౬. శ్లో-౧. అ-౧౭, ౨౦, ౨౧, ౨౨, ౨౫, అ-౧౮. శ్లో-౪౩.

(5) ఈశ్వరపూజనమనఁగా, నిష్కళంకమైన తెఱవఁబడిన మనస్సుతోఁ దనకుఁగల శక్తికొలఁది మహావిష్ణువును, ఈశ్వరునిఁ బూజించుట.

(6) సిద్ధాన్తశ్రవణమనఁగా, వేదాంతశ్రవణము.

(7) హ్రీయనఁగా, లౌకికబుద్ధిశాలులు దమకుఁదోఁచిన వన్నియు యుక్తము లేయనిదలఁచి చేయువేదవిరుద్ధములగు కర్మములయందుఁ గలుగవలసినలజ్జ.

(8) మతియనఁగా, వేదవిహితములగు కర్మములయందుశ్రద్ధ

(9) జపమనఁగా, వేదవిరుద్ధములుగానివియు, సద్గురువులచే నుపదేశింపఁబడినవియునగు మంత్రములను జపించుట. జపము వాచికము, మానసికము, అని రెండు తెఱఁగులుగలదై యున్నది.

అందు వాచికము మూఁడువిధములు.

(1) మంత్రములను బిగ్గరగాఁ జెప్పుట, ఇది డాంభికము గనుక ఫలము స్వల్పము.

(2) మెల్లనయుచ్చరించుట, ఇయ్యది డంభార్థముగా నుచ్చరించు మొదటిదానికన్న వేయిరెట్లధిక ఫలముగలది.

(3) నోటిలోపలనే యుచ్చరించుట, ఇది పైవాని రెంటికంటెను వేయిరెట్లధికఫలమునిచ్చును. మానసికమిదమే ధ్యానసాధనమనఁబడును, గనుక నిదియే యన్నిటికన్న శ్రేష్ఠమైనది.

(10) వ్రతమనఁగా, వేదములచే విధింపఁబడిన విధినిషేధములగు కర్మానుష్ఠానముల నియమము.

ఆసనవివరము.

ఆసనములలో నెనిమిది ముఖ్యములైనవి.

(ఆసనం = ఆస్యతే = ఉపవిశ్యతే ఽస్మిన్ ఇతి, అధికరణ ల్యుట్)

| | |
|---|---|
| 1 స్వస్తికాసనము | 5 సింహాసనము. |
| 2 గోముఖాసనము | 6 భద్రాసనము. |
| 3 పద్మాసనము | 7 ముక్తాసనము. |
| 4 వీరాసనము | 8 మయూరాసనము. |

వీటి వివరములను గురుముఖముగాఁ జూచి తెలిసికొనవలసినది.

ప్రాణాయామ వివరము.

(ప్రాణాయామః = ప్రాణస్య = వాయువిశేషస్య; ఆయామః = రోధః; యద్వా, ప్రాణ ఆయమ్యతే ఽనేనేతి వా ప్రాణాయామః, ఆ - యమ్ - ఘఞ్.)

ప్రాణాయామైర్దహేద్దోషాన్ ధారణాభిశ్చ కిల్బిషాన్।
ప్రత్యాహారేణ సంసర్గాన్ ధ్యానేనానీశ్వరాన్ గుణాన్॥

కనిష్ఠానామికాఙ్గుష్ఠై ర్యన్నాసాపుటధారణం।
ప్రాణాయామః సవిజ్ఞేయః తర్జనీమధ్యమేవినా॥

సద్వివిధః సగర్భః నిర్గర్భశ్చ.

సగర్భోమంత్రజాపేన నిర్గర్భో మాత్రయాభవేత్
మాత్రాచ ప్రణవస్య షోడశవారజపేన
వామనాసాపుటేన వాయుంపూరయేత్.
తస్యచతుష్షష్టివారజపేన వాయుంకుంభయేత్.
తస్యద్వాత్రింశద్వారజపేనవాయుంరేచయేత్.
పునర్దక్షిణేనాపూర్య ఉభాభ్యాం కుంభయిత్వా వామేన రేచయేత్.
పునర్వామేనాపూర్య ఉభాభ్యాం కుంభయిత్వా దక్షిణేన రేచయేత్

ఎడమముక్కు-రంధ్రముద్వారా పదునారుమారులు "ఓం" అను ప్రణవమునుచ్చరించుచు శ్వాసమునుపీల్చి, (అనఁగాఁ పూరకము చేసి) పిమ్మట నరువదినాలుగుమార్లు ప్రణవముల నుచ్చరించుచు సంతవఱకును శ్వాసమును లోపలనేనిలిపి (అనఁగాఁ కుంభకముఁజేసి) తుదకు ముప్పదిరెండుమారులు "ఓం" అను ప్రణవమునుచ్చరించుచు కుడిముక్కు-రంధ్రము ద్వారా శ్వాసమును మెల్లనవిడుచుట, (అనఁగా రేచకము చేయుట,) ఒక ప్రాణాయామాభ్యాసమును జేయవలసినది. దీనినిగూడ గురుముఖముగాఁదెలిసికొని గురువువద్దనుండి యభ్యసింపవలసినదిగాని పుస్తకములఁజదివి తానుగానేయభ్యసింపఁ బ్రారంభించినయెడల ననేక కష్టనష్టదుఃఖములు గలుగును. అనుభవశాలులయి లెస్సగా ననుభవించిన వారలయొద్దనుండియే తెలిసికొనవలసినదిగాని, వేషధారులు చెప్పుమాటలుమాత్రమువిని నడచినయెడల దుఃఖమే పర్యవసించుననునది యనుభవసిద్ధము.

## ప్రత్యాహార వివరము.

ప్రత్యాహార మ్మూడువిధములుగలదు.

(ప్రత్యాహారః = ప్రతి. ఆ. హృ-హరణే-ఘఞ్. స్వస్వ విషయేభ్య ఇన్ద్రియాకర్షణమ్.)

(1) విషయములలోవెళ్ళి సంచరించు నింద్రియములను బలాత్కారముగా నీడ్చి, సద్విషయములయందుఁ బ్రవేశపెట్టుట.

(2) పిమ్మట దేనిదేనినిఁ జూచుచున్నామో, వాటినన్నిటిని భగవత్స్వరూపముగాఁ జూచుట.

(3) ప్రతిదినమును మనము చేయవలసిన వర్ణాశ్రమకర్మములఁ దప్పక చేసి, తత్ఫలములయందు మనస్సును ప్రవేశింపనీయకుండుట.

(4) పాదము, అంగుష్ఠము, మనికట్టు, పిక్కలు, పెందొడలు, తొడలు, పృష్ఠము, (వీపు) ఉపస్థ, నాభి, హృదయము, కంఠము, మాచెయ్యి, తాలువులు, ముక్కు, కండ్లు, భ్రూమధ్యము, శిరస్సు, బ్రహ్మరంధ్రము యీపదునెనిమిది మర్మస్థానములయందు నారోహణావరోహణ క్రమముగా గురూపదేశ లక్ష్యప్రకారముంచుట.

ధారణా వివరము.

ధారణ మూడువిధములు.

(ధారణా=ధార్యతే యయా సా ధారణా, ధృ. ణిచ్, యుచ్, టాప్, ధ్యేయే చిత్తస్యస్థిరబన్ధనమ్, సత్త్వద్విషయవస్తు స్వాంతేంద్రియధారణం.)

శ్లో॥ ధ్యేయా సక్తం యస్య మనోఽభిధ్యాయతో భృశమ్।
ప్రాప్యావధికృతం కాలం యావత్సా ధారణా స్మృతా॥

(1) ఆత్మయందు (భగవంతునియందు=బ్రహ్మమందు) మనస్సునునిలుచునట్లు చేయుట.

(2) విహారాకాశమునందు బాహ్యాకాశమును నిలుచునట్లు చేయుట.

(3) పృథివ్యప్తేజో వాయ్వాకాశములయొక్క దేవతాస్వరూపమునందు మనస్సునునిలుచునట్లు చేయుట.

ధ్యానవివరము.

ధ్యానము, సగుణమనియు, నిర్గుణమనియు రెండువిధములుగలది.

ధ్యానమ్=ధ్యై. (చింతాయామ్) భావే, ల్యుట్, చిన్తనమ్, ధారణావిషయే ఏకప్రత్యయసన్తతిః.

శ్లో॥ తస్మి న్నండే స భగవా నుషిత్వా పరివత్సరం।
స్వయ మేవాత్మనో ధ్యానా త్తదణ్డ మకరో ద్ద్విధా ॥

అద్వితీయవస్తుని విచ్ఛిద్య విచ్ఛిద్యాంత రేంద్రియ వృత్తిప్రవాహః.

శ్లో॥ తద్రూప ప్రత్యయే చైకసన్తతి శ్చాన్యనిస్స్పృహా।
తద్ధ్యానం ప్రథమై రంగైః షడ్భి ర్నిష్పాద్యతే నృప ॥

తస్యార్థః—తద్రూపస్య, ధారణాసిద్ధస్య వస్తునః ప్రత్యయా యస్యాం సన్తతౌ, సావికావచ్ఛిన్న సన్తతిః. అన్యనిస్స్పృహా విషయాన్తరేణావ్యవధీయమానా, విజాతీయప్రత్యయాంతరిత స్వజాతీయప్రత్యయప్రవాహో ధ్యాన మిత్యర్థః. తచ్చ ప్రథమై ర్యమాదిభిర్ధారణాంతైః షడ్భిరంగై ర్నిష్పాద్యతే.

(1) మూర్తులను ధ్యానించుట సగుణమనఁబడును.

(2) ఆత్మతో మనస్సును యాదాత్మ్యమును బొందఁజేయుట నిర్గుణమనఁబడును.

సమాధియను నిష్ఠావివరము.

(సమాధిః=సమాధీయతే ఽస్మిన్ మనో జనై [illegible], ఇన్ద్రియనిరోధనం.)

శ్లో॥ నిత్యం శుద్ధం బుద్ధియుక్తం సత్య మానన్ద మద్వయమ్
తురీయ మక్షరం బ్రహ్మ అహమస్మి పరమ్పదమ్ ॥
అహం బ్రహ్మే త్యవస్థానం సమాధి రితి గీయతే॥

గారుడపురాణే. ౮౮ అధ్యాయే.

శ్లో॥ ద్వాదశధ్యానపర్యన్తం మనో బ్రహ్మణి యో నరః
తుష్టేతు సంయతో ముక్తః సమాధి స్సోఽభిధీయతే

గారుడపురాణే. ౨౮౦ అధ్యాయే.

తస్యైవ కల్పనాహీనం స్వరూపగ్రహణం హి యత్ ।
మనసా ధ్యాననిష్పాద్యం సమాధి స్సోఽభిధీయతే ॥

సమాధిస్తు ద్వివిధః, సవికల్పో, నిర్వికల్పశ్చేతి. తత్ర సవికల్పో నామ జ్ఞాతృజ్ఞానాదివికల్పలయానపేక్షయాఽద్వితీయవస్తుని తదాకారాకారితాయాశ్చిత్తవృత్తేరవస్థానమ్. తదా మృణ్మయగజాదిభానేఽపి మృద్భానవద్ ద్వైతభానేఽప్యద్వైతం వస్తు భాసతే తదుక్తమభియుక్తైః.

శ్లో॥ దృశిస్వరూపం గగనోపమం పరమ్
సకృద్విభాతంత్వజ మేక మవ్యయమ్ ।
అలేపకం సర్వగతం యదద్వయమ్
తదేవ చాహం సతతం విముక్తమ్ ॥
దృశిస్తు శుద్ధోఽహ మవిక్రియాత్మకో
న మేఽస్తి బన్ధో న చ మే విమోక్షః॥

నిర్వికల్పకస్తు జ్ఞాతృజ్ఞానాది భేదలయాపేక్షయాఽద్వితీయవస్తుని తదాకారాకారితాయా బుద్ధివృత్తే రతితరా మేకీభావేనావస్థానమ్. తదాతు జలాకారాకారితలవణానవభాసేన జలమాత్రావభాసవత్ అద్వితీయవస్త్వాకారితచిత్తవృత్త్యనవభాసేనాద్వితీయవస్తుమాత్రమేవావభాసతే. తతశ్చాస్య సుషుప్తేశ్చాభేదశఙ్కా న భవతి. ఉభయత్ర వృత్త్యభానే సమానేఽపి, తత్సద్భావాసద్భావమాత్రేణానయోర్భేదోపపత్తేః. అస్యాఙ్గాని యమనియమాదీని ఏవమస్యాఙ్గినో నిర్వికల్పకస్య లయవిక్షేపకషాయరసాస్వాదలక్షణాశ్చత్వారో విఘ్నాస్సంభవన్తి.

(1) లయస్తావత్ అఖణ్డవస్త్వనవలమ్బనేన చిత్తవృత్తేర్నిద్రా.

(2) అఖణ్డవస్త్వనవలమ్బనేన చిత్తవృత్తేరన్యావలమ్బనం విక్షేపః.

(3) లయవిక్షేపాభావేఽపి చిత్తవృత్తే రాగాదివాసనయా స్తబ్ధీభావాత్ అఖణ్డవస్త్వనవలమ్బనం కషాయః.

(4) అఖణ్డవస్త్వనవలంబనేనాపి చిత్తవృత్తేః సవికల్పానన్దాస్వాదనం రసాస్వాదః. సమాధ్యారమ్భసమయే సవికల్పానందాస్వాదనం వా. అనేన విఘ్నచతుష్టయేన రహితం చిత్తం నిర్వాతస్థలదీపవదచలం సదఖణ్డచైతన్యమాత్ర మవతిష్ఠతే

నిజముగ సద్గురువును జెంది పైనఁజెప్పఁబడినవిధములచే మనస్సును లెస్సగా నభ్యసించుటవలన వశపరచుకొనిన పిమ్మట జీవాత్మ పరమాత్మలయొక్క యైక్యమునుబొంది, మనస్సు త్రిపుటిరహితమై (ధ్యానించువాఁడు, ధ్యానమును చేయఁబడు వస్తువు, ధ్యానము, ఇవిమూఁడు లేనిదై) పరమానన్ద స్వరూపముగు నిత్య, బుద్ధ, శుద్ధ, ముక్త, సత్య, సచ్చిదానంద చైతన్యాత్మకమగుటయే సమాధియనఁబడును.

ఇదివఱకును చెప్పఁబడిన యష్టాంగయోగ వివరణములు హఠయోగపరములైనవి. అట్లభ్యసింపఁ దగిన వయస్సులేని వారలకును, లేక, అందు మనస్సు రుచింపని వారలకు నుపయోగార్థముగా నిఁకఁ జెప్పఁబోవు రాజయోగాష్టాంగయోగ వివరమును గమనించి తెలియునది.

(1) యమముయొక్క వివరము.

శ్లో॥ సర్వం బ్రహ్మేతి విజ్ఞానా దింద్రియగ్రామసంయమః।
యమోఽయమితి సంప్రోక్తోఽభ్యసనీయో ముహుర్ముహుః॥

సకలమును బ్రహ్మస్వరూపముగాఁ (భగవత్స్వరూపముగాఁ) దెలిసికొనుటవలన నింద్రియములను విషయములనుండి త్రిప్పి. యాత్మయందు నిల్పుటయే యమమని చెప్పఁబడును. దీనిని మాటిమాటికి కలవారు గడుగడుగునకు విషయములచేఁ దరఁబడు నింద్రియసమూహములను భగవంతునియందు (బ్రహ్మమందు) నిలుపుటయగు నభ్యాసమును పదేపదే చేయవలసినది.

(2) నియమముయొక్క వివరము.

శ్లో॥ సజాతీయప్రవాహశ్చ విజాతీయతిరస్కృతిః।
నియమోహి పరానన్దో నియమాత్క్రియతే బుధైః॥

తా॥ ఆత్మకంటె (భగవంతునికంటెను=బ్రహ్మముకంటెను) భిన్నముగాఁదోఁచు నవిద్యచేఁ గనఁబడు విజాతీయమైన సమస్తము నెడఁబాసి సజాతీయప్రవాహమునందే మనస్సును నియమించుట నియమమనఁబడును.

(3) ఆసనముయొక్క వివరము.

శ్లో॥ సుఖేనైవ భవేద్యస్మిన్నజస్రం బ్రహ్మచిన్తనమ్।
ఆసనం తద్విజానీయాన్నేతరత్సుఖనాశనమ్

తా॥ భగవంతుని చింతనచేయుటకన్న నితరములగు వేనియందును మనస్సు సుఖమును బొందక యెప్పుడు నిలిచిపోవునో, అట్టిస్థితియే యాసనమని చెప్పఁబడును. చేతులు కాళ్ళను ముడుచుకొని బంధించి కష్టపడుట సుఖాసనముగాదు.

(4) ప్రాణాయామ వివరము.

శ్లో॥ చిత్తాదిసర్వభావేషు బ్రహ్మత్వేనైవ భావనాత్ ।
నిరోధస్సర్వవృత్తీనాం ప్రాణాయామస్స ఉచ్యతే ॥

తా॥ మనస్సు, బుద్ధి, చిత్తు, అహంకారము, చిల్లము, అనెడి యంతఃకరణమునందు భగవంతుని (బ్రహ్మమును) తప్ప రెండవభావనయే లేకుండుటయు నితరభావనలను చిత్తమునకు బాహ్యవృత్తియుఁ గలుగునప్పుడు వానిని చిత్తమునుండి తొలఁగించి బ్రహ్మభావనయందు మనసు నిలుపుటయే ప్రాణాయామ మనఁబడును.

రేచక, పూరక, కుంభకముయొక్క వివరము.

శ్లో॥ నిషేధనం ప్రపంచస్య రేచకాఖ్యస్సమీరణః
బ్రహ్మైవాస్మీతి యా వృత్తిః పూరకో వాయురీరితః
తతస్తద్వృత్తినైశ్చల్యం కుంభకః ప్రాణసంయమః

తా॥ భగవంతునియందు మనస్సును చలించక నిలుపుటకు సాధనమైన ప్రాణాయామమందు, ప్రపంచముయొక్క తలంపు మనసునను రాకుండఁ దొలఁగించుటయే రేచకమనియు అట్లు తొలఁగించిన పిదప "బ్రహ్మైవాస్మి" యనెడు మనోవృత్తితో నుండుటయే పూరకమనియు, "బ్రహ్మైవాస్మి" యనెడు చింతన ప్రబలమై మనసు దాని కాధారముగ నగుటయే కుంభకమనియు చెప్పఁబడును.

(5) ప్రత్యాహారముయొక్క వివరము.

శ్లో॥ విషయేష్వాత్మతాం దృష్ట్వా మనసశ్చిత్తమజ్జనమ్ ।
ప్రత్యాహారస్స విజ్ఞేయోఽభ్యసనీయో ముముక్షుభిః ॥

తా॥ తాను చేసిని చూచిన నది తనను భగవంతునిఁగా (ఆత్మగా) చూచి, యెట్లు పతివ్రతయగు స్త్రీ తనప్రియునితో నేకాంతముం దున్నప్పుడు తనశరీరమునఁ గొం

చెమును లజ్జయించక సమస్తము నతని కర్పించియుండుటయూ, అటుల, మనస్సు మానావమానములులేనిదై సమస్తమును పతియగు నాత్మకర్పితము గావించి యుండు స్థితియే ప్రత్యాహార మనఁబడును. దీనిని ముముక్షులగు వార లవశ్యముగా నభ్యసింపవలయును.

(౬) ధారణయొక్క వివరము.

శ్లో॥ యత్రయత్రమనోయాతి బ్రహ్మణస్తత్రదర్శనాత్ ।
మనసో ధారణంచైవ ధారణా సాపరామతా ॥

ఎచ్చటెచ్చట మనసు, నేనున్నానని పోవునో, అచ్చటచ్చట నప్పుడప్పుడా మనస్సును దొలఁగించి, సమస్తము బ్రహ్మముగాఁ జూచెడి యభ్యాసముచే మనస్సు ధారణయనెడు స్థితిని జెందును.

(౭) ధ్యానము యొక్క వివరము.

బ్రహ్మైవాస్మీతి సద్వృత్త్యా నిరాలంబతయాస్థితిః ।
ధ్యానశబ్దేన విఖ్యాతా పరమానన్దదాయినీ ॥

బ్రహ్మైవాస్మి, యనెడుమనోవృత్తిచే మనస్సుయెప్పుడెడతెగక బ్రహ్మమునందు నిలుచుటయూ, అప్పు డట్టియానన్దస్థితినే ధ్యానమని చెప్పుదురు.

(౮) సమాధియొక్క వివరము.

శ్లో॥ నిర్వికారతయా వృత్త్యా బ్రహ్మాకారతయా పునః ।
వృత్తివిస్మరణం సమ్యక్ సమాధి ర్జ్ఞానసంజ్ఞకః ॥

మనస్సు నిర్వికల్పమై బ్రహ్మాకారముగలది. మనస్సెప్పుడు తన్నుఁదాను మఱచి బ్రహ్మమందు లయించుటయూ, అప్పుడు సమాధియనఁబడును.

ఇట్లు రాజయోగపద్ధతి వివరముముగిసెను.

౬ - మంత్రము.

అవతారిక.

మందబుద్ధిగలవారలకు బ్రహ్మస్వరూపము నుపదేశించుటకును, అట్లుపాసన చేయువారలకుఁ గలుగుఫలమును గూర్చియు నీమంత్రమందుఁ జెప్పఁబడుచున్నది.

**6**

తద్ధ తద్వనం నామ తద్వన మిత్యుపాసితవ్యం సయ
ఏత దేవం వేదాభిహైనం సర్వాణిభూతాని సంవాఞ్ఛన్తి

| | |
|---|---|
| నామ, హ | ప్రసిద్ధిఁజెందియున్నదిగదా? |
| తత్ | ఆబ్రహ్మస్వరూపము |
| తద్వనమ్ | (వన, 'సంభక్తౌ, ఇతిధాతోః, వన్యతే = సేవ్యతే,) అందఱిచేత నుపాసింపఁదగినది. |
| తద్వనం, ఇతి ఉపాసితవ్యమ్ | (మందబుద్ధివారలు) ఆబ్రహ్మమునుగుణములుగలదిగా చింతనచేయవలసినది. |
| సః, యః | (ఆబ్రహ్మమును సగుణముగానెంచి, దానికి, నామ మేర్పరచి, యానామస్మరణచేయు) నట్టి ప్రసిద్ధుఁడైన యుపాసకుఁడు |
| ఏవమ్ | పైనఁజెప్పఁబడినరీతిగా |
| అభివేద, హ | ఉపాసనచేయుచున్నాఁడో, |
| ఏనమ్ | ఈయుపాసకుని |
| సర్వాణి,భూతాని | స్థావరజంగమరూపములయిన సకలభూతములును |
| సంవాఞ్ఛన్తి | (బ్రహ్మమును దర్శించుటకును, స్పర్శించుటకు నెట్లు కోరుదురో, అట్లు) ప్రార్థించుచున్నవి. |

తాత్పర్యము.

ఈబ్రహ్మమును ధ్యానయోగముచేత నభ్యసింపఁగూడనివారలు, అనఁగా మందబుద్ధిగలవారు యమనియమాద్యష్టాంగ యోగాభ్యాసముచే ధ్యానయోగము నొంది, యందువలన నాత్మస్వరూపానుభవము పొందవలసినదని గడచిన యైదవ మంత్రమునందుఁ జెప్పఁబడిన యాబ్రహ్మమందఱిచే సేవింపఁదగినది.

మందబుద్ధిగలవారలు బ్రహ్మస్వరూపమును గుణములుగలదిగా చింతనచేయ వలయును. లేనిచో, మనస్సునిలుకడగానిలువఁజాలదు. అందుకై వారల కష్టాంగయోగాభ్యాస మావశ్యకము. మందబుద్ధిగలవారియొక్క మనస్సు ఫలమునేయపేక్షించును గనుకఁ దత్ఫలమునుగూడ నీమంత్రము చెప్పుచున్నది. ఎట్లనినః—

ఎవ్వఁడాబ్రహ్మస్వరూపమును సగుణముగా నుపాసించి నామస్మరణచేసి యెడతెగక నామ సంకీర్తనములఁ జేయుచుండునో, వాని నందఱు దైవముగాఁ గొనియాడుదురు. నామసంకీర్తనమునకే (సగుణధ్యానమునకే) శ్రేష్ఠ్యముండిన యెడల "వాసుదేవఃసర్వమ్" అనే యభేదదర్శనమగు జ్ఞాననిష్ఠగలవానికిఁగలుగు ఫలమును మనవాక్కు చేవచింపఁజాలము. అక్లేంద్రియములయిం[ద్రియము]నకుశక్తిచాలదు. మన యందుఁ దత్కాలమునందుండు నశుద్ధమనస్సునకును (అనఁగాభేదబుద్ధిగల మనస్సునకును) శక్తిచాలదు. శ్రుతులకుఁగూడ శక్తిచాలక "బ్రహ్మవిత్ బ్రహ్మైవభవతి" జ్ఞాననిష్ఠగల బ్రహ్మవేత్త బ్రహ్మమేయగును, అని మొత్తముగాఁ జెప్పినవి. జ్ఞాననిష్ఠను జెందవలయునని మనసునుస్థిరముగా నిర్ణయించుకొని యందుకుసాధనమగు నీమంత్రమందుఁ జెప్పఁబడియుండు సగుణధ్యానమును జేయవలయును. పూర్వజన్మమందుఁ జేసియుండునట్టి యభ్యాసవిశేషమువలన నెవ్వనికైనజ్ఞాననిష్ఠలో మనసు నిలుకడగానిలుచునేని యట్టివానికి ధ్యాననిష్ఠయే శ్రేష్ఠమని తెలిసికొనునది.

## ౭ - మంత్రము.

### అవతారిక.

ఓస్వామీ! తామిదివఱకుఁ జెప్పినయష్టాంగయోగము మిక్కిలికష్టసాధ్యమని తోఁచుచున్నది. కావున మీరు నాకుపనిషదర్థమును జెప్పవలయుననని శిష్యుఁడడుగుటయును, నాచార్యుఁడు ప్రత్యుత్తరమిచ్చుటయును నీమంత్రము చెప్పుచున్నది.

(7)

శ్రు॥ ఉపనిషదం భో! బ్రూహీత్యుక్తా
త ఉపనిషద్బ్రాహ్మీం వావ త ఉపనిషద మబ్రూమేతి॥

| | |
|---|---|
| (శిష్యః) | (యమనియమాదుల సంగతులనువినిన) శిష్యుఁడు |
| (ఆచార్యమ్) | గురువునుచూచి |
| భో! | ఓ స్వామీ! |
| ఉపనిషదమ్ | (1) ఉప = సమీపే, నిషద్యతే = ప్రాప్యతే, బ్రహ్మవిద్యాఽనయా, ఇతి, ఉప. ని, సద్, క్విప్ |
| | (2) ఉప, నిషణ్ణ, మస్యాం, పరమ్, శ్రేయః, ఇత్యుపనిషత్ |
| | (3) ఉప = సామీప్యేన, నితరాం, బ్రహ్మ, గమయిత్వా, 'అహమ్', మమాదిగ్రంథిమ్ శిథిలీకృత్య అవిద్యాసంస్కారంసాధయతి = నాశయతీతి ఉపనిషత్ |
| | (1) బ్రహ్మముఁజెందఁ జేయుటవలన నుపనిషత్తనియు, |
| | (2) సమస్తముకన్న నిందు నధికశ్రేయస్సుండుటవలన నుపనిషత్తనియు, |

(౩) బ్రహ్మమునందు రెండవది లేకుండఁ గలియుటయను స్థితియును, తన్మూలముగా నహంకారమమకారము లనెడుహృదయగ్రంథిని ఛిన్నాభిన్నముచేసి, యవిద్యయొక్క వాసనయగు సంస్కారమునుగూడ నశింపఁజేయుటవలన నుపనిషత్తనియు చెప్పఁబడును. అట్టి రహస్యములుగల, ఉపనిషత్తును

| | |
|---|---|
| బ్రూహి, ఇతి | చెప్పుమని |
| (ఉవాచ) | అడిగెను. |
| ఆచార్యః | గురువును |
| తే | నీకు |
| ఉపనిషత్ | ఉపనిషత్తును |
| ఉక్తా, వా, వ | ఇదివఱకుఁజెప్పఁబడినదే యగును. |
| బ్రాహ్మీమ్ | బ్రహ్మనుగ్రహ సాధనములఁ జెప్పెడి |
| ఉపనిషదమ్ | ఉపనిషదర్థమును |
| తే | నీకు |
| అబ్రూమ | చెప్పెదను. |
| (అవధారయ) ఇతి | తెలిసికొనుమాయని, |
| (ఉవాచ) | పలికెను. |

తాత్పర్యము.

పూర్వజన్మాంతరములయందుఁ జేయఁబడిన సుకృతములవలనను, పుణ్యపుంజపరిపాకమువలనను నీజన్మమందుఁ జేయుచుండు సత్సాంగత్యమువలనను, సద్గ

రువునువదని యుపదేశము నొంది వారుచెప్పినట్లు నడచుకొని యభ్యాసముచేసి మనసు ధ్యాననిష్ఠలోనిలుచు స్థితియును, నట్లుగాక పరమార్థచింతమాత్రము గలిగియుండు మందాధికారులు యమనియమాద్యష్టాంగయోగాభ్యాసమును సద్గురువుచేఁ దెలిసికొని యనుష్ఠించి పొందఁదగిన స్థితినిగూర్చియు గురువుచెప్పఁగా శిష్యుఁడుతానువిన్న పిమ్మట రహస్యమగు నిష్ఠనుగూర్చిచెప్పు నుపనిషత్తును దనకుఁ జెప్పవలయునని గురువునడిగెను. అందుకు గురువు ఇదివఱకు నీకుఁజెప్పినది యుపనిషత్తే, ఇఁకబ్రహ్మము యొక్క యనుగ్రహసాధనములను చెప్పెద వినుమాయని గురువుపలికెను.

ఇచ్చట పూర్వపక్షి ప్రశ్నచేయుచున్నాఁడు. ఏట్లనిన:—

పరమాత్మ విషయమగు నుపనిషత్తును నాకుఁ జెప్పవలసినదని యిచ్ఛయించు శిష్యుని యభిప్రాయమేమి?

ఇదివఱకు వాఁడువినిన యుపనిషదర్థమును మఱల నడిగినాఁడందు వేని, పిష్టపేషణము (కొట్టినపిండినేమఱలకొట్టుట) యెట్లువ్యర్థమో, అట్లుశిష్యుఁడడిగినదేయడిగినాఁడనినను, లేక, గురువుచెప్పినదే చెప్పినాఁడనినను, పునరుక్తి దోషము సంభవించును. అట్లుకాక యుపనిషత్ఫలమును శిష్యుఁడడిగినాఁడనినను నదియుసరికాదు. ఏలయనిన:— "ప్రేత్యాస్మాల్లోకాదమృతాభవన్తి" అని మొదటిఖండము కడపటనిదివరకే చెప్పఁబడియుండుటవలన శిష్యుఁడు ఫలమునుగూర్చి యడిగినాఁడనియుఁ జెప్పఁగూడదు.

అనిన, సిద్ధాంతిసమాధానము చెప్పుచున్నాఁడు. ఎట్లనిన, శిష్యుఁడింతవఱకు వినిన యుపనిషత్తునుగూర్చియు నడుగలేదు, లేక, నేనుచెప్పినదానిని మఱలఁజెప్పలేదు. శిష్యుఁడుజ్ఞాననిష్ఠను, అష్టాంగయోగమునువినిన పిమ్మట పరబ్రహ్మమునుబొందుటకొఱకుఁగల యుపనిషత్తును జెప్పుమని శిష్యుఁడడిగెను. అందుకు నేనిదివఱకు చెప్పిన యుపనిషద్వాక్యముల విన్నావుగదా? నీవడుగునట్లు పరబ్రహ్మానుగ్రహసాధనములగు నుపనిషదర్థములను జెప్పెద వినుమా యని చెప్పినానుగనుక శిష్యుఁ

డడిగినదియు నేను చెప్పినదియు సరే. నీవు చెప్పుప్రకారము పునరుక్తి కవకాశము లేదని పలికెను.

౮ - మంత్రము.

అవతారిక.

బ్రహ్మమును జెందుటకుం దగినసాధనముల నీమంత్రము చెప్పుచున్నది. అవేవి యనినః—

8

శ్రు॥ తస్యై తపో దమః కర్మేతి ప్రతిష్ఠా వేదాః సర్వాఙ్గాని సత్య మాయతనమ్ ॥

తస్యై — పైమంత్రమందుం జెప్పంబడిన బ్రహ్మోను గ్రహ సాధనమునకు

తపః — (తపతి, తాపయతివా; తప—ఉపతాపే సర్వధాతుభ్యోఽసున్) (ఇంద్రియముల యొక్కయు, మనస్సుయొక్కయు నేకాగ్రతయగు)తపస్సును,

దమః — (శ్లో॥ కుత్సితాత్కర్మణో విప్ర! యచ్చ చిత్తనివారణమ్ । స కీర్తితో దమః ప్రాజ్ఞైః సమస్త తత్త్వదర్శిభిః ॥ )తన్నుగాని, యితరులను గాని మోసకపుచ్చకయుండుచిత్తవృత్తి “నిగ్రహా బాహ్యావృత్తీనాం దమఇత్యభిధీయతే” అనంగా, ఇంద్రియ నిగ్రహము

కర్మ — (ఆయావర్ణాశ్రమములకు విహితములగు కర్మము, నితర సత్కర్మములను, నిష్కామము గాంజేసెడి) క్రియ

ఇతి　　"ఉపలక్షణ దర్శనార్థః" ఇవి మొదలగునవి, బ్రహ్మవిద్యకు ముఖ్యసాధనము

ఏతే)　　పైనఁ జెప్పఁబడిన తపస్సు, ఇంద్రియనిగ్రహము నిష్కామకర్మము మొదలగు) నివియన్నియు

దాః　　ఋక్, యజుః, సామ, అథర్వణములనెడు నాలుగు వేదముల కర్మభాగములు

సర్వాఙ్గాని　　సమస్తములకు నంగములు గాను

సత్యమ్　　(వేదములయొక్క జ్ఞానభాగమందుఁ గాలత్రయములచే బాధింపఁబడని ప్రజ్ఞానస్వరూపియగు) బ్రహ్మత్వమును (బొందుటకు సాధనములుగాను)

యతనమ్　　స్థానముగానున్నవి. (అనిచెప్పఁబడుచున్నవి.)

తాత్పర్యము.

ఏడవమంత్రమందుఁ జెప్పఁబడిన బ్రహ్మానుగ్రహ సాధనమునకు, నింద్రియముయొక్కయు, మనసుయొక్కయు నేకాగ్రస్థితియగు తపస్సును, తనను గాని, ఇతరులను గాని మోసపుచ్చక యందు చిత్తవృత్తిని బొందుటకు సాధనమగు నింద్రియనిగ్రహ మనెడి దమమును, ఆయావర్ణాశ్రమములకుఁ దగినట్లు కలకర్మములను ఇతరసత్కర్మములను నిష్కామముగాఁ జేయుక్రియలును నివి మొదలగు నవి బ్రహ్మవిద్యకు ముఖ్యసాధనములు.

పైనఁ జెప్పఁబడిన, తపస్సు, దమము, కర్మము, వీటిని నాలుగువేదములయొక్క కర్మభాగములయందు సమస్తములకు గంగములుగాను, జ్ఞానభాగములయందు ప్రజ్ఞానస్వరూపమగు బ్రహ్మత్వమును బొందుటకు సాధనములయినవనియు చెప్పఁబడుచున్నవి. తపస్సుచేఁ గలుగు ఫలము లేవి యనఁగా:—

శ్లో॥ స్వాధ్యాయతపసో ర్వృత్త్యై తస్మై నిగదితంశృణు।
తపసో హి పరం నాస్తి తపసా విన్దతే మహత్॥
తపసా క్షీయతే పాపం మోదతే సహ దైవతైః।
తపసా ప్రాప్యతే స్వర్గః తపసా ప్రాప్యతే యశః॥
తపసా సర్వ మాప్నోతి తపసా విన్దతే పరమ్।
జ్ఞాన విజ్ఞాన సంపన్నః సౌభాగ్యం రూప మేవచ॥
తపసా లభతే సర్వం తథైవా ధ్యయనేన చ।
తస్మా త్స్వధర్మ సంయుక్తః నిత్యం సిధ్యతి పణ్డితః॥
ధర్మా త్సుఖ మవాప్నోతి ఇహ లోకే పరత్రచ॥

(స్వాధ్యాయః. సు = సుకృతాయ, అవృత్త్యా, అధ్యాయః = అధీత
జననమరణ నివర్తకమగు మోక్షమును బొందుటకు సాధనమగు సర్థవిచారణతో
గూడిన స్వాధ్యాయముయొక్కయు, పారాయణముయొక్కయు, లేక, మనః
యొక్కయు, ఇంద్రియములయొక్కయు, లేక మన యొక్కయు నేకాగ్రత
గు తపస్సుయొక్క ఫలమును జెప్పెద, వినుము. తప శేషమైన దేదిం
లేదు. ఏల ననిన, మఱి దేనివలనను బొందుటకుఁ గష్ట మునకు
మేలైన మోక్షము, తపస్సుచే సులభముగాఁ బొందఁదగిన
పాపములు నివర్తించును. బ్రహ్మానందమును బొందవచ్చును. తప
బొందవచ్చును. (స్వర్గలోకః = సుష్ఠు, ఋజ్యతే = స్థీయతేఽస్మిన్
ఋజు = గతి స్థానార్జ నోపార్జనే ష్వితిధాతోః, సర్వాధిష్ఠానభూతే, లోక్యతే
లోకః, సర్వసాక్షిసుఖాత్మకం బ్రహ్మస్థానమ్ = సకలమునకు నాధారభూతమ
సర్వసాక్షియైన సదానందస్వరూపమగు బ్రహ్మస్థానమును బొందవచ్చును. తపస్సు
జననమరణరూపమగు సంసారమునకు మఱలుట సంభవించని కీర్తి గలుగును.
సుచే శాస్త్రమును బొందవచ్చును. తపసుచేఁ బరమును బొందవచ్చును. జ్ఞా
జ్ఞానసంపత్తును, సౌభాగ్యమును, మంచి తేజోమయత్వమును, ఇట్టి శ్రేష్ఠము
స్థితులను బొందవచ్చును. తత్త్వ విచారణ మననము చేతను వీనిని బొందవచ్చు
గనుక, వీని కన్నిటికి మొదటిమెట్టుగానుండు తమ తమ వర్ణాశ్రమ ధర్మానుష్ఠాన
గలవార లిహపరసుఖముల రెండింటిని బొందుదురనుటలో సందేహ మించుకయో
లేదు.

శరీరముచేఁ జేయఁబడు తపస్సనియు, వాక్కుచేఁ జేయఁబడు తపస్సనియు, మానసిక తపస్సనియు మూఁడువిధములుగలదిగ నున్నది యనుటకుఁ బ్రమాణము.

దేవ ద్విజ గురు ప్రాజ్ఞ పూజనం శౌచ మార్జవమ్ ।
బ్రహ్మచర్య మహింసాచ శారీరం తప ఉచ్యతే ॥
అనుద్వేగకరం వాక్యం సత్యం ప్రియహితంచ యత్ ।
స్వాధ్యాయాభ్యసనం చైవ వాఙ్మయం తప ఉచ్యతే ॥
మనః ప్రసాద స్సౌమ్యత్వం మౌన మాత్మవినిగ్రహః ।
భావసంశుద్ధి రిత్యేతత్ తపో మానసముచ్యతే ॥

భగవద్గీతా అ. ౧౭. శ్లో. ౧౪, ౧౫, ౧౬.

ఈమానసికతపస్సు సాత్త్విక, రాజస, తామసము లని మూఁడు విధము లగును. అందుకుఁ బ్రమాణము.

శ్రద్ధయా పరయా తప్తం తప స్తత్త్రివిధం నరైః ।
అఫలాకాంక్షిభి ర్యుక్తైః సాత్త్వికం పరిచక్షతే ॥
సత్కారమా[illegible]ర్థం తపో దంభేన చైవయత్ ।
క్రియ[illegible]ం రాజసం చల మధ్రువమ్ ॥
నో యత్ పీడయా క్రియతే తపః ।
నార్థం వా త త్తామస ముదాహృతమ్ ॥

భగవద్గీతా. అ. ౧౭. శ్లో. ౧౭. ౧౮, ౧౯.

కర్మముయొక్క వివరము.

ఉత్క్షేపణం తతోఽవక్షేపణ మాకుఞ్చన న్తథా । ప్రసారణం చ గమనం కర్మా ణ్యేతాని పంచ వ ॥

రోఁకలి మొదలగువానిచే ధాన్యమును దంచుటయు, పదార్థములను పచనము సేయుటయు, సంపాదించుటయు, వృద్ధిచేయుటయు, సంచరించుటయు నైదు కర్మ లనఁబడును.

ఇట్టి కర్మములు సాత్త్వికము లనియు, రాజసము లనియు, తామసము లని మూఁడు విధము లగును.

నియతం సంగరహిత మరాగద్వేషతః కృతమ్ ।
అఫలప్రేప్సునా కర్మ య త్తత్సాత్త్విక ముచ్యతే ॥

యత్తు కామేప్సునా కర్మ సాహంకారేణ వా పునః ।
క్రియతే బహులాయాసం తద్రాజస ముదాహృతమ్ ॥
అనుబన్ధం క్షయం హింసా మనపేక్ష్య చ పౌరుషమ్ ।
మోహా దారభ్యతే కర్మ యత్త త్తామస ముచ్యతే ॥

భగవద్గీతా. అ. ౧౮. శ్లో. ౨౩, ౨౪, ౨౫

వీనికర్థము నీవ్యాఖ్యానకర్తచే రచియింపఁబడియుండు "భగవద్గీతాగూఢార్థ దీపిక" లోను భగవద్గీతా రహస్యార్థ బోధినీ" లోను జూచునది.

9-వ మంత్రము.

అవతారిక.

కేనోపనిషత్తునందుఁ జెప్పఁబడిన ట్లనుష్ఠించువారికిఁ గలుగు ఫలము నీమంత్రము చెప్పుచున్నది. అదేమి యనిన:—

**శ్రు. యో వా ఏతా మేవం వేదాపహత్య పాప్మాన మనన్తే స్వర్గే లోకే జ్యేయే ప్రతితిష్ఠతి ప్రతితిష్ఠతి.**

| | |
|---|---|
| యః, | ఎవ్వఁడైతే (బ్రహ్మ [redacted]డు) |
| ఏతామ్ | ఈ బ్రహ్మవిద్యను |
| ఏవమ్ | ఇదివఱకుఁ జెప్పుచు వచ్చినప్రకా |
| వేద | (స్వానుభవమువలన) తెలిసికొనుచున్నా |
| (సః) | వాఁడు |
| పాప్మానమ్ | (జననమరణ ప్రవాహరూపమగు సంసారమునకు బీజముగనుండు అవిద్యయగు కామ్యకర్మమనెడి పాపమును |
| అపహత్య | దులిపివేసి |
| అనన్తే | అపరిచ్ఛిన్నముగానుండునదియు, |
| జ్యేయే | అన్నిటికి శ్రేష్ఠమయినదియునగు |
| స్వర్గే, లోకే | స్వర్గః=సు=సుష్ఠు, ఋజ్యతే=స్థీయతే, అస్మిన్. ఇతి, స్వర్గః ఋజు=గతిస్థానార్జనోపా ర్జనేషు ధాతుః. సర్వాధిష్ఠానభూతే, లోకే |

లోక్యాత, ఇతి, లోకా — సర్వా[redacted]
బ్రహ్మ, తస్మిన్
సమస్తమున కాధారభూతముగా నుండుసర్వ
సాక్షీ స్వరూపమగు నానందాత్మకమైన బ్రహ్మ
మునందు,

ప్రతితిష్ఠతి (ప్రకర్షేణ, పునరుత్పత్తిశూన్యత్వేనావస్థానం కరోతి; యద్వా, ముఖ్యఏవ ప్రతీతః నపునస్సంసారమాపద్యత ఇత్యభిప్రాయః.) మఱలఁబుట్టుకగిట్టుకలేని స్థానమును (బ్రహ్మమును) బొందుచున్నాఁడు.

ప్రతితిష్ఠతి మఱలఁబుట్టుకగిట్టుకలేని స్థానమును(బ్రహ్మమును) బొందుచున్నాఁడు, లేక, కలుగఁజేసికొనుచున్నాఁడు. (ఫలవిషయమగు సందేహనివృత్తికొఱకును మనసునందు నిశ్చయముగలుగుటకొఱకును శ్రుతి 'ప్రతితిష్ఠతి, ప్రతితిష్ఠతి'' యని రెండుమాఱులు చెప్పినది యని యెఱుఁగ

తాత్పర్యము.

ఎవ్వఁడీబ్రహ్మవిద్యను 'కేనేషితమ్, అనెడి యీయుపనిషత్తుయొక్క ప్రథమవాక్యము మొదలుకొని చెప్పఁబడినవియు, బ్రహ్మహదేవేభ్యః, అను మూడవఖండము ప్రథమమందుఁ జెప్పఁబడిన, దేవతలకును, బ్రహ్మమునకునునడచినసంగతులను జక్కఁగాఁ దెలిసికొని యీ యుపనిషత్తుయొక్క ఫలమును దెలియఁజేసెడి "అమృతత్వంహి విన్దతే" అను రెండవఖండము, నాలవవాక్యమును మనసునఁ జక్కఁగా గ్రహించి యీ నాలవఖండమందుఁ జెప్పఁబడిన ప్రకారమెవ్వఁడీబ్రహ్మమును స్వానుభవముచేఁ దెలిసికొనుచున్నాఁడో, వాఁడు జననమరణప్రవాహమునకు విత్తనముగా నుండు నవిద్య యనుకామ్యకర్మముఁ దనమనసున విడనాడి యపరిచ్ఛిన్నముగను నన్నిటికిని శ్రేష్ఠమయినదిగను, నాధారభూతముగను నుండు సాక్షీస్వరూపమగు నానందాత్మకమయిన యాత్మయందు(బ్రహ్మమందు=భగవంతునియందు) మఱలఁ బుట్టుక గిట్టుక లేని లయమును (ఐక్యమును) బొందుచున్నాఁడు.

ట్టుక, గిట్టుక లేని లయ

బొందుచున్నాఁడనిన యెడల, పుట్టుక గిట్టుక గల లయ మొక్కటి గల

యనిన:—

సిద్ధాంతి సమాధానము చెప్పుచున్నాఁడు:—నీవు చెప్పునది నిజమే. జ్ఞా నిబొందని సృష్ట్యాదులు ప్రళయకాలమందు లయమును బొందుచున్నవి. అలఁ ముఖలఁ బుట్టుటకుఁ గారణ మగును. ఈ కేనోపనిషత్తునందుఁ జెప్పఁబడి య ప్రకారము బ్రహ్మమును గురూపదేశపూర్వకముగాఁ దెలిసికొని, స్వానుభవ జెంది, యందువలన లయమును(ఐక్యమును) బొందువాఁడు వ జన్మము డు. కావుననే యిట్టి లయమును బొందుటకుఁ బ్రతిమనుజుండును ప్రయత్నఁ ముపలసినదత్యావశ్యకము. అట్లు లేనిచో మనుష్యజన్మ మెత్తినందు కేమియుఁ బ్రయో జనము లేక వ్యర్థముగా జీవించినవాఁడగు నని యీయుపనిషత్తు ఘోషించి గ ర్వమును బొందినదని యెఱుంగుము.

ఓమ్ ఆప్యాయన్త్వితి శాన్తిః.

**కేనోపనిషద్దీపికా**

సద్గురోః కృపయా సమాప్తిమగమత్.

---

ఇట్లు

శ్రీమత్పరమహంస శ్రీబాలసుబ్రహ్మణ్య బ్రహ్మస్వాములవారిచే

రచియింపఁబడిన

యీ "కేనోపనిషద్దీపిక" యను నాంధ్రవ్యాఖ్యానము

ముగిసెను.

ఓం, తత్, సత్.

శ్రీ ర స్తు.

శ్రీ గ ణే శ శా ర దా గు రు భ్యో న మః.



శ్రీ ద క్షి ణా మూ ర్త యే న మః.

మౌనవ్యాఖ్యా ప్రకటిత పరబ్రహ్మతత్త్వం యువానమ్
వర్షిష్ఠాన్తే వసదృషిగణై రావృతం బ్రహ్మనిష్ఠైః।
ఆచార్యేన్ద్రం కరకలిత చిన్ముద్ర మానందమూర్తిం
స్వాత్మారామం ముదితవదనం దక్షిణామూర్తి మీడే॥

| | |
|---|---|
| అహామ్ | నేను |
| [redacted] పరబ్రహ్మ | మాటలాడ కుండుటయను నుపదేశ |
| | ముచే వెల్లడి చేయఁబడిన పరబ్ర |

| | |
|---|---|
| | హ్మముయొక్క స్వరూపము గల వాఁడను |
| యువానం | చిన్నవాఁడును |
| బ్రహ్మనిష్ఠైః | బ్రహ్మమునందుఉనికిగల |
| వర్షిష్ఠాంతేవసదృషిగణైః | వృద్ధులైనశిష్యులగుఋషులసమూహముల చేత |
| ఆవృతం | చుట్టఁబడినవాఁడును |
| ఆచార్యేంద్రం | గురువులలో శ్రేష్ఠుఁడును, లేక గురువులకు రాజును |
| కరకలితచిన్ముద్రం | చేతిచేఁబట్టఁబడిన జ్ఞానముఁ దెలుపు ముద్రగలవాఁడును |
| ఆనందమూర్తిం | ఆనందస్వరూపుఁడను |
| స్వాత్మారామం | తనస్వరూపమునందె క్రీడించు చున్నవాఁడును |
| ముదితవదనం | సంతుష్టమయిన ముఖము గలవాఁడునగు |
| దక్షిణామూర్తిం | దక్షిణామూర్తిని |
| ఈడే | స్తుతింపుచున్నాను |

వయసున మిక్కిలియుఁ జిన్నవాఁడును శిష్యులయిన ముదుసళులు బ్రహ్మనిష్ఠులునగు ఋషులచేఁ బరివృతుండై వారలకు మౌన మాత్రముచే తనె పరబ్రహ్మతత్త్వము తేటతెల్లముగా నుపదేశించిన వాఁడును హస్తమునందు అంగుష్ఠతర్జనీ సంయోగరూపమయిన జ్ఞానముద్రను ధరించి స్వాత్మానందంబు ననుభవించుచున్నవాఁడును ఆనందస్వరూపుఁడను నిత్యానందంబునం బ్రసన్నమయిన ముఖంబు గలవాఁడను సమస్తాచార్యులకును మొదటివాఁడునగు శ్రీ దక్షిణామూర్తిని స్తోత్రముచేయుచున్నాను. అని, తాత్పర్యము.

## ఆంధ్రటీకాతాత్పర్యసహితదక్షిణామూర్తిస్తోత్రము.

భగవత్పాదవిరచితం బగుదక్షిణామూర్తిస్తుతికి నాంధ్రవ్యాఖ్యన్
దగఁ జేయుదు నాశంకర సుగురున్ మదిఁ దలఁచి యుక్తిశుద్ధికి భక్తిన్ ॥

భగవతియగు శ్రుతి లోకహితంబుకొఱకు ధర్మము నుపదేశించుచున్నది. ఆధర్మము ప్రవృత్తిధర్మమనియు నివృత్తిధర్మమనియు రెండు విధములు. అందు మొదటిది, వర్ణాశ్రమ దేహాదులయందును బుత్త్రకళత్త్రధనాదులయందును అహంకార మమకారంబుల నావిష్టులయి యుండువారలచే ననుష్ఠేయంబై, వారలకు ఐహికంబును బారలౌకికంబును నగు నభ్యుదయము లొందించును. జనులు తమకు బహుమతంబులగు వానిం గోరి యన్యోన్యకర్మంబుల నాచరింతురు. దానం జేసి వారలు ఇచ్చటఁ గాని యచ్చటఁ గాని కామితంబులం బడయుదురు. ఇచ్చటఁ గాంతాభోగాదుల నెప్పగాఁ దలంచి గోరిచేయు వారల కాధర్మంబు పరలోకంబునం బరమంబులగు నప్సరస్సంభోగాదుల నొసంగును.

ఇట్లు, దేహాదులయందు ఆత్మత్వభ్రాంతిగలవారలు, కర్తృత్వావిష్టులై, యన్యోన్యఫలంబులం గోరి యన్యోన్యకర్మంబుల నాచరించుచు, ఇచ్చటికిని అచ్చటికిని గతాగతంబులు పొందుచుందురు. ఈభ్రాంతియె యవిద్య యనంబడు. ఈగతాగతంబె సంసారమనంబడును. ఇస్వసంబున అవిద్యావశమైన ప్రవృత్తిగలవారలకు, ఆస్థితియందె తత్తదనురూపంబుగాఁ బ్రవృత్తియు ఫలంబులను గల్గించుచుఁ, బ్రవృత్తిధర్మము వారలు మఱియుం గవస్థితిఁ బడకుండునట్లును క్రమముగా సత్త్వోత్కర్షము నొందునట్లును గావించును.

ఇట్లు పెద్దయుం గాలమునకు పుణ్యపరిపాకవిశేషంబునం జేసి, కర్మజన్యంబగుట వలనఁ దన్ఫలంబెల్ల నశ్వరంబనియు దుఃఖమిశ్రం బగుటవల

నఁ బరమార్థమున దుఃఖమే కాని సుఖము కాదనియు నిట్టిదుఃఖసంసారము పరమదుస్సహమనియుఁ దెలిసికొనఁగలరు. అంతనిర్విణ్ణులై సద్గురువు నాశ్రయింపఁగలరు. దయాళుఁడగుసద్గురువు నుపదేశంబును శాస్త్రంబు ననుసరించి, వారలు ఫలాభిసంధి వదలి విహితకర్మంబుల యథావిధి ననుష్ఠింపుచు నిషిద్ధంబుల వర్జింపుచుఁ జిత్తశుద్ధియు దానంజేసి వైరాగ్యము మొదలగు సాధనచతుష్టయంబునుం బొంది, ఈమహాదుఃఖము, పరమానందరూపమయిన యాత్మను దెలిసికొన్నం గాని తీఱదనియుం దెలిసి, సర్వానర్థనివారకంబగు నాత్మజ్ఞానంబునకై ప్రయత్నింతురు.

అట్టివారలకు నివృత్తిధర్మమునందధికారము. నివృత్తిధర్మమనఁగా నాత్మజ్ఞానమునకు అంతరంగ సాధన మయిన యాత్మ విచారము. విచారమున నసమర్థులకు విధింపఁబడిన యుపాసనాదులునునివృత్తిధర్మమునందె యంతర్భావంబునొందు. విచారంబునం జేసి యాత్మ తెలియనగును. ఆత్మజ్ఞానంబు గలుగఁ గానే సర్వానర్థనివృత్తియగును.

ఈ ధర్మద్వయంబును ఉపదేశంబు మూలంబుననె తెలియఁదగినదికావున, దీని యుపదేశార్థమయి, భగవద్విభూతిరూపిణియగు శ్రుతి లోకహితంబు ప్రవర్తించుచున్నది.

ఈధర్మము, అధర్మమతిశయించుట వలన, అప్పుడప్పుడు క్షయించును. జనులు శ్రుతివాక్యంబుల శ్రద్ధలేనివారలగుదురు. అట్టి సమయంబులందు, లోకానుగ్రహార్థ ధృతకల్యాణగుణ శరీరుఁడగు పరమేశ్వరుండు, మాయచే, మనుష్యాది రూపంబున నవతరించి, ధర్మస్థాపనంబు సేయును. ఈయర్థము భగవంతుఁ డర్జునునకుం జెప్పెను "యదాయదాహిధర్మస్య గ్లానిర్భవతిభారత । అభ్యుత్థాన మధర్మస్య తదాత్మానం సృజామ్యహమ్". అట్లు కావునఁ, గల్యాదియందు, అధర్మంబు పెంపున ధర్మం బభిభూతం బగుటయు, పరమేశ్వరుండు, కుమారస్వామిచేఁ గుమారిలభట్టరూపంబున దుర్మతనిర్మథనపూర్వకంబుగా కర్మకాం

డంబు సంస్థాపితంబు గావించి, జ్ఞానకాండోద్ధారార్థముయి, తాను శ్రీ మచ్ఛంకర భగవత్పాదరూపంబున నవతరించెను. శ్రీశారీరకసూత్రభాష్యాద్యనేకగ్రంథములచే, ఆత్మతత్త్వంబు భరతఖండంబంతయు నఖండంబుగాఁగలయు వెలయునట్లు గావించెను.

మందమతుల కమ్మహాగ్రంథంబులందు అవకాశంబు గలుగదు కావునఁ, బరమ దయాసాగరుండగు నా శంకరదేశికవరుండు వారలకును ఆత్మతత్త్వంబుకరతలామలకంబగు నట్లు, శ్రీగుర్వనుగ్రహంబునను భగవత్ప్రసాదంబుననుం దక్క సంసారరూపంబగు నీమహానర్థంబుతొలంగదని యుం దెలుపుచు, శ్రీగురుమూర్తి శ్రీదక్షిణామూర్తి స్తోత్ర రూపంబగులఘుప్రకరణంబు నుపదేశించెను. అయ్యది యాంధ్రభాషామాత్ర పరిచయము గలవారికి దుర్బోధమగుటవలన,తదుప కారార్థముయి, సుబోధంబునునీ తెనుఁగులఘువివరణంబు వ్రాయఁబడుచున్నది.

ఆస్తోత్రంబునకిది మొదటిశ్లోకము.—

అందు, ఆత్మస్వరూపము అనిర్వచనీయము.ఆ యాత్మనునిరూపించి "అదియాత్మకాదు" అని వేదాంతములు బోధించును.అట్లువారిశేష్యంబునఆత్మతత్త్వము దెలియఁదగినది. మఱియుఁబ్రసిద్ధానువాదంబుననప్రసిద్ధంబునిరూపించుటసుకరము. అట్లుకావున,ఇందుమొదట, దృశ్యమైజ్ఞానప్రతిబంధకమైన ప్రపంచముస్వరూపము నిరూపించి తద్బాధచేతత్మబోధము చెప్పఁబడుచున్నది.

విశ్వం దర్పణ దృశ్యమాన నగరీ తుల్యం నిజాంతర్గతం
పశ్యన్నాత్మని మాయయా బహిరివోద్భూతం యథా నిద్రయా।
యస్సాక్షాత్కురుతే ప్రబోధసమయే స్వాత్మానమేవాద్వయం
తస్మై శ్రీ గురుమూర్తయే నమ ఇదం శ్రీదక్షిణామూర్తయే॥

దర్పణదృశ్యమాన నగరీతుల్యమ్ — అద్దమునందుఁ జూడఁబడుచున్నపట్టణముతో సమానమునది యు

| | |
|---|---|
| నిజఅంతర్గతమ్ | తనలోనఉండునదియుఅగు |
| నిద్రయా | నిదురచేత |
| యథా | ఎట్లో |
| తథా | అట్లు |
| ఆత్మని | ఆత్మవిషయమై |
| మాయయా | మాయచేత |
| బహిః | వెలుపల |
| ఉద్భూతమివ(స్థితం) | పుట్టినట్లున్నదియునగు |
| విశ్వం | ప్రపంచమును |
| పశ్యన్ | చూచుచు |
| యః | ఎవ్వఁడు |
| ప్రబోధసమయే | జ్ఞానకాలమునందు, మేలుకువ కాలమునందు |
| అద్వయం | రెండవదిలేని |
| స్వాత్మానమేవ | తనస్వరూపమునే |
| సాక్షాత్కురుతే | చూచునో |
| తస్మై | అట్టి |
| శ్రీగురుమూర్తయే | శ్రీమంతుఁడగుజ్ఞానోపదేష్ట యొక్క రూపముగల |
| శ్రీదక్షిణామూర్తయే | శ్రీదక్షిణామూర్తికొఱకు (శ్రీయుక్తుఁడును దక్షిణ దిక్కునకభిముఖమై నఆకారముగల దేవునికొఱకు) |
| ఇదం | ఈ |
| నమః | నమస్కారము |
| (అస్తు | అగుఁగాక.) |

ప్రతిబింబితమగు పట్టణము అద్దములో నుండునట్లు ఈప్రపంచ మంతయు ఆత్మలోనే యుండును. అయినను, సూర్యునియందు గుడ్లగూబ మొదలగువాని కంధకారము దోఁచునట్లు, కామాదిదూషితులగువారలకు "నన్నునే నెఱుంగను" అను ననుభవముచే ఆత్మయందజ్ఞానముదోఁచుట దెలియుచున్నది. ఈయజ్ఞానమె మాయయొక్క యావరణ శక్తి యనఁబడును. నిదుర యందు, సంస్కారాది సహకారమున మనస్సుచేఁ గల్పితమయిన స్వప్న ప్రపంచమంతయుఁ దనకన్న వేఱుగా లేనిదయినను అజ్ఞానముచేఁ దనకన్నను వెలుపల వేఱుగాఁ దోఁచువిధంబున, ఆత్మలోనెయుండు నీజాగ త్ప్రపంచంబును ఈ యజ్ఞానంబున ఆత్మకన్నను వేఱుగాఁ దోఁచుచున్నది. ఇది మాయయొక్క విక్షేప శక్తి యనఁబడును. మేలుకొనఁగానే స్వప్న ప్రపంచ మంతయు మఱుఁగు పడి తానుమాత్రము ఉండుట దెలియునట్లు, అజ్ఞానము నశించి యాత్మజ్ఞానముగలుగఁగానే, తానుమాత్రమెయుండునట్లును, ఈప్రపంచమంతయు తనలోనే యుండునదే గాని తనకన్న వేఱుగా నట్లును దనకన్న వేఱువస్తువు లేనట్లును బరమార్థము దెలియును- ఈప్రకారము పరతత్త్వము దెలిసి భక్తులకు జ్ఞానోపదేశార్థమయి గురుమూర్తిగా నవతరించినట్టి శ్రీదక్షిణా మూర్తికి నమస్కారము. అని, తాత్పర్యము.

అవతారిక.— ఆత్మలో నుండు ప్రపంచమె మాయచే వెలుపలఁ దోఁచుచున్నదని చెప్పంబడినది. ఇందుకుమతాంతరీయులువచించెదరు.

పూర్వపక్షము."ఆత్మలోఁబ్రపంచమెట్లుండును?ఆత్మనిర్విశేషముగదా! అట్టియాత్మయందుఈనానావిధమయినప్రపంచముఎట్లుండును?మఱియు మన్నుఘటమునకుఁగారణమగుటవలన మంటియందుఘటమున్నదనుటయొప్పును. ఆత్మప్రపంచమునకుఁ గారణముకాఁజాలదె. కారణమగు పక్షమున నారంభకమా? పరిణామియా? మొదటిదికాదు. ఒకఁడై చిత్స్వరూపుఁడైనయాత్మ నానావిధమయి జడమయిన ప్రపంచంబున కారంభకమెట్లగును? ఆరంభక మెట్టిదో ఆరబ్ధమయిన కార్యమును అట్టిది

గానే యుండవలయును. తంతువులచే నారబ్ధమైన వస్త్రము తంత మయమే యగును, తంతువులరూపమెట్టిదో యట్టిదే వస్త్రరూపమగును ఆత్మచేఁ బ్రపంచమారబ్ధమగునేడఁ బ్రపంచము నాత్మవలెనేకరూపముఁ జిద్రూపముఁ గావలెను. అట్లు పరిణామియుఁ గాదు. నిరవయవుఁడు నిర్వికారుఁడునగు నాత్మయందుఁ బరిణామవికారమెట్లు సంభవించును? కావున, పృథివీజలతేజో వాయుభేదముల నాలుగువిధములును నిత్యములునగు పరమాణువులు ప్రపంచారంభకములు. వానియందే ప్రపంచమున్నది. అని వైశేషికులును, సత్త్వరజస్తమోగుణాత్మకమయినజడమగు ప్రధానమె ప్రపంచాకారమునం బరిణమించును. పరమార్థంబున దానియందే యది యుండును. అని సాంఖ్యులును వకాణింతురు.

సిద్ధాంతము. అదిసరికాదు. అచేతనమయినప్రధానము చేతనసహకారములేక యెట్లు ప్రపంచముగల్గించును? లోకమునందు అచేతనములు రథాదులు చేతనములయినయశ్వాదులసహకారముచేతనే కార్యము గల్గించుటఁ జూచుచున్నారము. కారణమెట్టిదో దానికార్యమునట్టిదిగానేయుండునుగావునజడమయినప్రపంచమునకుఁ జేతనాత్మ కారణము కాఁజాలదని చెప్పుచున్నారు. అప్పుడు తన్మతముననిత్యములని చెప్పఁబడినపరమాణువులవలన ననిత్యమయిన కార్యప్రపంచమెట్లుగలుగవచ్చును? మఱియుఁ బరమాణువులు పరస్పరము సంయోగము నొందుటకుఁ గర్మ కలుగవలెను. ఆకర్మకు నిమిత్తము చేతనుఁడు కావలెను. కానిచో, అచేతనములయిన పరమాణువులందుఁ జేతనసహకారము లేకయె యెట్లు ఆద్యకర్మము పుట్టును? పురుషప్రయత్నము నిమిత్తమనుటకు వీలులేదు. తన్మతమున ఆత్మయునచేతనము. శరీరప్రతిష్ఠమయిన మనస్సుతో సంయోగము నొందినపిదపఁ జైతన్యముగలిగి ప్రయత్నాది గుణముల నొందును. కావునఁ, బరమాణువులయందు స్వయముగాఁ గాని పురుష ప్రయత్నమునఁ గాని రెండువిధములను ఆద్యకర్మ గలుగుట కవకాశములేదు. అచేతనమయిన కారణమువలన నచేతన కార్యమె గలుగుననుట [illegible]

నుంగానరాదు. అచేతనములయిన గోమయాదుల వలనఁ జేతనము లయిన వృశ్చికాదులు గలుగుట గనఁబడు చున్నది. కాఁబట్టి యాత్మయె కారణమనుట యకలంకము.

ఇదిగాక, అతీంద్రియ మయిన యర్థమందు శబ్దమె ప్రమాణము. హేతువుండుచోట నంతటను సాధ్యముండుటయు సాధ్యము లేనిచోట హేతువు లేకుండుటయుఁ బ్రత్యక్షముచే సిద్ధమయి నపుడు మాత్రమే, హేతువుఁజూచినచోట సాధ్య మనుమానింపఁబడును. పట్టి యూహ యథార్థమగుట సిద్ధముకాదు. వేదాఖ్యమయినశాస్త్రప్రపంచము ఈశ్వరవిభూతియవుటవలన యథార్థము బోధించును. శాస్త్రము నందుఁ బ్రధానము కారణమనిగాని పరమాణువులు కారణములని గాని యుదాహరింపఁ బడలేదు. ఆత్మ కారణమనియె చెప్పఁబడెనది. అది యె వాస్తవ మవుటవలన నాశ్రయణీయము. ఈ యభిప్రాయంబున నీ శ్లోకము చెప్పఁబడుచున్నది. —

బీజస్యాంతరి వాంకురో జగదిదం ప్రాఙ్నిర్వికల్పం పున
ర్మాయాకల్పిత దేశకాలకలనా వైచిత్ర్య చిత్రీకృతమ్।
మాయావీవ విజృంభయత్యపి మహా యోగీవ యస్స్వేచ్ఛయా
తస్మై శ్రీగురుమూర్తయే నమ ఇదం శ్రీదక్షిణామూర్తయే॥

| | |
|---|---|
| ఇదమ్ | ఈ |
| జగత్ | ప్రపంచము |
| బీజస్య | విత్తనముయొక్క |
| అంతః | లోపల |
| అంకుర ఇవ | మొలకవలె, ఇది యుపలక్షణము, మొలక మొదలయినవివలె ననుట. |
| ప్రాక్ | మున్ను |
| నిర్వికల్పమ | భేదములేనిదిగా |

| | |
|---|---|
| (ఆసీత్ | ఉండెను) |
| పునః | పిమ్మట |
| మాయాకల్పిత దేశకాలకలనా వైచిత్ర్యచిత్రీకృతమ్ | మాయచేఁగల్పింపఁ బడిన దేశకాలములయొక్క సంబంధముల యొక్క నానావిధతచేత నానావిధము గాఁజేయఁబడినది |
| (ఆసీత్ | ఆయెను) |
| (తత్ | అట్టిజగత్తును) |
| యః = | ఎవఁడు |
| మాయావీవ | ఐంద్రజాలికునివలెను |
| మహాయోగీవ | గొప్పయోగివలెను |
| స్వేచ్ఛయా | తనయిచ్ఛచేత |
| విజృంభయతి | చేలరేఁగునట్లు చేయుచున్నాఁడో |
| తస్మై | అట్టి |
| శ్రీగురుమూర్తయే | శ్రీమంతుఁడగుజ్ఞానోపదేష్టయొక్క రూపముగల |
| శ్రీదక్షిణామూర్తయే | శ్రీదక్షిణామూర్తికొఱకు |
| ఇదమ్ | ఈ |
| నమః | నమస్కారము |
| అస్తు | అగుఁగాక |

ఈజగత్తు ఉత్పన్నమగుటకు మున్ను నామరూపములు మొదలగు భేదమేమియులేక నిర్వికల్పముగానే యుండెను. వృక్షము మొలుచుటకు మున్ను అంకురము పత్రము పుష్పము ఫలము శాఖలు మొదలగు భేదములు లేక యెట్లుబీజమునందు బీజముకన్నఁనభిన్నమై బీజరూపముగానేయుండెనో, అట్లుప్రపంచంబును ఉత్పత్తికిమునుపు ఆత్మయందు అభిన్నమయి ఆత్మరూపముగానేయుండెను. పిమ్మట దేశకాలములు మొదలగువాని

చేరికచే బీజమునుండి ఆపత్త్రపుష్పాది భేదములతో వృక్షము తోఁచుచున్న ట్లు మాయచేఁ గల్పింపఁబడిన దేశకాలాదుల సంబంధమువలన ప్రపంచము నామరూపాదులగు నానావిధ భేదములతోఁ దోఁచుచున్నది. మాయయుఁ గల్పితము, ఇంద్రజాలికుఁడు వస్తువుల యథార్థరూపమును మఱుఁగుపఱచి చూపరులకుఁ దనయిచ్ఛచొప్పునవాని వేఱువిధముగాఁ దోఁచునట్లు గావించును, విశ్వామిత్రాది యోగులును సృజింపఁదలఁచినపుడు తమహృదయమున మొదట సంకల్పమాత్రముగా నున్నదానినె వెనుక యోగశక్తిచే నామరూపాదులతోఁగూడిన వస్తువుగాఁగల్పింతురు, అవ్విధమునఁబరమార్థముచే లేని నామరూపాది నానావిధ భేదములతోఁగూడినయీప్రపంచమునునెవఁడువిజృంభింపఁజేయుచున్నాఁడో అట్టి భక్తులకుజ్ఞానోపదేశార్థమయి గురుమూర్తిగా నవతరించిన దక్షిణామూర్తికినమస్కారము. అని తాత్పర్యము.

అవతారిక.— మఱియు జడమయిన ప్రధానము కారణమగుపక్షమున, జడముప్రకాశములేనిది కావునఁ దత్కార్యమయిన జగత్తునకును బ్రకాశములేకుండవలెను. జడముజ్ఞానములేనిది, ఇతరులకు జ్ఞానమెట్లుపదేశింపఁగలదు? కాఁబట్టి జ్ఞానోపదేష్టయే సంభవింపకపోవును. ఇంతియగాక, జగత్కారణముఁ దెలిసినచో మోక్షంబుగలుగునని శాస్త్రమువక్కాణించుచున్నది. జడమయిన ప్రధానము కారణమను వాదమున నుపపన్నముకాదు. ఈయభిప్రాయమున నీశ్లోకము వచింపఁబడుచున్నది.

యస్యైవ స్ఫురణం సదాత్మక మసత్కల్పార్థగం భాసతే
సాక్షాత్తత్త్వమసీతి వేదవచసా యో బోధయ త్యాశ్రితాన్।
యత్సాక్షాత్కరణాద్భవేన్నపునరావృత్తి ర్భవాంభోనిధౌ
తస్మై శ్రీగురుమూర్తయే నమ ఇదం శ్రీదక్షిణామూర్తయే॥౩॥

| | |
|---|---|
| యస్య | ఎవనియొక్క |
| సత్ ఆత్మకమ్ | సద్రూపమయిన, ఉండుస్వభావముగల యనుట |
| స్ఫురణమేవ | ప్రకాశమే |
| అసత్కల్పఅర్థగం | ఉన్నవానితో సమానములు కాని యర్థములనుబొందినదిగా |
| భాసతే | ప్రకాశించుచున్నదో |
| యః | ఎవ్వఁడు |
| ఆశ్రితాన్ | భక్తులను |
| తత్త్వమసిఇతివేదవచసా | తత్త్వమసి (తత్ ఆబ్రహ్మము త్వమ్ నీవు అసి అగుదువు)అనువేదవాక్యముచేత |
| సాక్షాత్ | ప్రత్యక్షముగా |
| బోధయతి | తెల్పుచున్నాఁడో |
| యత్సాక్షాత్కరణాత్ | ఎవ్వని ప్రత్యక్షముగాఁ దెలియుటవలన |
| భవఅంభోనిధౌ | సంసారమనుసముద్రమునందు |
| అపునరావృత్తిః | మఱలవచ్చుటలేమి |
| భవేత్ | అగునో |
| తస్మై | అట్టి |
| శ్రీగురుమూర్తయే | శ్రీజ్ఞానోపదేష్టయొక్క రూపముగల |
| శ్రీదక్షిణామూర్తయే | శ్రీదక్షిణామూర్తికొఱకు |
| ఇదమ్ | ఈ |
| నమః | నమస్కారము |
| అస్తు | అగుఁగాక |

ఆకాశము మొదలగు నర్థములు ఉండునవిగాఁ గాన్పించుచున్నవేకాని పరమార్థముననుండునవికా ఉండునవియగు పక్షమున సుషుప్తియందును ఏలయుండునట్లు కాన్పింపవు? మఱియునివిజడములు- అద్దమునం

దుఁగనఁబడు ప్రతిబింబము అధిష్ఠానమయిన బింబముయొక్క రూపమే యగునట్లు వీనియందుఁదోఁచునట్టి సత్తయుఁ బ్రకాశంబును అధిష్ఠానమయిన యీశ్వరునివిగానున్నవో ఎవ్వఁడు తానే సర్వమునకు నధిష్ఠానమగుటచే సర్వముఁ దెలిసినవాఁడు కావున భక్తులకుఁ దత్త్వమస్యాది మహావాక్యములచే నపరోక్షముగాఁ దత్త్వముపదేశించునో, ఎవ్వని అపరోక్షముగా నేనే యతఁడని తెలిసినవాఁడు మఱలసంసారంబు నొందకుండునో, అట్టిజ్ఞానోపదేశార్థము గురుమూర్తిగా నవతరించిన దక్షిణామూర్తికి నమస్కారము. అని, తాత్పర్యము.

అవతారిక.— ఆత్మయందె జ్ఞాన ప్రకాశములు చెప్పఁబడినవి. చక్షురాదికములయిన యింద్రియములందును జ్ఞానము కనఁబడుచున్నది. జగత్తునందును సూర్యాదులందుఁ బ్రకాశము చూడఁబడుచున్నది. ఆత్మయందే జ్ఞానప్రకాశము లనుట యెట్లు?

చక్షురాదులయందుజ్ఞానముకలదనుటసరిగాదు. సూర్యాదులసహకారముకలిగినప్పుడె చక్షురాదులయందు గ్రహణశక్తి కనఁబడుచున్నది. మనస్సు విషయాంతరమునందగిలియున్నప్పుడును ఆగ్రహణశక్తిలేదు. కాఁబట్టి యిట్టిగ్రహణశక్తి యింద్రియముల దనుట యుక్తము గాదు. శరీరమునందు అంతఃకరణ ప్రతిబింబితుఁడైనయాత్మయొక్క స్వరూపమయినజ్ఞానమే చక్షురాదిద్వారమున వెలువడుచున్నదే గాని వేఱు గాదు. అప్పుడు, అంతఃకరణధర్మము నావరించు సుషుప్తియందును అంతఃకరణభేదమయిన మనస్సు అన్యగతమగునప్పుడును చక్షురాదులయందుఅట్టిగ్రహణశక్తి లేకయుండుట యుపపన్నమగును. సూర్యాదులది మనకు అంధకారనివర్తకమవుటం బ్రకాశముగాఁ దోఁచుచున్నది. గుడ్లగూబలు మొదలగువాని కంధకారముపుట్టించుచున్నది. ఆగుడ్లగూబలుమొదలగు వానినేత్రములువిషయములనెట్లు గ్రహించుచున్నవి? విషయగత ప్రకాశముచేతనే యని చెప్పవలెను. కాఁబట్టి, దీపములు మొదలగునవి స్వప్రకాశము

చేతనే చక్షురాదులకు గ్రాహ్యములగునని చెప్పఁదగి యుండునట్లు, ఘటాదికములయిన సమస్తవిషయములను స్వస్వగ్రాహకములయిన ప్రకాశము గలిగియున్నవనుట యుక్తము. ఆ ప్రకాశము వానికిసహజమయిన చో నెల్లప్పుడును గలిగియుండును. చక్షురాదిద్వారమున నంతఃకరణ సన్నికర్షము గలిగినప్పుడే వానియందది కనఁబడుచున్నది. లేనియప్పుడు లేదు. అంతఃకరణమునందును ఆత్మప్రతిబింబము వలననే జ్ఞాన ప్రకాశములు. విచారింపఁగా జ్ఞానప్రకాశములు పర్యాయములనఁదగును. సుషుప్తియందు అంతఃకరణము అవ్యక్తమయి యుండునప్పుడు అంతఃకరణ ధర్మములయినసంకల్పాదులన్నియుఁ దోఁచకయుండఁగా, జ్ఞానము లేక ప్రకాశము మాత్రము దోఁచుటవలన, నదియప్పుడా వృతముగాకయున్నఆత్మయొక్క ధర్మమేయనియూహింపఁదగును. ఇవ్విధమునఅధిష్ఠానమయినయాత్మయొక్క ప్రకాశముచేతనే సమస్తప్రపంచము ప్రకాశించుచున్నదనుట సిద్ధము. అట్లు" యస్యభాసాసర్వమిదంవిభాతి" (ఏయాత్మయొక్క ప్రకాశముచే ఈసమస్తము ప్రకాశించుచున్నదో.) అని భగవతియగు శ్రుతి యుపదేశించుచున్నది. అంతఃకరణమునందు ఆత్మప్రతిబింబితుఁడై యుండును. బింబచైతన్యమునందు ఘటాదివిషయ మధ్యస్తము. విషయేంద్రియ సంప్రయోగమునందు, చక్షురాదిద్వారమున నంతఃకరణము ఘటాదులనొంది తదధిష్ఠానమయిన బింబచైతన్యమున కుపాధియగును. మొదలె యంతఃకరణమునందు సాక్షిచైతన్యము ప్రతిబింబితమైయుండు. సాక్షిచైతన్యమునకును విషయాధిష్ఠాన చైతన్యమునకును అంతకరణమొకటియె యుపాధియగుటవలన, సాక్షిచైతన్యముతో నధిష్ఠానచైతన్యము కలియును. అప్పుడు సాక్షిచైతన్యముచేఁ దదజ్ఞాననివృత్తియగుటయు ఘటాది విషయముభాసిల్లును. ఈయభిప్రాయముచే నీశ్లోకము చెప్పఁబడుచున్నది.

నానాచ్ఛిద్ర ఘటోదరస్థిత మహా దీపప్రభా భాస్వరం
జ్ఞానం యస్యతు చక్షురాది కరణ ద్వారా బహి స్స్పందతే।

జానామీతి యమేవభాంత మనుభా త్యేత త్సమస్తం జగత్

తస్మై శ్రీ గురుమూర్తయే నమ ఇదం శ్రీదక్షిణామూర్తయే॥౪॥

నానాచ్ఛిద్ర ఘటోదరస్థిత మహాదీపప్రభా భాస్వరమ్,

| | |
|---|---|
| నానాఛిద్ర | అనేకములయిన రంధ్రములుగల |
| ఘట | కుండయొక్క |
| ఉదర | మధ్యమునందు |
| స్థిత | ఉన్న |
| మహాదీప | గొప్పదీపముయొక్క |
| ప్రభా | కాంతివలె |
| భాస్వరమ్ | ప్రకాశించునదియయిన |
| యస్య | ఏయాత్మయొక్క |
| జ్ఞానమ్ | చైతన్యము |
| చక్షురాదికరణద్వారా | నేత్రములు మొదలుగాఁగల యింద్రియములయొక్క ద్వారముచేత |
| బహిః | వెలుపల |
| స్పందతే | ప్రసరించుచున్నదో |
| జానామి | ఎఱుంగుచున్నాను |
| ఇతి | అని |
| భాంతమ్ | ప్రకాశించుచున్న |
| యమేవ | ఏయాత్మనే |
| ఏతత్ | ఈ |
| జగత్ | ప్రపంచము |
| సమస్తమ్ | అంతయు |
| అను | వెంబడించి |
| భాతి | ప్రకాశించుచున్నదో |

| | |
|---|---|
| తస్మై | అట్టి |
| శ్రీగురుమూర్తయే | శ్రీమంతుఁడగు గురువుయొక్క యాకారముగల |
| శ్రీదక్షిణామూర్తయే | శ్రీమంతుఁడైన దక్షిణామూర్తికొఱకు |
| నమః | నమస్కారము. |

ఈదేహము నేత్రము మొదలగు నింద్రియములు అను ననేకరంధ్రములు గలది. అట్టిదేహమునందంతటను చైతన్యస్వరూపుఁడగు నాత్మ నిండియుండును. కాఁబట్టి, పెక్కురంధ్రములతోఁగూడిన కుండయందు గొప్పదీపము యొక్క కాంతి యాఘటమునందంతటను నిండి రంధ్రములమూలంబున వెలుపలికిఁ బోవునట్లు, ఏయాత్మయొక్క స్వరూపమయిన చైతన్యము దేహమందంతటను నిండి చక్షురాదికములయిన దేహరంధ్రములనుండి వెలువడుచున్నదో; ఏయాత్మ "తెలియుచున్నాను" అని జ్ఞానస్వరూపముచేఁ బ్రకాశించుచుండఁగాఁ దత్ప్రకాశమువలన ఈనానావిధమయిన సూర్యాదికమగు సమస్త ప్రపంచమును, ఇంద్రియసంప్రయోగంబునందు ఇంద్రియానుగతమయిన నంతఃకరణమునందు తత్ప్రతిబింబము సంబంధముచేఁ బ్రకాశమునొందుచున్నదో, అట్టి జ్ఞానోపదేశార్థము గురుమూర్తిగా నవతరించిన శ్రీదక్షిణామూర్తికి నమస్కారము. అని తాత్పర్యము.

అవతారిక.— ఆత్మయె సమస్తప్రపంచమునకుఁ గారణమనియు ఆత్మ సచ్చిదాత్మకమనియుఁ జెప్పఁబడినది; ఈయాత్మతత్త్వము గురూపదేశవిచారాదులవలననె గ్రహించుటకధికారము లేనివారలు, సగుణేశ్వరోపాసనము సేయవలెను. ఈశ్వరానుగ్రహంబున నద్వైతమునందు శ్రద్ధయుదయించును, లేనియెడ దేహాదులయందు ఆత్మభ్రాంతి నశింపదు. అట్లు "ఈశ్వరానుగ్రహాదేవ పుంసా మద్వైతవాసనా । పాపోపహతబుద్ధీనాం తద్వార్తాపినరోచతే" (ఈశ్వరానుగ్రహము వలననె పురుషులకద్వైతవాసన కలుగును, పాపముచే నుపహతమయిన బుద్ధిగలవారలకు దాని వార్తయేనియు రుచింపదు) అనివచింతురు. ఈయర్థము చెప్పఁబడుచున్నది.

దేహం ప్రాణమపీంద్రియాణ్యపి చలాం బుద్ధించ శూన్యం విదుః
స్త్రీబాలాంధజడోపమాస్త్వహమితి భ్రాంతా భృశంవాదినః
మాయాశక్తివిలాసకల్పితమహావ్యామోహసంహారిణే
తస్మై శ్రీగురుమూర్తయే నమఇదం శ్రీదక్షిణామూర్తయే॥౫॥

స్త్రీబాలఅంధజడఉపమాః  స్త్రీలతోను బాలురతోను గ్రుడ్డివారితోను మూర్ఖులతోనుబోలికగలవారలును (స్త్రీలుసాధారణముగాగృహకృత్యములునిర్వర్తించుటయందు నియమింపఁబడియుండుటవలనను ప్రసవించుటయుశిశువులఁబోషించుటయు మొదలయినకార్యములయందుదైవసంకల్పంబుననే స్వభావనియతలగుటవలనను అధికవిద్యాభ్యాసము శాస్త్రార్థ విచారము గురుశుశ్రూష లోకానుభవము మొదలగుజ్ఞానోపయోగివిషయములయందు వారలకుఁ బ్రవృత్తియునైపుణ్యముంగలుగుటకు సాధారణముగా నవకాశములేదు, కావున వారలు తెలియనివారలకు ఉపమానముగాఁజెప్పఁబడిరి. ఇట్లే ప్రాయికముగా విద్యాభ్యాసాదుల యందు సామర్థ్యము పొందుట కవకాశము లేనివారను నభిప్రాయమున, బాలురు జాత్యంధులు జడులు తెలియనివారికుపమానముగా నుదాహరింపఁబడిరి)

భృశమ్ — మిక్కిలియు
భ్రాంతాః — భ్రమించిన వారలునగు
వాదినః — వాదించువారలు
దేహమ్ — శరీరమును
ప్రాణమపి — ప్రాణమును
ఇంద్రియాణ్యపి — ఇంద్రియములను
చలామ్ — చలించునట్టి, చంచలమయిన
బుద్ధిమ్ — విజ్ఞానమును

| | |
|---|---|
| శూన్యంచ | శూన్యమును, చకారముచే, మనస్సును అజ్ఞానోపాధిగల చైతన్యమును |
| అహమ్ ఇతి | నేను అని "నేను" అను శబ్దముచే జెప్పంబడినది అని |
| వదంతి | తెలిసికొనిరి |

మాయాశక్తివిలాసకల్పితమహావ్యామోహసంహారిణే,

| | |
|---|---|
| మాయా | మాయయొక్క |
| శక్తి | సామర్థ్యముయొక్క |
| విలాస | వ్యాప్తిచేత |
| కల్పిత | కల్పింపంబడిన |
| మహావ్యామోహ | గొప్పభ్రమమును |
| సంహారిణే | నశింపంజేయునట్టి |
| తస్మై | అట్టి |
| శ్రీగురుమూర్తయే | శ్రీమంతుండగు గురువుయొక్క యాకారముగల |
| శ్రీదక్షిణామూర్తయే | శ్రీదక్షిణామూర్తికొఱకు |
| నమః | నమస్కారము |
| అస్తు | అగుంగాక |

కొందఱు వాదులు నేను అనుటకు విషయమయినవస్తువు దేహమనియుం గొందఱు ప్రాణమనియుం గొందఱు ఇంద్రియములనియుం గొందఱు క్షణికవిజ్ఞానమనియుం గొందఱు అదివస్తువె కాదు శూన్యమనియుం గొందఱు మనస్సనియు మఱికొందఱు అజ్ఞానోపహితమయిన చైతన్యమనియు మొదలుగా ననేకు లనేక విధములం దలంచియున్నారు; వారలు స్త్రీలవలెను బాలురవలెను అంధులవలెను జడులవలెను దెలియనివారలు; భ్రాంతులు; మాయావిలాసముచే భ్రమమునొందినవారయి యాత్మతత్త్వము దెలియక యజ్ఞానాంధకారమునం బడియున్నారు. ఈశ్వరో

సనముచేసి యీశ్వరానుగ్రహము నొందినంగాని మాయతొలఁగి భ్రమమునశింపదు- భక్తులకు మాయావరణము దొలఁగించి దానివలనవచ్చిన అట్టి భ్రమాంధకారమును బోఁగొట్టునట్టి జ్ఞానోపదేశార్థమయి గురుమూర్తిగానవతరించిన శ్రీదక్షిణామూర్తికినమస్కారము.

**అవతారిక.**— దేహాద్యాత్మవాదములలో శూన్యాత్మవాదము మొదట **నిరాకరింపఁబడుచున్నది.**

పూర్వపక్షము.— శూన్యవాది చెప్పుచున్నాఁడు. "సుషుప్తియందు ఏమియులేకుండుటవలన శూన్యమెతత్త్వము. కాలాంతరమునందుమాత్రమే దోఁచునది సత్యముకాఁజాలదు. సుషుప్తియందు సర్వప్రవిలయంబనుభవసిద్ధము"

సిద్ధాంతము.— ఆశూన్యవాదినిబృచ్ఛింపవలెను. సుషుప్తియందు సర్వప్రవిలయం బెట్లు తెలియవచ్చెను? అనుభవమువలన ననివచించును. సుషుప్తియం దేమియులేదే, అనుభవించువాఁడులేక యనుభవమెట్లుగలుగు? అనుభవితగలఁడనుట మాకుఁజాలు.

పూర్వపక్షము.— కాదు. సుషుప్తియందలి యనుభవమునంగాదు, జాగరితము నందుఁ దాత్కాలికమగు ననుభవము నపేక్షించి నిశ్చయింపఁబడుచున్నది. ఎప్పుడును ఎండదెలియనివాఁడగుటచేనీడయందలి సుఖవిశేషమెఱుంగని యొకానొకఁడు ఒకప్పుడు నీడను వదలి యెండకుఁ బోవుటసంభవించినప్పుడు తత్కాలంబున ననుభవింపఁబడుచున్న యెండచుఱుకునుబట్టి నీడయందుండుట నప్పుడనుభవింపకున్నను దదీయ సుఖవిశేషము దెలియుచున్నాఁడు. అట్లె జాగరితమునందు సుషుప్త్యనుభవములేకున్నను దాత్కాలికానుభవ తారతమ్యమును బట్టి సుషుప్తియం దేమియు లేకయుండుట దెలియఁబడుచున్నది.

**సిద్ధాంతము.**— సుషుప్తికిని జాగరిత మునకును దారతమ్యమా? లేక జాగరితమునందుమాత్రమే తారతమ్యమా? సుషుప్తిఅసాక్షికమ

గూడో మొదటిదియెట్లు సంభవించును? ఏకవస్తువునందు తారతమ్యజ్ఞానము సంభవింపదు కావున రెండవదియు సరికాదు. సుషుప్తియనుభవ మే లేనియతఁడు దానికిని మఱియొకదానికిని దారతమ్యము నెట్లు తెలియఁగలఁడు? ప్రతియోగ్యుపస్థితిలేనిచోఁ దారతమ్యజ్ఞాన ముదయింపదు. దీ దాహృతస్థలమునందు ఛాయాతపములు రెండును దారతమ్యజ్ఞానవిషయము లున్నవి కావున నది యనుదాహరణము. మఱియొకటి, నీడననుభవించినవాఁడే యెండ యనుభవించునపుడు నీడసుఖమని దెలిసికొనుచున్నాఁడు. ప్రతియోగి పరిజ్ఞానము లేమిచే నీడయందలి విశేషము స్ఫురింపలేదు: ఆతపమునను౦డునప్పుడు తదనుభవమును బట్టి విశేషస్ఫూర్తి యుదయించుట యుపపన్నము. కాఁబట్టి జాగ్రదవస్థయందు సుషుప్త్యనుభవజ్ఞానము సంభవింపదు. ఇఁక సుషుప్తియందనుభవిత లేనియెడ కాలత్రైకాలికమగు నసత్త్వాభావము సిద్ధింపదు. అందువలన అనుభవితమాత్రముండెనని చెప్పవలెను. ఇంతేకాదు, సుషుప్తి యందనుభవిత లేనియెడ జాగరితాదికమునందున్నాఁడనుట చోద్యమగును.

పూర్వపక్షము.— అయినను, నిదురించి లేచినపుడు నిదురయందు ఏమియుఁ దెలియకుండె ననియనుభవము గలుగుచున్నదే.

సిద్ధాంతము.— సుషుప్త్యనుభవము జాగరితమునందు సంభవింపదు కావుననే అదియనుభవము గాదు. అట్లు "తెలియకుండెను" అను భూతకాలక్రియచే భూతకాలికమగు ననుభవమె చెప్పఁబడుచున్నది. కాబట్టి యది సుషుప్త్యనుభూతస్మృతి. ఇంతియ గాదు. గాఢనిద్రఁ జెంది లేచినవాఁడు "సుఖముగా నిదురించితి ఏమియుఁ దెలియదయ్యె" అని సుషుప్తికాలికములగు సుఖాజ్ఞానములను స్మరించుచున్నాఁడు. స్మృతి యనుభవపూర్వకము. మఱియు, "మున్ను నిదురించితిని ఇప్పుడు మేలుకొనియున్నాను" అను ప్రత్యభిజ్ఞ జాగరితమునందున్న యాత్మ సుషుప్తియందుండినవాఁడని వ్యక్తీకరించుచున్నది. ఇట్లు సుషుప్తియందును అనుభవిత

నుటసిద్ధము. అస్వాప్సమితి జాగరితమునం దనుభూతమగు దాని జాగరితాంతరమునందు స్మరించుట యుపపన్నమగును. అవస్థాత్రయము నందును ఉనుస్యూతుండై యుండువాఁడగుటచేతనే యేక యవస్థయం దనుభవించినది యవస్థాంతరంబున స్మరింపఁ గలిగియున్నాఁడు. సుషుప్తియందు ఆవరకములయిన యంతఃకరణాదులు ఉపరతములగుటం జేసి యానంద స్వరూపుఁడయిన యాత్మ స్వరూపమయిన యానందము మాత్రము సుఖరూపమున స్ఫురించుచున్న దనుటయుక్తము. ఇట్లు ఆత్మసత్వదార్ఢ్యము సిద్ధించుచున్నది. మఱియు శూన్యమె తత్త్వమగునెడ బంధమోక్షపుణ్య పాప విధాయకమయిన సమస్తశాస్త్రము వ్యర్థమగును. కావున నది యెంతమాత్రము విశ్వసనీయముగాదు. ఈయర్థము చెప్పఁబడుచున్నది.

రాహుగ్రస్తదివాకరేందు సదృశో మాయాసమాచ్ఛాదనాత్
సన్మాత్రః కరణోపసంహరణతో భూద్యస్సుషుప్తః పుమాన్
ప్రాగస్వాప్సమితిప్రబోధసమయే యఃప్రత్యభిజ్ఞాయతే
తస్మై శ్రీగురుమూర్తయే నమఇదం శ్రీదక్షిణామూర్తయే ॥౬॥

| | |
|---|---|
| యః | ఏ |
| పుమాన్ | పురుషుఁడు |
| కరణోపసంహరణతః | ఇంద్రియములయొక్క ఉపసంహారము వలన |
| మాయాసమాచ్ఛాదనాత్ | మాయయొక్క ఆవరణము వలన |
| సన్మాత్రః | ఉన్నవాఁడుమాత్రమె యయినవాఁడై |
| రాహుగ్రస్తదివాకరేందుసదృశః | రాహువుచే మ్రింగఁబడినసూర్యునితోను చంద్రునితోసమానుఁడై |
| సుషుప్తః | నిదురించినవాఁడు |
| అభూత్ | అయ్యెనో |

| | |
|---|---|
| యః | ఏ యాత్మ |
| ప్రాక్ | మున్ను |
| అస్వాప్సం | నిదురించితిని |
| ఇతి | అని |
| ప్రబోధసమయే | మేలుకొనుసమయమునందు |
| ప్రత్యభిజ్ఞాయతే | గుర్తింపఁబడుచున్నాఁడో |
| తస్మై | అట్టి |
| గురుమూర్తయే | శ్రీమంతుఁడగు గురువుయొక్క యాకారముగల |
| శ్రీదక్షిణామూర్తయే | శ్రీదక్షిణామూర్తికొఱకు |
| నమః | నమస్కారము. |

ఏయాత్మ సుషుప్తియందు విశేషజ్ఞానములకుఁ గారణములయిన కరణములు ఉపసంహృతములగుటవలన సత్తామాత్రస్వరూపుఁడై స్ఫురించుచున్నాఁడో, అప్పుడు మాయావరణమును గల్గుటవలన ముక్తుఁడు గాఁడు కాబట్టి రాహుగ్రస్తులయిన సూర్యుఁడును జంద్రుఁడును బోలె స్పష్టముగాఁగాక మసకగాఁ దెలియఁబడుచున్నాఁడో, సూర్యుఁడును జంద్రుఁడును గ్రహణమునకు ముందును బిమ్మటను ఉండుటవలన గ్రహణమప్పుడును, జక్కఁగాఁ గనఁబడక పోయినను, ఉన్నారని తెలియునట్లు ఏయాత్మ, మాయావరణము వలన సుషుప్తియందును స్పష్టముగాఁ దెలియకున్నను సుషుప్తికిమున్ను బిమ్మటను ఉండుటవలన అప్పుడును ఉన్నాఁడని మాత్రము నిశ్చయింపఁబడుచున్నాఁడో, మఱియు మున్ను నిదురించితిని ఇప్పుడు మేలుకొనియున్నాను" అని ప్రత్యభిజ్ఞవలన జాగ్రదవస్థయందున్న ఏయాత్మ జాగరితమునందున్నట్లే సుషుప్తియందును ఉన్నాఁడని స్పష్టముగాఁ దెలియఁబడుచున్నాఁడో, అట్టి భక్తులకు జ్ఞానోపదేశార్థము గురుమూర్తిగా నవతరించిన శ్రీదక్షిణామూర్తికి నమస్కారము. అని తాత్పర్యము.

అవతారిక.— ఇఁకఁ దక్కిన వాదములు నిరాకరింపఁబడుచున్నవి.

పూర్వపక్షము.— కొందఱు చైతన్యము దేహధర్మమే కావున దేహమే ఆత్మయని చెప్పుదురు. ఏది దేనియందే కనఁబడునో మఱియొకచోఁ గనఁబడదో, అది దాని ధర్మమని చెప్పనొప్పును. చైతన్యము దేహమునందే కనఁబడుచున్నది మఱియొకచోఁ గనఁబడదు. కావున దేహధర్మమే యనఁదగును. మఱియు “నేను నడచుచున్నాను నిలుచుచున్నాను పోవుచున్నాను వచ్చుచున్నాను” అని దేహధర్మములయిన గమనాదులు “నేను” అని వ్యవహరింపఁబడు దానివిగా వ్యవహరింపఁ బడుచున్నవి. కావున దేహమే యాత్మయని యందురు.

సిద్ధాంతము.— అది సరికాదు. దేహమునందే యగపడుట వలనఁ జైతన్యము దేహధర్మమని వచించు పక్షమున, దేహమునందును కనఁబడకుండుటవలన దేహధర్మము కాదని యేల చెప్పగూడదు? మృతావస్థయందుఁ జైతన్యము దేహమునందుఁ గానరాదు, కాఁబట్టి, చైతన్యము దేహధర్మము కాదనియె వచించుట యుక్తము. మఱియు “నా దేహము” అను వ్యవహారమువలన నేను “అను దానికిని దేహమునకును భేదము కనఁబడుచున్నది. ఇంతియగాక బాల్యమునను౦డిన దేహము యౌవనంబున లేదు. ఆయవస్థలయందంతటను దేహము మాఱుచున్నది. తత్తత్కాలికములయిన దేహములకుఁ బరస్పరము భేదము ప్రత్యక్షము. “నేను” అనునదియో, ఎప్పుడును ఎంతమాత్రమును మార్పులేక యేకరసముగాఁ దోఁచుచున్నది, “మున్ను బాల్యము అనుభవించితిని, ఇప్పుడు యౌవనము అనుభవించుచున్నాను ’ అనునది మొదలయిన ప్రత్యభిజ్ఞలును అన్ని యవస్థలయందును నేను అనఁబడునదియొకటే యేకవిధముగా నుండునట్లు తెలుపుచున్నవి.

పూర్వపక్షము.— మఱియు, దేహాత్మవాదులు(?) పృథివ్యప్తేజో వాయువుల నాలుగుభూతములకంటె నితరము నంగీకరింపరు. ఆనాలుగుభూతముల సంయోగ విశేషమే చైతన్యము గలదందురు. పూగచూర్ణతాంబూలిదళములందుఁ బ్రత్యేకముగా దేనియందును లేనిమాదకశక్తి సంయుక్తములయిన యాపూగాదులయందుఁ గలుగుచున్నది. అట్లు చైతన్యము నాలుగు భూతములయందును బ్రత్యేకముగా లేనిదైనను సంయుక్తములయిన యాభూతచతుష్టయమునందుఁ జనించుచున్నదని చెప్పెదరు.

సిద్ధాంతము.— భూతచతుష్టయాత్మకమయిన శరీరము తెలియఁబడుచున్నది. ఇతరపదార్థము లేనియెడ నది సంభవింపదు. భూతచతుష్టయమే భూతచతుష్టయమును దెలియుననునెడఁ గర్మకర్తృవిరోధము వాసఁగును. నేత్రము తన్నుఁజూడఁజాలదు-అగ్నియగ్నిని దహింపఁజాలదు. అట్లు శరీరమును తన్నుఁదెలియఁజాలదు. కాఁబట్టి తెలియుపదార్థము శరీరముకన్న భిన్నముండవలెను. మఱియు, శరీరము తెలియునపుడు తెలియువానికన్నను భిన్నముగానే తెలియఁబడుచున్నది. కాఁబట్టి తెలియునది యాత్మ- దేహమది కాదు. గమనాదులు దేహధర్మములు ఆత్మయందధ్యస్తములవుచున్నవి. కావున ఆత్మ దేహముకాదు.

అట్లు ప్రాణమునుగాదు. ఒకానొకప్పుడు-"ఊపిరిపట్టలేకపోతిని" అనివ్యవహారము కనఁబడుచున్నది. అప్పుడు ఊపిరిపట్టువాఁడు ఊపిరి కన్నను భిన్నుఁడని తెలియఁబడుచున్నాఁడు.

ఇంద్రియములును ఆత్మ గావు. కండ్లు లేనివాఁడును నేను అని వ్యవహరించుటవలనఁ జక్షురింద్రియము ఆత్మ గాదు. ఇవ్విధంబుననె ఇతరేంద్రియములును ఆత్మ కావని తెలియంగునది. సుషుప్తియందు ఇంద్రియముల వ్యవహారము లేనపుడును ఆత్మ స్ఫూర్తియున్నది.

అట్లు క్షణిక విజ్ఞానమును ఆత్మ గాదు. [illegible]
[illegible] విజ్ఞానము. [illegible]

నుస్యూతమయి యున్నది. చతుర్థక్షణమునందు లేనివిజ్ఞానము సర్వావస్థలయందును అనుస్యూతమగుట యనుపపన్నము. ఒకవిజ్ఞానము నశించును, మఱియొకటిపుట్టును, అదినశించినపిదప నింకొకటిపుట్టును. ఇట్లువిజ్ఞానములు పరస్పర భిన్నములయి యున్నవి. ఇవియాత్మ యగుపక్షమున, "బాల్యమునందు జనివితిని, ఇప్పుడు యౌవనమునం బాఠము చెప్పుచున్నాను" అనునవి మొదలయిన సర్వావస్థలయందును నేను అనంబడు నాత్మయొకఁడె యున్నాడని దెలుపునట్టి స్మృతి ప్రత్యభిజ్ఞ లనుపపన్నములగును.

మఱియు ఈదేహాదులన్నియు "నాదేహము, నాప్రాణము, నాయింద్రియములు నాబుద్ధి" యని యాత్మ సంబంధితచేఁ దెలియవచ్చుచున్నవి. ఆత్మసంబంధి యాత్మయెట్లగును? భిన్నవస్తువులకేకాని సంబంధము ఘటిల్లదు. ఇవి "నావి" యని స్ఫురించుచున్నవి. ఆత్మ "నేను" అని స్ఫురించుచున్నాఁడు. కాఁబట్టి ఇవియాత్మ గావు. ఇట్లు దేహాదివ్యతిరేకమగు ఆత్మను, భగవత్పూజనమునను సద్గురూపదేశమునను దెలియనగునే కాని యొండువిధమునఁ దెలియుట యశక్యము. "తద్విద్ధి ప్రణిపాతేన పరిప్రశ్నేన సేవయా। ఉపదేక్ష్యంతి తే జ్ఞానం జ్ఞానినస్తత్త్వదర్శినః" "తేషాం సతతయుక్తానాం భజతాం ప్రీతిపూర్వకమ్। దదామిబుద్ధియోగం తం యేనమాముపయాంతి తే॥ తేషామేవానుకంపార్థ మహమజ్ఞానజం తమః। నాశయామ్యాత్మభావస్థో జ్ఞానదీపేనభాస్వతా" అని భగవంతుఁడగు శ్రీకృష్ణుఁడు అర్జునునకానతిచ్చెను. ఈయర్థము చెప్పఁబడుచున్నది.

బాల్యాదిష్వపి జాగ్రదాదిషు తథా సర్వాస్వవస్థాస్వపి
వ్యావృత్తాస్వనువర్తమాన మహమిత్యంతస్స్ఫురంతం సదా।
స్వాత్మానం ప్రకటీకరోతి భజతాంయో భద్రయా ముద్రయా
తస్మై శ్రీగురుమూర్తయే నమ ఇదం శ్రీదక్షిణామూర్తయే॥ ౭॥

బాల్యాదిష్వపి — బాల్యము మొదలుగాఁగల యవస

[illegible] — అవస్థలయందును

| | |
|---|---|
| జాగ్రదాదిషు | జాగ్రదవస్థ మొదలయిన యవస్థ యందును |
| తథా | అట్లు |
| వ్యావృత్తాసు | పరస్పరభిన్నములయిన |
| సర్వాసు | సమస్తములయిన |
| అవస్థాస్వపి | అవస్థలయందును |
| అనువర్తమానమ్ | అనువర్తించుచున్న |
| అంతః | లోపల |
| అహమితి | నేను అని |
| సదా | ఎల్లప్పుడును |
| స్ఫురంతమ్ | తోఁచుచున్నవాని |
| స్వాత్మానమ్ | తనయాత్మను గా |
| యః | ఎవ్వఁడు |
| భజతామ్ | సేవించువారలకు |
| భద్రయా | మంగళకరమయిన |
| ముద్రయా | జ్ఞానముద్రచేత |
| ప్రకటీకరోతి | తెలియఁజేయుచున్నాఁడో |
| తస్మై | అట్టి |
| శ్రీగురుమూర్తయే | శ్రీమంతుఁడైన గురువుయొక్క యాకారముగల |
| శ్రీదక్షిణామూర్తయే | శ్రీదక్షిణామూర్తికొఱకు |
| ఇదమ్ | ఈ |
| నమః | నమస్కారము |
| అస్తు | అగుఁగాక |

దేహమునకు బాల్యము మొదలగు నవస్థలు గలుగుచున్నవి. యవస్థలు, ఒకటికన్న నొకటి భిన్నములుగా నుండుచున్నవి. జాగ్రా

వస్థలందు దేహము మాఱుచుండుటయుఁ బ్రత్యక్షము. బాల్యమునందలి శరీరమునకును యౌవనమునందలిశరీరమునకును భేదముకనఁబడుచున్నది. కావుననవి, ఘటపటములయట్లు పరస్పరము భిన్నములని చెప్పనొప్పను. ఇట్లు బాల్యమునందలి దేహముయౌవనంబున లేదు యౌవనమునందలిదివార్ధకంబునందు లేదు. ఆత్మ యిట్లు గాదు. బాల్యాదులయందంతటను శరీరాదులు మాఱుచున్నను, ఆత్మ యొకటిమాత్రము మార్పులేక, ఒకటేవిధముగా "నేను" అనిస్ఫురించుచుండును. బాల్యమునందలిశరీరముకన్నయౌవనమునందలి శరీరము భిన్నముగానున్నను, ఆత్మమాత్రము బాల్యమునందెట్లో, అట్లె యౌవనమునందును "నేను" అనియెంతమాత్రము భేదములేక యేకరసముగాఁ బ్రకాశించుచున్నది. ఆత్మ ఒకయవస్థయందుఁ జేసిన కార్యమును మఱియొకయవస్థయందును స్మరించును. ఒకయవస్థయందు "నావి" యని భావించినదాని మఱియొక యవస్థ యందును నట్లె "నావి" యనియె భావించును. ఆ కార్యము అప్పుడె నశించినను ఈ "నావి" యని భావింపఁబడునది మాఱినను, కర్తగా నున్నవాఁడును భావించినవాఁడునగు ఆత్మ మాత్రము ఒకటే విధముగా నున్నాఁడు. మఱియు, జాగ్రదాద్యవస్థలును ఒకటికొకటి భిన్నములుగాఁ దెలియుచున్నవి. జాగరితము నందు అనుభవింపఁబడిన వస్తువులు, స్వప్నమునందుండవు. అట్లు స్వప్నమునందలివి జాగరితమునందుండవు. ఈరెండును సుషుప్తియందుండవు. ఆత్మయో, ఈమూన్నియవస్థల యందంతటను, మణిహారమునందు సూత్రము వలె, నెడతెగక యేకరసముగా నున్నాఁడనుట యనుభవింపఁబడుచున్నది. ఆత్మ "నేను" అని ఎల్లప్పుడును స్ఫురించుచున్నాఁడు. సర్వావస్థలయందలి దేహేంద్రియాదులన్నియు "నావి" యని యాత్మసంబంధములుగా స్ఫురించుచున్నవి. ఎల్లప్పుడునుందునవియుంగావు. కావున ఆత్మ దేహేంద్రియాది సర్వప్రపంచ విలక్షణమయి పరస్పరభిన్నములయిన వానియందు అనుస్యూతుఁడయియుండువాఁడని తెలియవలెను. [illegible] వలాభిసంధివదలివిహితకర్మములననుష్ఠించు

టచే, జిత్తశుద్ధిఁ బొందియాత్మజ్ఞానేచ్ఛగలవారలగు భక్తులకు, ఎవ్వఁడు, జ్ఞానముద్రను ధరించిన తనదివ్యమంగళాకృతిని జూపుటచే, లేక, వారిహృదయంబున నున్నవాఁడై జ్ఞానదీపంబు గలిగించుటచే తెలియఁజేయునో, అట్టిజ్ఞానోపదేశాగ్రమయి గురుమూర్తిగా నవతరించినశ్రీదక్షిణామూర్తికి నమస్కారము. అని, తాత్పర్యము.

అవతారిక.— ఆత్మయొక్కఁడే సత్పదార్థము నిరూపింపఁబడినది. తక్కినప్రపంచమంతయు భ్రమకల్పితము మిథ్యయని చెప్పఁబడినది. దేహాదులు ఆత్మసంబంధము గలవిగాఁ దెలియుటవలన ఆత్మ కాఁజాలవనియు, దేహాది విలక్షణుఁడాత్మ అహంశబ్ద విషయమనియు నుపదేశింపఁబడెను.

పూర్వపక్షము.— ఆత్మదక్క నితరవస్తువులేనియెడ, సత్యమైన ఆత్మతో, మిథ్యయయిన దేహాదులకెట్లు సంబంధము కలుగును? ఇంతియుగాదు. గురుశిష్య వ్యవహారపూర్వకమయిన తత్త్వోపదేశంబును గలుగదు. ఎవ్వనికి బంధము? ఎవ్వనికి మోక్షము? బంధమునకుం గారణముండదు. మోక్షమునకునుం బ్రసక్తియుండదు. ఉపదేష్టయగు గురువును శాస్త్రాదులును లేకపోవును.

సిద్ధాంతము.— దేహాదిప్రపంచము మిథ్యయే. అయినను మాయచే ఆత్మ వానితో సంబంధము నొందుచున్నాఁడు. ఇదె మాయయొక్క సామర్థ్యము, లేనిదానిఁ గల్పించి దానితో వ్యవహారము గల్గించుట. మయము లేనిదే మాయయనఁగా లేనిది అనియర్థము. అది యనాది, యిట్టిదని చెప్పనలవిగానిది. ఈనానాభేదాత్మకమయిన మహావిచిత్ర ప్రపంచము గల్గించును. ఈసమస్తసంబంధములును సమస్తవ్యవహారములును ఆత్మయందధ్యస్తమయిన అనాదియు ననిర్వచనీయమునగు మాయవలనన ఆత్మసాక్షాత్కారము వఱకు సంభవించును. ఆత్మసాక్షాత్కారము కాఁగానే సమూలముగా నజ్ఞానము నశించుటవలన మాయాకల్

తములయిన యీవ్యవహారము లన్నియు నిశించును. ఇదితత్త్వము ఈ యర్థము చెప్పఁబడుచున్నది.

విశ్వం పశ్యతి కార్యకారణతయా స్వస్వామి సంబంధతః
శిష్యాచార్యతయా తథైవ పితృ పుత్రాద్యాత్మనా భేదతః।
స్వప్నే జాగ్రతివా యఏష పురుషో మాయాపరిభ్రామితః
తస్మై శ్రీగురుమూర్తయే నమఇదం శ్రీదక్షిణామూర్తయే॥౮॥

| | |
|---|---|
| యః | ఏ |
| ఏషః | ఈ |
| పురుషః | జీవుఁడు |
| మాయాపరిభ్రామితః | మాయచే భ్రమింపఁ జేయఁబడిన వాఁడై |
| స్వప్నే | కలయందుఁగాని |
| జాగ్రతివా | జాగ్రదవస్థయందుఁగాని |
| విశ్వమ్ | ప్రపంచమును |
| కార్యకారణతయా | పుట్టినదగుటచేతను పుట్టించునదియగుటచేతను |
| స్వస్వామిసంబంధతః | తనదిఅనుసంబంధముచేతను, సొమ్ముగలవాఁడను సంబంధముచేతను, గృహక్షేత్రధనాదులు తనవనియు తానువానికిస్వామియనియు ననుట- |
| శిష్యాచార్యతయా | శిష్యుఁడగుటచేతను గురువగుట చేతను |
| తథైవ | అట్లె |

| | |
|---|---|
| పితృపుత్త్రాద్యాత్మనా | తండ్రి కొడుకు మొదలుగాఁగలరూపముచేతను |
| భేదతః | భేదముచే |
| పశ్యతి | చూచుచున్నాఁడో |
| తస్మై | అట్టి |
| శ్రీగురుమూర్తయే | శ్రీమంతుఁడగు గురువుయొక్క యాకారముగల |
| శ్రీదక్షిణామూర్తయే | శ్రీదక్షిణామూర్తికొఱకు |
| ఇదమ్ | ఈ |
| నమః | నమస్కారము |
| అస్తు | అగుఁగాక |

ఈ సర్వప్రాణులకును బ్రత్యక్షముగాఁ గనఁబడుచున్న యీ జీవుఁడు మాయకు లోఁబడినవాఁడై, ఈ ప్రపంచము పరమార్థమున బ్రహ్మమెయయ్యును, ఇందుఁ గొన్ని కార్యములనియు కొన్ని కారణములనియు, కొన్ని గృహక్షేత్ర ధనాదులు అనియు కొందఱు వానికిస్వాములనియు, కొందఱు శిష్యులనియు కొందఱు ఉపదేష్టలగు గురువులనియు, తండ్రి అనియు కొడుకనియు, ఇట్లు నానావిధములుగా భేదములున్నట్లు చూచుచున్నాఁడు. పరమార్థమున ఇవి యన్నియుఁ గల్ల, అజీవుఁడె పరమాత్మ, అట్టి పరమాత్మస్వరూపుఁడై భక్తులకు జ్ఞానోపదేశము కొఱకు శ్రీగురుమూర్తిగా నవతరించిన శ్రీదక్షిణామూర్తికి నమస్కారము.

అజ్ఞానావిష్టుఁడగువాఁడు మాయాపరిభ్రమితుఁడై కార్యకారణరూపమునను స్వస్వామి రూపంబునను గురుశిష్య రూపంబునను పుత్త్రపిత్రాదిరూపంబునను ఇట్లు ఒక్కవస్తువునే ప్రపంచరూపంబున నానావిధ భేదములచే గ్రహించుచున్నాఁడనుట ఈ శ్లోకమున [illegible]గా నిరూపింపఁబడెను.

మాయచేతనే నానాభేదాత్మకమైన ప్రపంచము దోఁచునని, జ్ఞానకాలమునందు అద్వితీయమయిన యాత్మమాత్రమె యున్నదని తెలియవచ్చును" అనునీయర్థము మొదటి శ్లోకంబుననే నిరూపిత మయ్యెను. కావున జ్ఞానసిద్ధిపఱకు ఈవ్యవహారమిని పునరుక్తికవసరము కానరాదు. ఇంతియుగాదు. జ్ఞానములేనివానికి శిష్యునకు సరెఅజ్ఞానంబునమాయచే భేదబుద్ధి తోఁచుటచే గురువు నాశ్రయించుట యుపపన్నము. జ్ఞానియగు గురువునకు భేదబుద్ధిలేమిగదా! అతండెట్లు శిష్యున కుపదేశింపగలఁడు? కావునఁ దత్త్వోపదేశము సంభవింపదనుట తదవస్థమె యగుచున్నది. కాబట్టి, ఈశ్లోకార్థమిట్లు వివరింపఁదగును.—

అవతారిక.— ఆత్మయొకఁడే సత్యమనియు తక్కినప్రపంచమంతయు మిథ్యయనియుఁ జెప్పఁబడెను. అజ్ఞాననాశమైజ్ఞానముపొందినపిమ్మట ఈమిథ్యాభేదబుద్ధి మాయమగును. అట్టిజ్ఞానము సద్గురూపదేశముననే కలుగవలెననియు వచింపఁబడెను.

పూర్వపక్షము.— జ్ఞానికి భేదబుద్ధియుండదు గదా! భేదబుద్ధిపూర్వకమయిన తత్త్వోపదేశము ఎట్లుఘటిల్లును? జ్ఞానియగు గురువునకు భేదబుద్ధిలేనియెడ నతండు శిష్యునకు ఎట్లుపదేశించును? గురువు తనకు భిన్నుండు శిష్యుఁడని తలంచియే యుపదేశము సేయవలయు. అభేదబుద్ధిలేనిచోనది సంభవింపదు. ఇఁకజ్ఞానికాని వానికి ఉపదేష్టృత్వమె కలుగదు కాఁబట్టి తత్త్వము ఎవ్వరికినిం దెలియకయె యుండవలెను.

సిద్ధాంతము.— తత్త్వోపదేశము సంభవింపకపోదు. మాయకు ఆవరణశక్తియు విక్షేపశక్తియు నను రెండుశక్తులు గలవని ప్రథమశ్లోకవ్యాఖ్యానంబునం జెప్పఁబడెను. అందుమొదటిది యావరణశక్తి జీవులకు ఆత్మజ్ఞానముగప్పును. రెండవది విక్షేపశక్తి యీనానావిధభేదప్రపంచము దోఁపించును. జ్ఞానముచే మొదటిదినశించును. అద్వితీయ సచ్చిదానందాత్మకమయిన యాత్మ యనుభవింపఁ బడును. రెండవది నశింప

ను. మఱియు జ్ఞానముచే సంచితమయిన కర్మము నశించును. ఆగామి కర్మము సంభవింపదు. ప్రారబ్ధము మాత్రము భోగము చేతనె నశింపవలెను. ఈ ప్రారబ్ధ మందు నందును కవిక్షేప శక్తియు నుండును. ప్రారబ్ధము నశించువఱకు, జ్ఞానికిని భేదబుద్ధి యున్నట్లుండును.

పూర్వపక్షము.—— ఆత్మజ్ఞానము గలిగియు భేదబుద్ధి యుండు ననుటయు, అందును ఉన్నట్లుండుననుటయు చోద్యము. భేదబుద్ధి యున్నచో, అజ్ఞానిజ్ఞానులకు భేదములేదు.

సిద్ధాంతము.—— ఉన్నది భేదము. అజ్ఞాని మాయకు లోఁబడి భేదబుద్ధి కలిగియుండును. జ్ఞాని మాయను అతిక్రమించినవాఁడై భేదబుద్ధి కలిగియున్నాఁడు. అజ్ఞాని తెలియక భేదమును నమ్ముచున్నాఁడు. జ్ఞాని తెలిసి భేదమును జూచును. అజ్ఞాని భేదము సత్యమని గ్రహించుచున్నాఁడు. జ్ఞాని భేదమును అసత్యమని గ్రహించుచున్నాఁడు. అజ్ఞాని ఈ భేదబుద్ధిచే భయశోక మోహాదులం బొందుచున్నాఁడు. జ్ఞాని యవి పొందఁడు.

పూర్వపక్షము.—— ఇద్దరును భేదబుద్ధి గలవారలు. అందు అజ్ఞాని భయాదులం బొందును. జ్ఞాని యవి పొందఁడనుట విరుద్ధము.

సిద్ధాంతము.—— విరుద్ధము కాదు. భయశోక మోహాదులకు, భేదము సత్యమను భ్రాంతి కారణము. అది లేనియతఁడు భేదముఁ జూచుచున్నను భయాదుల బొందఁడు. కృత్రిమ సర్పమును జూచి, యది సత్యసర్పమని భ్రమించినవాఁడు భయపడును. అది కృత్రిమమని తెలిసినవాఁడు భయపడఁడు. శిల్పి నైపుణ్యాదులు చూచి వినోదించును. స్వప్నమునందు సత్యబుద్ధి యున్నపుడు భయ సుఖాదులు గలుగుచున్నవి. ఒకానొకప్పుడు స్వప్నమునందు ఇది స్వప్నము సత్యముగాదు అని తెలియుచున్నది, స్వప్నపదార్థములను జూచుచున్నను అనుభవించుచున్నను, వానియందు సత్యబుద్ధి లేనందున భయాదులు గాని సుఖాదులు గాని కలుగవు. అప

డు, తటస్థుని యట్లు పురుషుఁడు సర్వము వ్యవహరించును. మఱియు, భయంకర వేషము వేసిన నటునిఁజూచి, తెలియనివారలు భయపడినను, వేషము వేసినవానిఁ దెలిసినవారలు "వీఁడు మన భద్రుఁడు." అని, యెంత మాత్రము భయాదులం బొందక, యుదాసీనులై వేడుకమాత్రము చూతురు. ఇట్లు సత్యభ్రాంతి లేమిం జేసి భేదముఁ జూచుచున్నను జ్ఞానికిఁ దాదాత్మ్యములు కలుగవు.

ఆ ప్రారబ్ధము కొందఱికి ఒకజన్మముననె నశించును, కొందఱికి రెండు మూఁడు జన్మములకు నశించును. అంతవఱకు జ్ఞాని నిర్లిప్తుఁడై కిలవెయి నీ విక్షేపము ననువర్తించుచుండును. అట్టి శిష్యవరుని ఉపదేశించును. ఈయర్థము చెప్పఁబడుచున్నది.

> విశ్వం పశ్యతి కార్యకారణతయా స్వస్వామి సంబంధతః
> శిష్యాచార్య తయా తథైవ పితృ పుత్రాద్యాత్మనా భేదతః।
> స్వప్నే జాగ్రతివా యఏష పురుషో మాయాఽపరిభ్రామితః
> తస్మై శ్రీగురుమూర్తయే నమఇదం శ్రీదక్షిణామూర్తయే॥

| | |
|---|---|
| యః | ఏ |
| ఏషః | ఈ |
| పురుషః | పురుషుఁడు |
| మాయాఅపరిభ్రామితః | మాయచే భ్రమింపఁ జేయఁబడినవాఁడై |
| స్వప్నే | కలగనుచుండఁగాని |
| జాగ్రతివా | జాగ్రదవస్థయందుఁగాని స్వప్నము నందైనను అట్లె జాగ్రత్తునందు ననుట |
| విశ్వమ్ | ప్రపంచమును |
| కార్యకారణతయా | పుట్టినదగుటచేతను పుట్టించునద గుటచేతను |
| స్వస్వామిసంబంధతః | తనదియను సంబంధముచేతను సొమ్ముగలవాఁడను సంబంధముచేతను |

| | |
|---|---|
| శిష్యాచార్యతయా | శిష్యుఁడగుటచేతను గురువగుటచేతను |
| తథా ఏవ | అట్లె |
| పితృపుత్త్రాద్యాత్మనా | తండ్రికొడుకు మొదలుగాఁగల రూపముచేతను |
| భేదతః | భేదముచేత |
| పశ్యతి | చూచుచున్నాఁడో |
| తస్మై | అట్టి |
| శ్రీగురుమూర్తయే | శ్రీమంతుఁడగు గురువుయొక్క యాకారముగల |
| శ్రీదక్షిణామూర్తయే | శ్రీదక్షిణామూర్తికొఱకు |
| ఇదమ్ | ఈ |
| నమః | నమస్కారము |
| అస్తు | అగుఁగాక |

అజ్ఞానులు, మాయకు లోఁబడినవారగుటచే, భేదబుద్ధినొంది శోకమోహంబులం బడుదురే కాని జ్ఞానియగు వాఁడు అట్లు కాఁడు. అతండు మాయకులోఁబడఁడు. జ్ఞానము నొందినంతనె మాయయొక్క ఆవరణశక్తి నశించును గాన, స్వప్నంబున నిది స్వప్నమని తెలిసినపుడు ఎట్లు అప్పటి విషయములు మిథ్యయని తెలియుటచే భయదుఃఖాదులం బొందఁడట్లు జాగ్రత్తయందలి విషయములును స్వప్న విషయముల వలె మిథ్యయని తెలియుటవలన వానింజూచి జ్ఞాని శోకమోహాదులం బొందఁడు. అతండు నానాభేదాత్మకమైన యీప్రపంచమంతయు, ఆయాయి భేదములచేఁ జూచుచున్నను బ్రహ్మాకారముగా ననుభవించుచుండును. స్వప్నమునందు, ఇది స్వప్నమని తెలిసినపిదప స్వప్నాంతమువఱకు భ[illegible]కాములు పొందకయె తద్విషయము లనుభవింపఁబడునట్లు, జ్ఞానికి, ప్రారబ్ధము నశించుపర్యంతము, శోకమోహములు గల్గింపకయె, భేదాత్మక ప్రపంచవిక్షేపము తోఁచుచుండును. ఈవిక్షేపము ప్రారబ్ధము నశించు పర్యంతము ఉండును. ఆపిమ్మటఁబునరావృత్తి రహితమైన బ్ర

హైన్స్క్యమునొందును. అంతవఱకు నిర్లిప్తుఁడై శిష్యోపదేశము మొదలగు సర్వవ్యవహారములును జేయుచుండును. అని, తాత్పర్యము.

అవతారిక.— సర్వానర్థంబులును అజ్ఞానంబున గలుగుచున్నవి. అయ్యజ్ఞానంబు జ్ఞానంబుచే నశించును. ఆత్మజ్ఞానంబున సర్వానర్థంబులుం దొలంగును. అని చెప్పంబడినది. అందు ఆత్మజ్ఞానంబునకు సాక్షాత్సాధనమైన విచారమునందధికారము లేనివారలు సగుణేశ్వరోపాసనంబు గావింపవలెను. సగుణేశ్వరోపాసనంబునఁ బాపక్షయమై చిత్తశుద్ధిగలిగ జ్ఞానేచ్ఛనొంది జ్ఞానార్థము విచారము సేయుదురు. విచారంబుచే జ్ఞానంబునొందుదురు.

పూర్వపక్షము.— ఇది విచిత్రము. ఒకవిషయమునందు అధికారులు కొందఱు కొందఱనధికారులని యుపదేశమునందుఁ దారతమ్యము కల్పించుట పక్షపాతముగదా! రోగమునకేదియౌషధము విధింపఁబడెనో ఆరోగముగలవానికి దానినయియ్యవలెను, అట్లు సంసారరోగనివర్తకమయిన యుపాయమే అందఱకు నుపదేశింపఁదగు. జ్ఞానేచ్ఛయుఁ గొందఱకుఁ గలుగును గొందఱకుఁ గలుగదనుటయు నసంభావితము, ఉత్తమమగుదానినే యందఱుం గాంక్షింతురు. తెలియనివారికిని, ఇది యుత్తమమని చెప్పి దానినే యుపదేశించుట యుక్తము. వారు మొదటమొదట అనుసరింపకున్నను, క్రమక్రమముగాఁ దెలిసి యామార్గమునే యనుసరింపఁగలరు.

సిద్ధాంతము.— జిజ్ఞాసువునకుపదేశింపవలెను. ఎవ్వఁడెది తెలియఁగోరునో అతనికది తెలియఁజెప్పుట యుక్తము. వాఁడు తెలియఁగోరకున్నను అతనిస్థితికి ఏది యుక్తమో అదియు చెప్పఁదగును. ఇతరము నుపదేశించుట నిరర్థకమగును, ఇంతియగాదు విపరీతముం గలిగించును.

ఒకానొకఁడు కూలిచేసికొని జీవించును, అతఁడు ప్రతిదినమునకు రెండణాలకూలికై వెదకుచుండును. అతఁడు "నేఁడు నాకెచ్చటఁ గూలిపని దొరకునో ఆస్థలము దయతో 'జెప్పుఁడు' అని యడిగినచో నడుగంబడినవాఁ

డతనికేమిచెప్పుటయుక్తము? "అదిగో ధనవాసునింట మెండుగాఁబని
జరుగుచున్నది అచ్చటికిఁబోయినచో నీకుఁగూలిదొరకును" అనియొకఁడాచె
ప్పవలెను! అట్లుగాక, అంతకునుత్తమము నేకోరుదురన్న యెన్నికను"
రాజునొద్దకుఁబోయిమంత్రిపదంబు నొందుము, నీకాపిమ్మటఁగూలిచేయు
కష్టముకలుగదు "లేక" నీవురాజత్వమునవలంబించి దేశముఁబాలింపుము,
సుఖముగా నుండవచ్చును" అని చెప్పినయెడ, అతనికదియుపయోగించు
నా? ఈమహోపదేశము నతండనువర్తించిచో ఆదినము గంజికిలేకపో
వుటయుకాక నానావిధములఁ భంగపడును.

లోకము సాధారణముగా అనాదియగు నవిద్యచే బద్ధమై నానావి
ధవిషయవాసనలంజిక్కుపడియున్నది. ప్రతిమనుష్యుఁడును విషయము
లనేకోరుచున్నాఁడు. వానికి విషయములనిత్యములు వానింగోరవలదని చె
ప్పినంత నతండుమానునా? ఈవిషయవాసనయిప్పటిదికాదు. అనాది
గారూఢమూలమైయున్నది, అదిపట్టిమాటలచేఁబోవునదికాదు. కాల
క్రమముచేత బహుపుణ్యపరిపాకమునం బోవలెను. తదర్థమైవిషయము
లపొసంగకన్యకలాపంబును దేవతోపాసనంబును విధింపఁబడినవి. విష
యములకొఱకై దేవతోపాసనాదులుగావించుచుండుటచేఁ గ్రమక్రమ
ముగా నవ్విషయములమీఁదికన్నను ఆదేవతాదులమీఁది యనురాగంబు
అతిశయించును, పిమ్మట విషయానురాగంబునశించి దేవతారాగంబు
మాత్రమునిలుచును. అదిభక్తియనంబడు.

భోగార్థమైయే యందఱు ధనాదులఁగడింతురు. భోగమునంద
లియాశచే, భోగసాధనములగు ధనాదులయందలి యాశ గలుగుచున్న
ది. క్రమక్రమమున, ధనాశమిక్కిలి భోగాశతగ్గుటం జూచుచున్నారము. లు
బ్ధుఁడగువాఁడు ధనము నార్జించుచున్నాఁడు. వాఁడట్లార్జించుటకు మొదట
భోగాశయె కారణమని చెప్పవలెను. ధనముగడించినపిదప దమ్మిడినై
న నుపయోగింపనొల్లఁడు. కడుపార భోజనమైనిసేయనొల్లఁడు. ఎందు
వలన? వానిభోగాశ ధనాశచే నతిక్రమింపఁబడెను. ఇట్లుభోగాశయె

నశించుటవలన, లుబ్ధుఁడు తాను సర్వకష్టములం బడుచు ధనముఁ గాపాడుచుండును. ఇవ్విధంబున, విషయోపభోగార్థి తద్విషయములకొఱకుఁ గర్మోపాసనాదుల నభ్యసించి, తుదకు, ఇష్టదేవతయం దధికానురాగంబునొంది, పరిక్షీణవిషయానురాగుం డగును. క్రమంబున, ఇష్టదేవతాభక్తి యతిశయించి, విషయానురాగమె నశించును. అట్టివానికి విషయము లనిత్యములని యుపదేశించుట నిరర్థము. వ్యర్థముగా డబ్బు సెలవు గలిగించునట్టి యీభోగములచే నేమిప్రయోజనము? అను నుపదేశము లుబ్ధునకుఁ బ్రియమగును గదా!

అంత నతనికి ఫలాభిసంధిలేక కర్మోపాసనములు చేయుట యుపదేశింపఁదగును. దానఁజేసి యతండు చిత్తశుద్ధియు వైరాగ్యాదులును బొంది ఆత్మజ్ఞానముఁ గోరును.

అట్లు జ్ఞానేచ్ఛ గలుగుటయు దుర్లభము. జనులు సాధారణముగా మాటలచే జ్ఞానము గోరవచ్చును. యథార్థముగాఁ గోరుట దుర్లభము. ఆత్మదక్కఁ దక్కిన ప్రపంచమంతయు నిస్సారము దుఃఖకారణము మిథ్యయని చెప్పినచో, ప్రతిమనుష్యుఁడు, "నా పెండ్లాము నాకొడుకు నాయిల్లువాకిలి అంతయు నిస్సారమా? ఇవన్నియు దుఃఖకరము లెట్లు? నాకు సుఖమునే కలిగించుచున్నవి" అనితలంచి వానిపైఁ బ్రీతిమానఁడు. అట్టివానికిఁ గేవలాత్మోపదేశము నిరర్థకము. మఱి ప్రత్యవాయకరము. వానికిఁ గర్మోపాసనాదులయం దధికారము. వానిచే మున్ను చెప్పిన చొప్పునఁ గ్రమముగా విచారమునం దధికారి యగును. విచారముచే జ్ఞానము నొందును.

భగవద్విభూతు లనంతము లవియన్నియు నుపాస్యములు. అందుఁ బ్రధానము, శుద్ధజ్ఞానప్రదమైన యష్టమూర్తివిగ్రహము. తదుపాసన ముత్తమము. ఈయర్థము చెప్పఁబడుచున్నది.

భూరంభాంస్యనలోఽనిలోఽంబర మహర్నాథో హి
మాంశుః పుమాన్ । ఇత్యాభాతి చరాచరాత్మకమిదం

యస్యైవ మూర్త్యష్టకమ్ ॥ నాన్యత్కించన విద్యతే
విమృశతాం యస్మాత్పరస్మాద్విభోః తస్మై శ్రీ గు
రుమూర్తయే నమ ఇదం శ్రీదక్షిణామూర్తయే ॥ ౯ ॥

| | |
|---|---|
| భూః | భూమి |
| అంభాంసి | జలములు |
| అనలః | అగ్ని |
| అనిలః | వాయువు |
| అంబరమ్ | ఆకాశము |
| అహర్నాథః | సూర్యుఁడు |
| హిమాంశుః | చంద్రుఁడు |
| పుమాన్ | పురుషుఁడు |
| ఇతి | అనెడు |
| చరఅచరఆత్మకమ్ | జంగమస్థావరములు రూపముగాఁ గల |
| ఇదమ్ | ఈప్రపంచము |
| యస్యఏవ | ఎవ్వనియొక్కయె |
| మూర్తిఅష్టకమ్ | రూపములయొక్క యెనిమిదిగా |
| ఆభాతి | ప్రకాశించుచున్నదో |
| విమృశతామ్ | విచారించువారలకు |
| యస్మాత్ | ఏ |
| విభోః | వ్యాపకుఁడైన |
| పరస్మాత్ | ప్రకృతికన్నభిన్నుఁడైన ఆత్మకన్న |
| అన్యత్ | ఇతరము |
| కించన | కొంచెమైనను |
| నవిద్యతే | ఉండదో |
| తస్మై | అట్టి |
| శ్రీగురుమూర్తయే | శ్రీమంతుఁడగు గురువుయొక్కయాకారముగల |
| శ్రీదక్షిణామూర్తయే | శ్రీదక్షిణామూర్తికొఱకు |

| | |
|---|---|
| ఇదమ్ | ఈ |
| నమః | నమస్కారము. |
| అస్తు | అగుఁగాక |

ఉపాసకులగు వారలు, "భూమి జలము అగ్ని వాయువు ఆకాశము సూర్యుఁడు చంద్రుఁడు పురుషుఁడు" అను నెనిమిది మూర్తులచే దృశ్యమైన యీ జంగమ స్థావరాత్మకమగు నీప్రపంచమురూపంబున నున్న యీయష్టమూర్తిని బరమేశ్వరు నుపాసించు చున్నారో, విచారము గావించువారలు ఏయాత్మను దెలిసి ఆత్మకన్న నితరమేమియు లేదనియు ఈ దృశ్యమంతయు మిథ్యయనియుఁ దెలిసికొనుచున్నారో, అట్టి భక్తులకు జ్ఞానోపదేశము కొఱకు శ్రీగురుమూర్తిగా నవతరించిన శ్రీదక్షిణామూర్తికి నమస్కారము. అని, తాత్పర్యము.

ఇఁక, ఏతత్ స్తోత్ర పాఠాదుల వలనం గలుగుఫలముఁ జెప్పుచు ప్రకరణ ముపసంహరింపఁ బడుచున్నది.—

సర్వాత్మత్వమితి స్ఫుటీకృత మిదం యస్మాదముష్మిన్ స్తవే
తే నాస్యశ్రవణా త్తదర్థమననా ద్ధ్యానాచ్చ సంకీర్తనాత్
సర్వాత్మత్వ మహావిభూతి సహితం స్యాదీశ్వరత్వం స్వతః
సిద్ధ్యే త్తత్పున రష్టధా పరిణతం చైశ్వర్య మవ్యాహతమ్॥౧౦॥

| | |
|---|---|
| యస్మాత్ | ఎందువలన |
| ఇతి | ఇట్లు |
| అముష్మిన్ | ఈ |
| స్తవే | స్తోత్రమునందు |
| సర్వాత్మత్వమ్ | అంతయు ఆత్మయగుట |
| స్ఫుటీకృతమ్ | వెల్లడి చేయఁబడినదో |
| తేన | అందు చేత |
| అస్య | ఈస్తోత్రముయొక్క |
| శ్రవణాత్ | వినుటవలనను |
| తత్ అర్థమననాత్ | ఆయర్థమునుయుక్తులచే నాలోచించుటవలనను |
| ధ్యానాత్ | ధ్యానించుటవలనను |

| | |
|---|---|
| సంకీర్తనాత్ | చక్కఁగా చెప్పుటవలనను |
| సర్వాత్మత్వమహావిభూతి సహితమ్ | సర్వాత్మభావమను గొప్పసిద్ధితోఁ గూడిన |
| ఈశ్వరత్వమ్ | పరమేశ్వరుఁడగుట |
| స్వతః | తనంతనె |
| స్యాత్ | అగును |
| పునః | ఇంకను |
| అష్టధా | ఎనిమిదివిధములుగా |
| పరిణతమ్ | పరిణమించిన |
| తత్ | ఆ |
| ఐశ్వర్యంచ | ఐశ్వర్యమును |
| అవ్యాహతమ్ | అప్రతిహతముగా |
| సిద్ధ్యేత్ | కలుగును. |

ఈస్తోత్రమునందు, సర్వమును ఆత్మయేయనుట స్పష్టముగానిరూపింపఁబడెను గావున, భక్తుఁడుదీనింజక్కఁగా సద్గురు సకాశంబున విని విన్నయర్థమునుజక్కఁగా యుక్తులచేనాలోచించి,అట్లు శ్రవణ మననములచేసిద్ధించిన "నేనుఆత్మను సర్వరూపుఁడనుబరమేశ్వరుఁడను" అనునర్థమును,వేఱుతలంపులులేక ఒక్కటెతలంపుగా ధ్యానించుట వలనను, అట్లు
త్రించుటవలనను, అణిమాదులకన్నను విలక్షణమయిన సర్వాత్మభావము నొంది, సాధనాంతరాపేక్షలేక తనంతనె శ్రుతి ప్రసిద్ధ సత్యజ్ఞానానంద లక్షణుండగు పరమేశ్వరుండగును; మఱియు మాయాపరిణామములగు నణిమాద్యష్టైశ్వర్యములును, ఎల్లప్పుడును అప్రతిహతముగాఁ బొందును. అని, తాత్పర్యము.

ఇటులు శంకరార్య కృతమగు దక్షిణా। శాస్యవినుతిరత్న
మాంధ్రభాష । వివృతమయ్యె దీన విబుధవంద్యుఁడు సనా।
తనగురుండు మోద మెనయుఁ గాక॥

ఇది చెదలవాడ సుందరరామ శాస్త్రి విరచితంబగు
శ్రీదక్షిణామూర్తిస్తోత్రము నాంధ్రటీక
సమాప్తము.